# ఇప్పుడు! మీముఖ సౌందర్యం గులాబీ పువ్వులాగా వికసించనీయండి. జాన్సన్స్* బేబీ కాంప్లెక్షన్‌క్రీమ్‌తో

## మీచర్మానికి పూరేకులమెత్తదనం సౌకుమార్యం కల్పించండి.

**మీ వర్చస్సుకు మెత్తదనపు స్పర్శ అవసరం**

క్రొత్త జాన్సన్స్* బేబి కాంప్లెక్షన్ క్రీమ్ మీకు పట్టువలె, మెత్తదనం కల్పిస్తుంది. గరుకైన చోట్లను మెత్తగా చేస్తుంది, మిమ్మల్ని పూల సువాసనలలో ముంచెత్తుతుంది.

**మీ వర్చస్సుకు వికాసం అవసరం**

ఒక్క జాన్సన్స్* బేబి కాంప్లెక్షన్ క్రీమ్ మాత్రమే మీ వర్చస్సుకు సహజ సౌందర్యం కల్పించుటకు అవసరమైన అదనపు శ్రద్ధ తీసుకోగలదు. దానిని ప్రతిరోజూ వాడండి. మీ వర్చస్సు క్రొత్త సౌందర్యంతో పునరుజ్జీవం పొందగలగడం చూడగలరు.




ఈ మృదువైన గులాబిరంగు క్రీమ్ మీ ముఖవర్చస్సును సహజవికాసంతో ఉంచుతుంది... దాని వికాసంతో వెంటాడే సువాసన అందాల పూలగుచ్ఛంలా మీ చర్మాన్ని అంటి పెట్టు కొని ఉంటుంది.

Johnson & Johnson*



OBM 1800 TL

# వనిత

స్త్రీ జన మాస పత్రిక

సంపుటి : 4  సంచిక : 6

డిసెంబర్ : 1978

విడి ప్రతి : రెండు రూపాయిలు

సం॥ర చందా : ఇరవైనాలుగు రూపాయలు

శ్రీలంక : రూ. 2-00 (ఇండియా)

మలేసియా : 90 సెంట్స్

చిరునామా :

చందమామ బిల్డింగ్స్

మద్రాసు – 600 026




ఈ పేజీలోని ప్రతి లేఖకూ
చిన్న పారితోషికం–ఐదు రూపాయలు.

రచనలతో యీ సంఘంలో మార్పు తేలేం అన్న డి. కామేశ్వరిగారి మాటలతో ఏకీభవించలేక పోతున్నాను. గతంలో కేవలం సాహిత్యం ప్రేరణగా ప్రపంచంలో ఎన్నో మహత్తరకార్యాలు జరిగాయి. విక్టర్ హ్యూగో రచనలతో ఫ్రాన్సులో ప్రజాస్వామ్యం స్థిరపడింది. టాల్‌స్టాయ్ రచనలతో రష్యాలో మానవత్వం మొలకెత్తింది. బైరన్ మహాకవి కావ్యంతో గ్రీసుదేశం స్వాతంత్ర్యం సంతరించుకుంది. ఇవి చరిత్ర చెప్పిన సత్యాలు. ఈనాడు నాలుగు గోడలమధ్యా కూర్చుని "నాకు తోచిన ఆలోచనలనే నేను రాస్తాను"—అని రచయిత్రి అంటే సమాజం ఒప్పుకోదు. సమకాలీన సమాజాన్ని గురించి రాసే రచయిత్రి యొక్క వ్యక్తిత్వంతో — సిద్ధాంతాలతో — సమాజంతో ప్రమేయం వుంది. వాటిని ప్రశ్నించే హక్కూ వుంది. ఈనాటి కథ - నవలా సాహిత్యాన్ని పరిశీలించినట్లయితే 'స్త్రీ భావదాస్యం' తప్పక కనిపిస్తుంది. రచయిత్రుల ఆలోచనలల్లో - ఆలోచనా స్థాయిలో బానిసత్వభావాలు తప్ప స్వచ్ఛందమైన ఆలోచనాధోరణి కనిపించకపోవడం విచారించదగ్గ విషయం. నిజ జీవితంలో మనం చూస్తున్న వనితల పురోభివృద్ధిని కూడా నేటి రచయిత్రులు తమ రచనలలో ప్రతిబింబించలేకపోతున్నారు. వాస్తవానికి సృష్టికార్యం, గృహనిర్వహణ, సంఘసంక్షేమాల్లో స్త్రీకే ప్రధానస్థానం వుంది. అది ఏ కాలంలోనూ విస్మరించరాని విషయం. నిత్యజీవితంలో వున్న యింతటి మహత్తరస్థానం సాహిత్యంలో ప్రదర్శించకపోవడం స్త్రీ ఎడల అన్యాయం చేసినట్టే అవుతుంది. కథలకు-నవలలకు ఎల్లప్పుడూ కన్నెపిల్లల కమ్మని టెక్నికలర్ కలలే కథావస్తువు కాకూడదు. కథంటే కల్పించినట్టు కాకుండా వాస్తవానికి దగ్గరగా-పాఠకులకు ఆ పాత్ర నిత్య జీవితంలో ఎక్కడో అక్కడ తటస్థపడాలి. ఊహా మూర్తులుగా మిగిలిపోరాదు. అదే నిజమైన ఉత్తమ సాహిత్యం అనిపించుకుంటుంది. మన రచయిత్రులు కూడా తమ పరిథిని దాటి బయట ప్రపంచాల్ని నగ్నంగా పరిశీలించడానికి అలవాటు పడిననాడు ప్రపంచంలో ఏనాడూ ఎవరూ - కనీవినీ ఎరుగని ఉజ్వలమైన మార్పు మన తెలుగు సాహిత్య సీమలో వచ్చి తీరుతుందని నేనాశిస్తున్నాను.

అంగర శ్రీదేవి — విశాఖపట్నం

లోకంలో 'లోపం' లేని మనిషే లేడు. కొందరికి పుట్టుకతోను, మరి కొందరికి మధ్యలోను లోపం రావచ్చు. ప్రతి మనిషికి ఏదో ఒక లోపం వుండే లాగనే భగవంతుడు సృష్టిస్తాడు. అలా లోపమున్నా కూడా కన్నుమిన్ను గానక గర్వంగా తిరుగుతూ, లోపం వున్నవాళ్ళను హేళన చేస్తూ, తన లోపాన్ని తాను తెలుసుకోకుండా, వారి మనస్సులను రంపపు

ఈ సంచికలోని 'ఆశలజీవితం' (23 వ పేజీ) చిన్నకథను రాసిన శ్రీమతి ఆదూరి సత్యవతీదేవి భర్త ఉ[illegible] రీత్యా (పోర్ట్ ట్రస్ట్) విశాఖపట్నంలో వుంటున్నారు. చిన్నతనం నుంచి, సాహిత్యం మీద అభిలాష. ఆ అభిలాషే ఆమె చేత రచనలు చేయించింది. 1969 లో ఆమె తొలిసారిగా కథ రాశారు; అది 'కథాంజలి' లో వచ్చింది. అప్పట్నుంచి అడపాదడపా ఆమె రచనలు చేస్తున్నారు. ఆమె రాసిన కొన్ని పాటలు 'ఆకాశవాణి' లో ప్రసారమైనాయి. "నాకు రాయడం కన్న, చదవడం మీదే ఎక్కువ మక్కువ" అని చెప్పే - సత్యవతీదేవి దంపతులకు ఇద్దరు అబ్బాయిలు సంతానం.



మనదేశంలోని బాలల స్థితిగతులు ఎలా వున్నాయి ?
వాళ్ల పెంపకం, పోషణా ఎలా వుంది ?
చదువులు, ఆరోగ్యమూ ఎలా వున్నాయి ?
ప్రభుత్వం బాలల వికాసానికి ఏం చేస్తున్నది ?—
తల్లిదండ్రులు ఏం చెయ్యాలి ?—
రేపటి పౌరులైన నేటి బాలల్ని ఎలా తీర్చిదిద్దాలి ?

వచ్చే సంవత్సరం – అంతర్జాతీయ బాలల సంవత్సరం. ఆ సందర్భంగా బాలల ఆహారానికీ, ఆరోగ్యానికీ, చదువుకూ సంబంధించిన వ్యాసాలు....

—వచ్చే సంచికలో

## ముఖ చిత్రం:



కొందరు ఏదో ఒక కళ అభ్యసిస్తారు - అందులో ప్రవీణులవుతారు. కొందరు, ఒక్క కళతోనే తృప్తి పడరు. అన్నీ సాధించాలనీ, అన్నింట్లోనూ ముందంజ వెయ్యాలనీ అనుకుంటారు. అట్ట మీద కనిపిస్తున్న కుమారి గీత, అలాంటి అమ్మాయి. సొంత వూరు కూచిపూడి కాబట్టి అక్కడే చక్కగా నాట్యం నేర్చుకుని, అక్కడి కార్యక్రమాల్లో పాల్గొన్నది. స్కూల్ ఫైనల్ చదువుకుంది. చదువుకుంటున్న రోజుల్లో నాటకాల్లో నటించింది; బహుమతులూ పుచ్చుకుంది! కనిపించిన ప్రతి పుస్తకం చదువుతుంది; పుస్తకాలు చదవడం, అవి బాగా గుర్తు పెట్టుకోడం - ఆమె లక్షణం. ఎక్కువగా సినిమాలు చూస్తుంది; వివిధ సాంస్కృతిక కార్యక్రమాలూ చూస్తుంది. పాటలు పాడుతుంది; పాశ్చాత్య నాట్యం కూడా నేర్చుకుంది; గుర్రపు స్వారీ తెలుసు; కారు డ్రైవింగ్ తెలుసు; ఈత కొట్టడం తెలుసు! ఇన్ని నేర్చుకుంటూ, ఇన్నింటిలోనూ ఉత్సాహం చూపిస్తున్నా - ఇంటి పని కూడా శ్రద్ధగా చేస్తుంది. మొక్కలు పెంచడం మరో హాబీ!

మద్రాసులో వుంటున్న గీత — ఆ మధ్య హైద్రాబాదు వెళ్తే, అక్కడి టి. వి. నాటకాల్లో అవకాశం వచ్చింది. రెండు నాటకాల్లో నటించింది. 'నీకు అన్ని విద్యలూ, నటనా కూడా తెలుసు గదా. సినిమాల్లో కూడా వెయ్యకూడదా' అని కొందరు పెద్దలు సలహాలిస్తే - అందులో కూడా ఉత్సాహం చూపించింది. ఆ ఉత్సాహంతోనే గీత - 'మార్పు' చిత్రంలో తొలిసారిగా వేసింది. ఈ మధ్యనే 'తాయారమ్మ బంగారయ్య'లో కూడా వేసింది.

"ఇప్పుడు నటించడం మీద ఉత్సాహం ఎక్కువైంది. అవకాశాలు వస్తే - నటిగా స్థిరపడదామనుకుంటున్నాను." అంది గీత.

**వర్ణచిత్రం: కె. ఆర్. వి. భక్త**

కోత కోస్తూ, జీవితం మీదే వారికి విరక్తి కలుగజేస్తుంటారు కొందరు మనసు లేని మనుషులు. లోపం వుండడమే మహాపాపంగా భావించి, బ్రతుకే వ్యర్థమని నిరాశ చెందిన ఎంతోమందికి 'వనిత' చేయూతనిచ్చి, వాళ్ళు కూడా తమ బ్రతుకులను ధన్యం చేసుకుని, నలుగురిలో నిలబడగల ధైర్యాన్ని, ఆత్మవిశ్వాసాన్ని పెంచి, బ్రతుకుపై ఆశ చూపించే 'జ్యోతి'గా రూపొందుతుంది. జన్మతః అంధులైన సోదరీమణులను, వాళ్ళు సరిగ్గా లేకపోయినా, ఇంకొకరి మీద ఆధారపడకుండా, తన కాళ్ళపై తాను నిలబడగల శక్తిని సంపాదించుకుని, అటువంటి ఎంతోమందికి మార్గదర్శకురాలైన బరిందర్, స్టేట్ హోమ్ ద్వారా 'మూడు పువులు - ఆరు కాయలు'గా వున్న జీవితాన్ని అనుభవిస్తున్న సీత - ఇటువంటి ఎంతోమందిని 'వనిత' తన పాఠకులకు పరిచయం చేయడం నిజంగా వనిత పాఠకులు చేసుకున్న పూర్వజన్మ సుకృతం. వారే పరిచయం కానిపక్షంలో నిరాశానిస్పృహలతో నిండిన ఎంతో మంది జీవితాలలో 'వెలుగు' అన్న మాటకు అర్థం లేకుండా పోవచ్చు.

**విస్సా అమృతవల్లి** **మద్రాసు**

భార్యాభర్తలిద్దరూ ఏ పని చేసినా ఒకరి మనసు ఒకరు తెలిసికొని చేస్తేనే బాగుంటుంది. తనకు స్వాతంత్ర్యమున్నదని భార్య, తనకే స్వాతంత్ర్యమున్నదని భర్తా ఎవరంతటవారు తమ సంపాదనను ఖర్చు చేస్తే మిగిలేది ఏమీ ఉండదు మానసిక ఆందోళన తప్ప. ఏ పనిచేసినా ఒకరికొకరు తమ హృదయ భావాలను తెలుపుకొని చేస్తే ఆ సంసారంలో సుఖముంటుంది. ఒక వేళ ఏదో సందర్భంలో స్వతంత్రించి చేసినప్పటికీ భర్త మనసు భార్య, భార్య మనసు భర్త గ్రహించి మసలుకొనే విశాల హృదయముండాలి. కాని గోరంత దాన్ని కొండంత చేస్తే ఏం లాభం? నాకు తెలిసిన ఒక దంపతులున్నారు. భర్త ఎవరింటికి పోయినా, ఎవరికేదైనా కానుక పెట్టినా భార్యకు చెప్పడు. ఆమె ఏమో - అతడెక్కడికి వెళ్ళిందీ, ఎవరికేమి కానుకలిచ్చిందీ, ఆరాతీసి కనుగొంటుంది. తరువాత ఇంటిలో ద్వంద్వ యుద్ధం. ఇలా ఒకరి మనసులొకరు అర్థం చేసుకొనకుండా పోట్లాటలతో జీవితాలను గడిపేవారెందరో ఉన్నారు. అలాంటి వారికి చక్కని సందేశాన్నందించే విధంగా ఉన్నది 'తెలిసిన విలువలు' కథ. కథలో ముందు ప్రసాద్ అగ్రహించినప్పటికీ తరువాత పశ్చాత్తాపపడటం చాల సమర్థవంతంగా ఉన్నది. అలాగే తన తండ్రికే పంపినప్పటికీ తన భర్త నడగకుండా పంపినందుకు, ఈసారి ఇలా తొందరపడకూడదు అని అభిప్రాయాన్ని వ్యక్తం చేసిన వసుధ పాత్ర ప్రశంసనీయమైనదే. ఆ విధంగా ఒకరినొకరు భార్యాభర్తలు మనసులర్థం చేసుకొన్నప్పుడే సంసారం సుఖవంతంగా సాగుతుంది. చక్కని కథ రాసిన రచయిత్రికి (శ్రీమతి ప్రేమా లీలారావ్) అందించిన మీకు అభివందనములు.

**గూడ సుమిత్రా రామకృష్ణ** **హైద్రాబాదు**

'దశమగ్రహం' అన్న వ్యాసాన్ని (69 వ పేజీ) రాసిన శ్రీమతి గార్ల సరస్వతి తమ రచనల ద్వారా 'వనిత' పాఠకులకు పరిచితురాలు. చాలా పత్రికల్లో ఆమె వ్యాసాలు, చిన్న కథలు, వంటలు - వచ్చాయి. స్వస్థలం మదనపల్లి. భర్తగారి వ్యాపారరీత్యా మద్రాసులో స్థిరపడ్డారు. తన రచనల్లో ఎక్కువగా స్త్రీల సమస్యలనే, వస్తువుగా తీసుకుంటానని చెప్పే సరస్వతి - ఆకాశవాణి 'మహిళా మండలి' కార్యక్రమాల్లో కూడా కొన్ని ప్రసంగాలు చేశారు. కొత్త రకాల వంటలు కనిపెట్టడం - ఆమెకు సరదా.



నవంబర్ వనితలో డా॥ విమలగారి కవిత అర్థవంతంగా వుంది. చీకటిని తొలగించే దీపాలకన్నా, జాతి గుండెల్లో గూడు కట్టిన నిరాశ నిస్పృహల చీకట్లను తొలగించిన నాడే వెలిగించిన దీపానికర్థం, పరమార్థం.

—వి. సుమిత్రారెడ్డి/ మహబూబ్‌నగర్

రచయిత్రులు వాస్తవిక దృక్పథం'లో రచయిత్రిగారు వెల్లడించిన భావాలు పూర్తి సమంజసంగా లేవు. నేడు అసంఖ్యాకంగా రచయిత్రులు పుట్టుకొస్తున్నారు. వీరిలో పలువురికి నిస్సందేహంగా డిగ్రీలున్నాయి. అటువంటప్పుడు వారికి కొద్దో గొప్పో రాజకీయ పరిజ్ఞానం, విద్యా విధానాల్లోని లోటుపాట్లు తెలిసే ఉంటాయి. ఉండి తీరాలి. మరి ఎంతమంది ఆ వాతావరణాన్ని తమ రచనల్లో ప్రవేశపెడ్తున్నారు? ఎంత సేపూ భార్యాభర్తల తగవులు, కుటుంబ కలహాలు, ప్రేయసీ ప్రియుల విరహ వేదనలు అన్న ధోరణిలోనే సాగిపోతున్నవి. ఆ పరిధిని రచయిత్రులందరూ దాటగలిగినప్పుడే స్త్రీ రచనలకు విశిష్టత కలుగుతుంది.

—జి. శ్రీమతి, తిరుపతి

నవంబర్ నెల సంచికలో డి. కామేశ్వరిగారి వ్యాసం నన్నెంతో ఆనందపరిచింది. అసలు వాస్తవిక దృక్పథం అంటే ఏమిటి అనే విషయాన్ని చాలా చక్కగా వివరించారు. —ఎ. మణి, ఖమ్మం

నవంబరు నెల వనితలో కచ్‌వర్క్ అల్లిక బాగుంది. మంగళాకందూర్‌గారికి మా హృదయపూర్వక వందనములు. 'నుదుట తిలకం' బాగుంది. 'తెలిసిన విలువలు' కథానిక నన్ను ఎంతగానో ఆకర్షించింది. నాగులచవితి గురించి తెలియని విషయాలు తెలియచేశారు. దీపావళి పండుగ సందర్భంగా అందజేసిన (రవివర్మ చిత్రం) కానుకకు మా ధన్యవాదాలు.

—కస్తూరీ నకుల్కర్, బెల్లంపల్లి

దీపావళి' అభినందనలు తెలుపుతున్న అలర్‌మేర్‌వల్లి ముఖచిత్రంతో వెలువడిన 'వనిత' మా ఇంటిల్లిపాది




నెంతో ఆనందపరచింది. ఈ వనితలో అన్ని శీర్షికల్లోకల్లా మాకు నచ్చినది—వితంతు వివాహ యథార్థగాథ 'మా సీత...' ఈ మధ్య వనితలో మంచి కథల కోసం ఎదురుచూసే మాలాంటి వారికి 'నిర్ణయం' కథ, చాలా నచ్చింది. ఎంతోకాలంగా 'కచ్‌వర్క్' నేర్చుకోవాలని ఎంత ప్రయత్నించినా వివరంగా అర్థం కాని నాకు 'వనిత' ద్వారా కచ్‌వర్క్'ను వివరంగా తెలియచేసిన శ్రీమతి మంగళాకందూర్‌గారికి. నా కృతజ్ఞతలు. —ఎల్. జయంతి శోభ, హిందూపూర్

నవంబరు సంచికలో 'బాణాసంచా' తయారు చేయడము, పుట్టు పుర్వోత్తరాలను గురించి మాకు తెలియపరచినందుకు 'వనిత'కు కృతజ్ఞతలు.

—యన్. విజయశ్రీ, పాణ్యం

నవంబర్‌లోని దీప శిఖల ముగ్గు చాల బాగుంది. చూడ్డానికి కొంచెం కష్టమే అనిపించినా, వేసాక చాలా అందంగా కనిపించింది.

—జయశ్రీ, గార్ల

'బామ్మగారి జవాబులు' కుతూహలాన్ని రేకెత్తిస్తున్నవి. 'దీపావళి వేడుకల వెనుక' శీర్షిక ఉపయుక్తంగా ఉంది ప్రయోగనాళికా శిశు పరిణామాలు ఏమిటి?' అన్న చర్చలో వెలిబుచ్చిన ఐదుగురు అభిప్రాయాలూ బావున్నవి.

— బి. శ్రీలక్ష్మి సీతా భ్రమరాంబ, బండారులంక

లోపల



## వనిత మాటల కొలువు - 40

సరైన సమాధానం :

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 అ | భి | 13 ప్రా | య | 14 ము | | 2 పా | 15 త్ర |
| వ | | స | | 3 ఖ | 16 ని | | యు |
| 4 లీ | 17 పి | | 5 స | ము | దా | 18 య | ము |
| 6 ల | త | | ఎ | | 7 న | కా | |
| | 8 డ | 19 మ | రు | 20 క | ము | | 21 ఆ |
| 22 ము | | ల్లి | | ర్ర | | 9 పా | ట |
| స్లి | | య | | | 10 ము | క | తో |
| 11 రు | జో | | 12 లు | కు | కం | | ట |

పై సమాధానంతో సరిపోయే సమాధానం పంపినవారు :

1. సి. మాణిక్యాంబ, నర్సాపూర్ 2. జి. రజని, హనుమకొండ 3. ఎస్. సూర్యకుమారి, తిరుపతి 4. ఎమ్. భానుమతి, కాకినాడ 5. జి. రాధాలక్ష్మి, విశాఖపట్నం 6. ఎన్. స్వరాజ్యలక్ష్మి, హైద్రాబాదు 7. వి. జగదాంబ, నర్సీపట్నం 8. జి. లక్ష్మి, హనుమకొండ 9. ఎమ్. ప్రభావతి, కాకినాడ 10. ఎ. లక్ష్మితులసి, నందివెలుగు 11. ఎస్. లక్ష్మి, కాకినాడ.

బహుమతి మొత్తం రూ. 150 లను వారికి అందజేస్తున్నాము.

వనితలో 'వైకుంఠపాళి' తరువాత మరొక పెద్ద కథ ప్రచురించనే లేదు. త్వరలో ఆ లోటు తీరుస్తారని ఆశిస్తాము. కొత్త శీర్షిక (కూరలు - పోషక పదార్థాలు) ప్రచురిస్తున్నందుకు సంతోషంగా వుంది.

—పూసపాటి విజయలక్ష్మి, చిట్టివలస

'నుదుట తిలకం' వ్రాసిన పద్మావతీదేవిగారు హిందూమతంలో స్త్రీల అలంకార చిహ్నమైన తిలకాన్ని బాగా విశదీకరించారు. 'భర్త లేని స్త్రీలు తిలకం ధరించవచ్చా లేదా?' అన్న విషయంలో వారు వ్యక్తపరచిన అభిప్రాయంతో, అభ్యుదయ భావాలు కల్గిన వనితలందరూ ఏకీభవిస్తారు. మన సంఘంలో తిలకం ధరించుటలో చూపే అభ్యంతరాలను మార్చి వేయటానికి వనితా లోకం కృషి చేయాలి.

—ఇందిరారమణ, హైద్రాబాదు

# ప్రపంచం



అగ్రదేశాలు కూడా అభివృద్ధి సాధించాలంటే చేతులు కట్టుకుని కూర్చుంటే లాభం లేదని నేటి ప్రపంచ చరిత్ర నిరూపిస్తోంది. చైనా కేసి ఒక్కసారి చూస్తే విదేశాల ఆర్థిక, సాంకేతిక సహాయాన్ని కోరుతూ అనేక రంగాలలో ముందడుగు వేయడానికి చైనా అభిలషిస్తున్న విషయం తెలుస్తుంది. జనభాపరంగా ప్రపంచ దేశాలలో చైనాదే మొదటిస్థానం. వైశాల్యం దృష్ట్యా మూడవస్థానం చైనాకి లభిస్తోంది. ముఖ్యంగా వ్యవసాయ ప్రధానమయిన దేశం చైనా.

నిన్నటివరకు చైనా ఇతర దేశాల మీద ఆధారపడకుండా మడి కట్టుకుందని చెప్పుకునేవారు. అయితే ఈ రోజు పరిస్థితులు మారాయి. తమ దేశానికి వచ్చే యాత్రికులని ఆకర్షించడానికి, వారికి అన్ని వసతులు కల్పించడానికి చైనా హంగ్‌కాంగ్‌కి చెందిన వ్యాపారస్తులని తమ దేశంలో పెద్ద పెద్ద హోటళ్ళు నిర్మించమని కోరుతోంది. నూనె వనరులని కనిపెట్టడానికి, కంప్యూటర్లు, ఎలక్ట్రానిక్ పరికరాలు, గడియారాలు తయారు చేయడానికి ఆయా రంగాలలో ముందంజ వేసిన దేశాల సహాయాన్ని చైనా అభిలషిస్తున్నది.

జపాన్, అమెరికాలని, ఐరోపాలోని దేశాలని తమ దేశపు పారిశ్రామిక ప్రగతికి కావలసిన సహాయం చేయమని చైనా అనేక విధాలుగా ఆకర్షిస్తున్నది. అమెరికా దేశపు పారిశ్రామిక వేత్తలతో చైనా ప్రతినిధులు ఈ మధ్యనే హంగ్‌కాంగ్‌లో ఫలప్రదంగా కొన్ని చర్చలు జరిపారు. అయితే ఈ చర్చలలో రెండు దేశాలు కలిసి పరిశ్రమలు నిర్వహించే విషయాన్ని అంగీకరించలేదు. అమెరికా సాంకేతిక విషయాలని తెలియ చేస్తూ, అనుభవజ్ఞులని పంపుతూ ముడి పదార్థాలని అంద చేస్తూ చైనాకి తోడ్పడుతుంది. చైనా ఆ విధంగా తమ కర్మాగారాలలో తయారయిన వస్తువులని అమెరికాకి సరఫరా చేస్తుంది. అనేకమంది అమెరికన్ పారిశ్రామిక వేత్తలు ఉత్పత్తి ఖర్చులు తగ్గడానికి ఈ పద్ధతి ఉత్తమంగా వుందని భావిస్తున్నారు.

అలాగే అమెరికాతోనేకాక జపాన్‌తోనూ చైనా పెట్రోలియం, రసాయనిక పరిశ్రమల అభివృద్ధికి చేతులు కలుపుతుంది. తమ దేశంలో రైల్వేలని మెరుగుపరచడానికి జపాన్ సహాయాన్ని చైనా స్వీకరిస్తోంది. ఇక విద్యుత్ ఉత్పాదనకి కావలసిన బొగ్గుని గనుల నుంచి తీయడానికి అవసరమయిన ఆధునిక యంత్ర సామగ్రిని చైనాకి బ్రిటన్ అంద చేస్తుంది.

వివిధ రంగాలలో మానవజాతికి తమ విజయాల ద్వారా ఎంతో మేలు చేసిన ప్రముఖులకి ప్రతి సంవత్సరమూ నోబెల్ ప్రైజ్ లభిస్తోంది. రసాయనిక, భౌతిక, వైద్యశాస్త్రులలో గణనీయమయిన విజయాలు సాధించిన వ్యక్తులూ, సాహితీరంగంలో ఉత్తమ రచన వెలువరించిన రచయిత, శాంతి కోసం ఎనలేని కృషి చేసిన ప్రముఖుడు ఈ నోబెల్ బహుమతులు అందుకుంటున్నారు.

ఈ సంవత్సరం నోబెల్ శాంతి బహుమతి ఈజిప్టు అధ్యక్షుడు సాదత్, ఇజ్రాయిల్ ప్రధాని బెగిన్‌లకు లభించింది. పశ్చిమాసియాలో సుస్థిరమయిన శాంతి స్థాపించడానికి ఈ ఇద్దరూ చేసిన కృషికి నోబెల్ శాంతి బహుమానం లభించడాన్ని ప్రపంచం హర్షిస్తోంది.

ఈజిప్టు అధ్యక్షుడు సాదత్ ఇజ్రాయిల్‌కి శాంతి దూతగా వెళ్ళి తన ప్రజల కోపతాపాలను లెక్క చేయకుండా బెగిన్‌తో శాంతి చర్యలు జరిపాడు. ఆ తర్వాత అమెరికాలోని క్యాంప్‌డేవిడ్‌లో ప్రెసిడెంట్ కార్టర్ సమక్షంలో రెండు దేశాలు జరిపిన చర్చలు ఒక దారికి వచ్చాయి. శాంతికి బీజం వేశాయి. అయితే సాదత్, బెగిన్‌ల కృషికి ఎంత గుర్తింపు లభించినా అది సుస్థిరశాంతికి తోడ్పడుతుందని రాజకీయ పరిశీలకులు భావించలేకపోతున్నారు.

ఈ రెండు దేశాల మధ్య అనేక సమస్యలు ఇంకా పరిష్కారాన్ని వెదుక్కుంటూనే వున్నాయి. సిరియా, తోటి అరబ్‌దేశం ఈజిప్టుని గతంలో ఇస్రాయిల్‌తో జరిగిన యుద్ధంలో బలపరచడంతో, ఇస్రాయిల్ సిరియాలోని గోలాన్ హైట్స్‌ని ఆక్రమించింది. అలాగే యూదులు కోరే పాలస్తీనా ఏర్పాటు ఇంకా అపరిష్కృతంగానే వుండిపోయింది. వీటి పరిష్కారానికి ఇంకా ఒప్పందాలు కుదరలేదు. ఇస్రాయిల్ ఈజిప్టు సమీపంలో కొత్త యుద్ధ స్థావరాలు నెలకొల్పుతున్నట్లు కలవరం పుట్టించే వార్తలూ వినిపిస్తున్నాయి. ఈ యుద్ధ స్థావరాలు నెలకొల్పడానికి హామీతోనే తన దేశం నుంచి కాంప్‌డేవిడ్‌కి కదిలానని బెగిన్ ప్రకటించి ఆశ్చర్యం కలిగించాడు.

ఈజిప్టు, ఇస్రాయిల్‌ల మధ్య సుస్థిరశాంతికి సాదత్ చేస్తున్న కృషి బెగిన్ కళ్ళు తెరిపిస్తే నోబెల్‌శాంతి బహుమానానికి ఎప్పటిలేని విలువా లభిస్తుందని ప్రపంచం భావిస్తున్నది.

ప్రపంచంలో నాగరికత ఎంతో పెరిగిందని చెప్పుకుంటున్నా అనాగరిక చిహ్నాలు అన్నిచోట్లా కనిపిస్తున్నాయి. ఒకసారి అలా ప్రపంచ ప్రదక్షిణ చేద్దాం.

సెంట్రల్ అమెరికాలో వున్న 'నికరాగ్వా' ఇరవయిలక్షల జనాభాగల దేశం. ఇక్కడ ప్రజల ఆస్తి పేదరికం. ఈ దేశంలో అనేక సహజ వనరులు వున్నాయి. జల విద్యుత్ ఉత్పాదనకి అవకాశాలు పుష్కలంగా వున్నాయి. అయితే ఇన్ని సంపదలు వున్న దేశంలో వాటిని నిరుపయోగంగానే వుంచుతున్నారు. ప్రజలలో అక్షరాస్యత తక్కువ. దేశం సైనికాధికారుల చేతుల్లో వుండడంతో ప్రజాస్వామ్యానికి అడ్డుగోడపడి అభివృద్ధి ఆగిపోయింది. దేశసంపద అంతా పాలకుల చేతుల్లో వుండగా దరిద్రాన్ని ప్రజలకి సమంగా పంచి పెడుతున్నారు ఈ అభివృద్ధి నిరోధకులు. అక్కడి అధ్యక్షుడు సోమోజాని పల్లెత్తు మాట అనిన పౌరుడు తుపాకిగుండ్లకి బలవుతాడు. అధ్యక్షుడు కమ్యూనిస్టు వ్యతిరేకి కావడంతో కమ్యూనిజాన్ని వ్యతిరేకించే అగ్రరాజ్యాలు అతని చర్యలలో సబబే చూస్తున్నాయి.

ఆసియాలో ప్రవేశిస్తే-కంబోడియాలో జరుగుతున్న దమనకాండ రోజు రోజుకి పెరుగుతూనే వుంది. కంబోడియా గురించి అటు పెట్టుబడిదారి వ్యవస్థకి చెందిన దేశాలు కాని, ఇటు సోషలిస్టు దేశాలు కాని ఆఖరికి కమ్యూనిస్టు దేశాలు కాని సానుభూతి చూపడం లేదు.

• పశ్చిమాసియాలో లెబనాన్‌లో వాతావరణం ఆందోళన కలిగిస్తూనే వుంది. అక్కడి సైన్యంలో క్రిష్టియన్లు, ముస్లిమ్‌లు వేరుపడి దేశంలో శాంతిని ఏ మాత్రమూ కాపాడలేకపోతున్నారు. దేశ రక్షణ కోసం లెబనాన్, సిరియా సైనిక దళాలను పిలిస్తే ఈ దళాలు లెబనాన్ సైన్యంలోని ముస్లిమ్‌లతో చేతులు కలిపి మరింత అల్లకల్లోనాన్ని సృష్టిస్తున్నాయి.

అలా అశాంతితో, అల్లకల్లోలాలతో సంపూర్ణ శాంతి, సుస్థిరశాంతి పగటి కలగా మిగిలిపోగా ప్రపంచం 1978 కి వీడ్కోలు చెప్తూ మరో సంవత్సరంలోకి ప్రవేశిస్తున్నది. □

# కుటీర పరిశ్రమ:

# కొవ్వొత్తులు చెయ్యడం

డిసెంబర్ మాసం 'క్రిస్మస్ పండగ'
మాసం. క్రిస్మస్ పండగలోని
కొంత ఆహ్లాదం-కొవ్వొత్తుల కాంతి!
ఈ సందర్భంగా 'కొవ్వొత్తుల తయారీ'
గురించిన-ఈ వ్యాసాన్ని ప్రచురిస్తున్నాము.

ఆ యింట్లో....

అందరూ భోజనాలు చేస్తున్నారు.

హఠాత్తుగా లైట్లు పోయాయి.

వెంటనే ఆ కుటుంబ సభ్యులందరికీ జ్ఞాపకం వచ్చింది ఒక్కటే....

కొవ్వొత్తి!

అక్కడ క్రిస్మస్ వేడుకలు బ్రహ్మాండంగా జరుగుతున్నాయి.

ఆ వేడుకలలో ఒక భాగంగా-క్రిస్మస్ వృక్షంపై రంగురంగుల బెలూన్లు వున్నాయి. వాటన్నిటినీ మించి వింత కాంతులీనుతూ క్రిస్మస్ వృక్షం రమణీయతను చాటుతున్నాయి—







రంగు రంగుల కొవ్వొత్తులు!!

మరోచోట. పిల్లలందరూ చెట్టాపట్టాలేసుకుని గుమిగూడారు. అక్కడ వారి స్నేహితురాలి పుట్టిన రోజు పండగ జరుగుతోంది. చూడ ముచ్చటైన కేక్ మీద అమర్చబడి వున్నాయి అందమైన కొవ్వొత్తులు! చిన్నారిపాప ఆ కొవ్వొత్తులు వూదగానే అందరూ చప్పట్లు చరిచారు.

అదో ఆనందం-ఆహ్లాదం-సంతోషం-సంరంభం.

అంతేకాదు. నాగరికత పెరిగి విద్యుత్ బల్బులు కనిపెట్టినా విద్యుద్దీపపు కాంతిని 'కాండిల్‌పవర్'-యూనిట్లలోనే లెక్క గడుతున్నారు. ఈ విధంగా లెక్కించడంలోగల వుద్దేశం-కాంతికోసం ఉపయోగించిన పద్ధతులలో కొవ్వొత్తి అతి పురాతనమైనదని తెలియజేయడానికే. అందుకే కొవ్వొత్తి కొలమానం అయింది.

ఇప్పటి కొవ్వొత్తులు ఎలా తయారవుతున్నాయో తెలుసుకునే ముందు_కొవ్వొత్తుల పుట్టుపూర్వోత్తరాల గురించి కూడా కొంత తెలుసుకుందాం.

ప్రారంభంలో ఎండు పుల్లలను మాంసపు కొవ్వులోగాని, ఆవు కొవ్వులోగాని ముంచి వాటిని వుపయోగించేవారు. ఆ తరువాత ఎండు పుల్లల స్థానంలో నూలు వత్తులు ప్రవేశపెట్టడం జరిగింది.

అసలు పద్దెనిమిదవశతాబ్దం వరకు ఈ కొవ్వొత్తులు వుపయోగించేవారే వాటిని తయారు చేసుకునే వారట. అందుకే ఆ రోజుల్లో గృహిణులు వంట యింట్లో వండగా మిగిలిన కొవ్వుపదార్థాన్ని ఈ కొవ్వొత్తుల[illegible]యడానికి భద్రపరచేవారు.

అయితే ఆ రోజుల్లో వారు తయారు చేసిన కొవ్వొత్తులు వెలిగించినప్పుడు కొవ్వుపదార్థం నుండి ఒక విధమైన వాసన వచ్చేది. దీనికి కారణం వాటిలో జంతువులనుండి తీసిన 'టాలో' (Tallow) అనే కొవ్వుపదార్థం వుండడం. 'టాలో' కొవ్వొత్తులలో గ్లిసరిన్, స్టియారిక్, ఆలియిక్ ఆమ్లం వుంటాయి. ఈ కొవ్వొత్తులు వెలిగేటప్పుడు మెత్తగా వుండే కొవ్వుపదార్థం త్వరగా కరుగుతుందన్నమాట. అదేసమయంలో గ్లిసరిన్ నెమ్మదిగా కరుగుతూ దుర్గంధాన్ని వెదజల్లుతుంది.

అప్పటినుండి కొవ్వొత్తులు చేసే ముందు-ఈ 'టాలో' కొవ్వు పదార్థాన్ని ఆమ్లంచేత శుద్ధి పరచిన నీటిలో వుడకబెట్టి నారవంటి పదార్థాన్ని కొవ్వు నుంచి వేరు చేయడం ప్రారంభించారు. ఆ తరువాత దీనిని సున్నంతో పాటు వేడి చేసి గ్లిసరిన్‌ని స్టియారిక్, ఆలియిక్ ఆమ్లాలనుంచి వేరు చేసేవారన్నమాట. అలా చేయగా మిగిలిన కొవ్వు పదార్థాన్ని గట్టిగా వత్తి అందులోంచి మెత్తటి



కొవ్వుపదార్థాన్ని విడిగా తీసివేస్తారు. ఆ తరువాత దీనిని పారఫిన్‌వాక్స్‌లో కలుపుతారు.

అప్పట్లో పారఫిన్ మైనంతో చేసిన కొవ్వొత్తి వెలిగించినప్పుడు మైనం కరుగుతూ వత్తిని కూడా ఆ మంటలోకి లాక్కువెళ్ళేది. అలా మండడం వల్ల అది ఆవిరిగా మారడం జరిగేది. మైనంలోని వివిధ హైడ్రోకార్బన్ పదార్థాలు వుండడంతో కార్బన్‌డయాక్సైడ్ ఏర్పడుతుందన్నమాట.

అందువల్ల వత్తిని కొంతమేర కత్తిరించవలసి వచ్చేది. వేడిమైనం—వత్తి చుట్టూ చుట్టుకోవడం వల్ల గాలిలోని ప్రాణవాయువు వత్తిని చేరకుండా అడ్డుతుంది. అందువల్ల నల్లగా మాడిపోతుంది కాని బూడిదైపోదు. ఈ మాడిన వత్తి - కొవ్వొత్తి వెలగడం వల్ల క్రమక్రమంగా పొడవుగా అవుతుంది. దాంతో ఆ వత్తి చుట్టూ కరిగిన మైనం మరింతగా అలముకుంటుంది. ఇలా జరగడం వల్ల కొవ్వొత్తి వెలుగు తగ్గి, సన్నపాటి కాంతి మాత్రమే వస్తుంది.

అయితే ఈ సమస్య 1825లో - చదునుగా మడిచిన వత్తులు కనిపెట్టడంతో పరిష్కరింపబడింది. ఇందువల్ల కొవ్వొత్తి వెలిగినప్పుడు చదునుగా మడవబడిన వత్తి చివరిభాగం క్రిందకి వంగుతుంది. ఇప్పుడు దీనికి గాలిలోని ఆక్సిజను తగలడం వల్ల కొవ్వొత్తి వెలుపలి భాగం ఒక క్రమ పద్ధతిలో నెమ్మదిగా మండుతుందన్నమాట.

గడియారాలు కనిపెట్టని రోజుల్లో-కాలగమనం లెక్కించేందుకు కొవ్వొత్తులు వుపయోగించేవారుట. ఈ కొవ్వొత్తులు వెలిగే భాగాల్ని కొన్ని విభాగాలుగా విభజించి ఒక్కొక్క విభాగాన్ని ఒక గంట క్రిందో, గంటలో కొంత కాలంగానో లెక్కగట్టేవారట.

ఈ కొవ్వొత్తుల వుత్పత్తి విరివిగా ప్రారంభమైనది - 19వ శతాబ్ది తొలి రోజుల నుంచి. అప్పటి నుంచే ఫ్యాక్టరీలలో కొవ్వొత్తులు తయారు కావడం ఆరంభమైంది. నేడు కొవ్వొత్తుల పరిశ్రమ పెద్ద పరిశ్రమగా ఎదిగి యంత్రాల ద్వారా ఒక్కసారిగా 500 కొవ్వొత్తులు తయారు చేసేంతగా వెలుగుతున్నది.

అయితే మన దేశంలో మాత్రం ఇది ముప్పాతిక మువ్వీసం కుటీర పరిశ్రమగానే స్థిరపడిపోయింది. అటువంటి వాటిల్లో మద్రాసు తేనాంపేటలోని 'జ్యోతి కాండిల్ ఇండస్ట్రీస్' ఒకటి. ఇది 1963లో ప్రారంభించబడింది. ఈ పరిశ్రమ స్థాపించిన వ్యక్తి శ్రీ ఎమ్. బలరాజ్. ఇక్కడ పని చేస్తున్నవారిలో అధిక సంఖ్యాకులు స్త్రీలే కావడం విశేషం:

"ఈ పరిశ్రమ స్థాపించడానికి వెయ్యి రూపాయల నుంచి ఏభై వేలదాకా ఎంతైనా వుండవచ్చు." అని చెప్పారు బలరాజ్.

కొవ్వొత్తులు తయారు చేసుకునేందుకు పెద్దగా సరంజామా అంటూ ఏదీ కూడా అవసరం లేదు. కావలసినదల్లా-పారఫిన్ వాక్స్ (Parafin wax) ఆయిల్ కలర్స్ (రంగుల కొవ్వొత్తులు చేసుకునేందుకు) మనకి కావలసిన సైజులో, షేపులలో అచ్చులు (Blocks) అంతే.

"పారఫిన్ వాక్స్ ప్రభుత్వం కంట్రోల్ ధరకు సరఫరా చేస్తుంది. 162.5 కిలోలు గల బ్యాగు ఖరీదు 150 రూపాయలు. ఈ పారఫిన్ వాక్స్ అస్సాం నుండి వస్తుంది. ఇదే బయట కొనాలంటే ఐదు పందలుపై చిలుకు వుంటుంది" అన్నారు బలరాజ్.

అయితే ఈ కొవ్వొత్తులు వీరు ఎలా తయారు చేస్తున్నారు?

"ముందుగా పారఫిన్ మైనాన్ని 140 డిగ్రీలు ఫారన్‌హీట్ వుష్ణోగ్రతలో కరగబెట్టాలి. పారఫిన్ మైనం అచ్చుల రూపంలో వుంటుంది. ఈ అచ్చులను కరిగించాలి. అలా కరుగుతున్నప్పుడే వాటిల్లోకి కావలసిన రంగులు కలపాలి. ఐదు కిలోలకి ఐదు గ్రాముల రంగు కలిపితే చాలు.

ఇప్పుడు కరిగిన ఈ పారఫిన్ మైనాన్ని అచ్చులలో రంధ్రాలగుండా పోస్తారు. ఆ తరువాత ఈ అచ్చులను చన్నీటిలో వుంచుతారు.



మనం సాధారణంగా వాడే పొడవు కొవ్వొత్తులకైతే అచ్చులలోకి ముందుగానే వత్తి పోనిస్తారు.

అలా అరగంట సేపు చన్నీటిలోవుంచి వాటిని విడదీస్తే లోపల కొవ్వొత్తులు తయారై మనం వుపయోగించడానికి సిద్ధంగా వుంటాయి.

అతి సులువుగా నిర్వహించగల కుటీర పరిశ్రమల్లో ఈ కొవ్వొత్తుల పరిశ్రమ ఒకటి.

"ఈ పొడవు కొవ్వొత్తుల ఖరీదు 5 పైసల నుండి 40 పైసల వరకు వుంటుంది. ఇవి దాదాపు గంట నుంచి రెండున్నర గంటలదాకా కాంతిని యిస్తాయి."

వీరు తయారు చేస్తున్న కొవ్వొత్తులలోనే మరోరకం-'కప్ క్యాండిల్స్' (Cup candles) వీటిలో రెండు రకాలు వున్నాయి. అవి - అల్యూమినియం ఫాయిల్‌తో చేసినవి, రంగు కాగితాలతో చేసినవీ.



చూడడానికి అందంగా కప్పులలాగా వుండే ఈ కొవ్వొత్తులు దీపావళి సమయంలో ప్రమిదలకు బదులుగానూ, క్రిస్మస్ వేడుకలలోనూ అధికంగా వాడుతున్నారు.

అల్యూమినియం ఫాయిల్ (తగరం కాగితం లా వుంటుంది) గాని, రంగు కాగితాన్నిగానీ మూడు అంగుళాల చుట్టుకొలతలో కత్తిరించుకుని వాటిని కప్పు ఆకారంలో చేసుకోవాలి. కాస్త పెద్ద నగరాలలో ఐతే యివి రెడీమెడ్‌గా బజార్లలో లభిస్తాయి. కాని వీటిని కూడా ఈ కుటీర పరిశ్రమలు నడుపుతున్నవారే తయారు చేసుకోవచ్చును.

ముందుగా వీటిలో కరిగినమైనం పోసి ఆ తరువాత వత్తి అందులోకి గుచ్చుతారు. మైనం గడ్డ కట్టుకోగానే వత్తి అందులోకి యిమిడిపోతుందన్న మాట. అల్యూమినియం ఫాయిల్‌తో చేసిన కప్పులకైతే ఆ ఫాయిల్‌తోనే నక్షత్రం ఆకారంలో చిన్న ముక్క కత్తిరించుకుని అందులోకి వత్తిపోనిచ్చి కప్పులోకి గుచ్చుతారు. కాని కాగితం కప్పులలో అయితే ఈ ఫాయిల్‌తో చేసిన వత్తి సరిగ్గా యిమడదు. అందువల్ల బంకమట్టి చిన్న వుండగా చేసుకుని అందులో వత్తి గుచ్చి పేపర్ కప్‌లో వుంచుతారు. (చూడడానికి యివి బాగా మొలకెత్తిన శనగల్లా వుంటాయి.) ఇలా చేయడంవల్ల వత్తి కప్పుకి మధ్యస్తంగా వుంటుంది. పక్కకి జరగడానికి ఆస్కారం వుండదు.

ఇవి మూడున్నర గంటల సేపు వెలుగునిస్తాయి.

ఇంకా కోకో-కోలా సీసా ఆకారంలో అదే రంగులోనూ, 'జ్ఞాన ఒళి' పేరిట 24 గంటల సేపు వెలిగే మరో కొవ్వొత్తిని కూడా వీరు తయారు చేస్తున్నారు. ఇవి కాక మెలికలు తిరిగినట్లు వుండే 'ట్విస్టెడ్ కాండిల్స్'ను కూడా ఆకర్షణీయమైన తొమ్మిది రంగులలో వీరు తయారు చేస్తున్నారు. ఫ్యాన్సీ కాండిల్స్ పేరిట రాకెట్‌లు, స్పుత్నిక్‌లు కూడా చేస్తున్నారు.

ఎన్ని రకాలు చేసినా ఇవి తయారు చేసే పద్ధతి ఒకటే. ఎటొచ్చి 'బ్లాక్స్' (Blocks) అనబడే అచ్చులు మారతాయి. అంతే.

అయితే వీరు చేస్తున్న కొవ్వొత్తులన్నిటిలోకి పేర్కొనదగినది-సువాసనలు వెదజల్లే కొవ్వొత్తులు. రాగమాలిక, మల్లి పరిమళాలలో ప్రస్తుతం ఈ కొవ్వొత్తులు తయారు చేస్తున్నారు. ఇరవైనాలుగు గంటల సేపు యివి ఒక పక్క కాంతిని యిస్తూనే మరోవైపు సుగంధాన్ని వెదజల్లుతాయన్న మాట!

"మేము వివిధ వర్ణాలలో మంటలను విరజిమ్మే కొవ్వొత్తులు కూడా తయారు చేద్దామనుకున్నాము. ఎరుపు, నీలం, పచ్చ రంగు వెలుగునిచ్చే వాటి కోసం ప్రయత్నాలు చేశాం. కాని మా ప్రయత్నాలు ఫలించలేదు. ప్రభుత్వ రసాయనిక ప్రయోగశాలలో కూడా ఈ ప్రయోగాలు జరుగుతున్నాయి. కాని యింతవరకు ఫలితం కనిపించలేదు. విదేశాలలో యిటువంటి కొవ్వొత్తులు వున్నాయి. మా ప్రయత్నాలు కూడా త్వరలోనే ఫలిస్తాయని ఆశిస్తున్నాము" అన్నారు బలరాజ్.

కొవ్వొత్తులే కాకుండా మైనంతో అలంకరాప్రాయమైన శివ పార్వతులు, వీనస్, మేరీమాత, క్రీస్తు ప్రతిమలు, వివిధ రకాల బొమ్మలు కూడా జ్యోతి క్యాండిల్స్‌వారు తయారు చేస్తున్నారు.

ఆంధ్ర, తమిళనాడు, కర్ణాటక రాష్ట్రాలలో యివి పంపిణీ అవుతున్నాయి. తిరుపతిలో కూడా వీరికి ఒక శాఖ వుంది.



"కొవ్వొత్తుల పరిశ్రమలో నేడు విపరీతమైన పోటీ వుంది. మద్రాసులోనే దాదాపు వంద దాకా ఈ పరిశ్రమలు వున్నాయి. ఆంధ్ర రాష్ట్రంలో కొవ్వొత్తులు చేసే పరిశ్రమలు అంతగా లేకపోవడం వల్ల యిక్కడ తయారైనవాటికి అక్కడ విరివిగా ఆదరణ లభిస్తోంది." అన్నారు బలరాజ్.

కొవ్వొత్తి నిత్యావసర వస్తువులలో ఒకటికాదు కాబట్టి వాటి గిరాకీ సంవత్సరం పొడుగునా వుండదు. పండుగల వంటి ప్రత్యేక సందర్భాలలోనూ, వర్షాకాలం కరెంటు కోత అప్పుడూ వీటికి అమ్మకం విరివిగా వుంటుంది. సాధారణంగా సెప్టెంబరు నుంచి డిసెంబరు వరకు కొవ్వొత్తుల సీజన్ అని చెప్పవచ్చును.

జ్యోతి క్యాండిల్స్‌లో కప్పు క్యాండిల్స్ మాత్రం ఒక రోజుకి పదివేలు దాకా తయారవుతున్నాయి.

ఇక్కడ దిన భత్యం మీద పనిచేస్తున్నవారికి రోజుకి 5 రూపాయలు చొప్పున, యితరులకి నెలకి 150 రూపాయల చొప్పున యిస్తున్నారు.

కొవ్వొత్తుల పరిశ్రమ ప్రారంభించాలంటే అందుకు చిన్న తరహా పరిశ్రమల విభాగం వారి గుర్తింపు పత్రం, అమ్మకపు పన్ను శాఖవారి నమోదు పత్రం సంపాదించాలి.

వీటి పంపిణీ—ఏజెంట్లద్వారానూ, అందుకు ప్రత్యేకంగా నియమించిన సేల్స్‌మెన్‌ల ద్వారానూ జరుగుతుంది.

అయితే అన్ని పరిశ్రమలలో వున్నట్లే ఈ పరిశ్రమలోనూ కొన్ని యిబ్బందులు వున్నాయి.

"1963 లో మేము ఈ పరిశ్రమ ప్రారంభించినప్పుడు పారఫిన్ మైనానికి కంట్రోల్ లేదు. కాని ప్రభుత్వం యిప్పుడు దీనికి కోటా పద్ధతి ప్రవేశపెట్టింది-ఇక్కడే వచ్చింది చిక్కల్లా. కొందరు ఈ కోటాని నల్లబజారులో అమ్ముకుంటున్నారు. ఈ 'కొందరి' స్వార్థం యితరులని బాధిస్తోంది. కారణం, వీరు యిలా చేయడంవల్ల ప్రభుత్వం కోటాని యింకా తగ్గించింది—దానికి అదే మందు అన్నట్లు. దాంతో చిన్న పరిశ్రమలు వాళ్ళు దెబ్బతినవలసి వస్తోంది. మేము తయారు చేస్తున్న కొవ్వొత్తులకి గిరాకీ వున్నా ముడిపదార్థం లేకపోతే మేము మాత్రం ఏం చెయ్యగలం? ప్రభుత్వం అటువంటి స్వార్థపరుల మీద చర్యలు తీసుకోవడానికి ప్రయత్నించాలి. అప్పుడే మేము ఎదుర్కొంటున్న ఈ యిబ్బందులు తప్పుతాయి." అన్నారాయన. □

## కొత్త సంవత్సరం –

# అంతర్జాతీయ బాలల సంవత్సరం





రేపటితరం బాగోగులు నిర్ణయించే విధాతలు నేటి పౌరులు. అంచేత భావి పౌరులైన బాలల భవిష్యత్తును తీర్చిదిద్దవలసిన బాధ్యత ప్రతి పౌరునికీ వుంది.

బాలలపట్ల మన తక్షణ కర్తవ్యం ఏమిటి? అన్న విషయం గ్రహించాలంటే – ప్రస్తుతం శిశువుల స్థితిగతులు ఎలా వున్నాయో తెలుసుకోవాలి. ఈ ఉద్దేశంతోనే ఇటీవల ప్రపంచ ఆరోగ్యసంస్థ ప్రపంచం మొత్తం మీద ఒక సర్వే జరిపి–వివరాలు ప్రకటించింది.

ప్రపంచం మొత్తం మీద వున్న పసిపిల్లల సంఖ్య–సుమారు నూరుకోట్ల ఏభై అయిదు లక్షలా ఎనభై రెండువేలు. వీరిలో మూడింట రెండు వంతుల శిశువులు – అభివృద్ధి చెందుతూన్న దేశాలలో వుంటున్నారు.

ఈ దేశాలలో సుమారు ఇరవైకోట్లమంది శిశువులకు సరియైన ఆహారమే లభించడం లేదు. ప్రతి ఐదు శిశువులలో ఒకటి–పట్టుమని ఐదేళ్ళు నిండకముందే గుటుక్కుమంటున్నది.

ఇరవైమంది వున్నారంటే అందులో ఒక్క శిశువుకు మాత్రమే వైద్య సదుపాయాలు అందుబాటులో వుంటున్నాయి. తొంభైశాతం పిల్లలకు టీకాలు కూడా వేయించడం లేదు! సరియైన వైద్య సదుపాయాలు లేనందువల్ల సుసంపన్న దేశంగా కొనియాడబడే లాటిన్ అమెరికాలో కూడా – గత పదేళ్ళలో డెబ్బై అయిదులక్షల మంది శిశువులు ప్రాణాలు కోల్పోయారట!

లేమి తాండవిస్తూ, నేల మీద ఆకలి ఆవులిస్తున్నంతకాలం శిశువులకు ఆయురారోగ్యాలు సమకూరుతాయి — అని ఆశించడం కుందేటి కొమ్ముకు ఆశపడడమే అవుతుంది. కడుపార గంజికి కూడా నోచుకోలేని వారు తెలివి తేటలు పెంపొందింపజేసే చదువు సంధ్యల దరిదాపులకు కూడా చేరుకోలేరు. అంచేత లేమిని లేకుండా చేయడమే మన లక్ష్యం కావాలి.

ఇకపోతే అభివృద్ధి చెందిన ధనస్వామ్య దేశాలలోని క్లిష్టమైన సామాజిక సమస్యలకు పసిపిల్లలు బలి అవుతున్నారు. అంతర్జాతీయ శ్రామిక సంస్థ ఇటీవల వెలువరించిన వివరాల ప్రకారం–అమెరికా, కెనడా, జపాన్, ఆస్ట్రేలియా లాంటి పద్దెనిమిది దేశాలలో, దాదాపు రెండుకోట్లమంది నిరుద్యోగులు వున్నట్లు తెలుస్తున్నది!

ఇక్కడి పిల్లలు హింస, క్రౌర్యం నేరాలు మొదలైన వాటికే కాకుండా ఉధృతంగా వీచే అశ్లీల సాహిత్య విష వాయువులకు కూడా గురి అవుతున్నారు!

దోపిడీ, దౌర్జన్యం లేని దేశంలోనే, ద్వేషం మోసం లేని సంఘంలోనే, శాంతి, సమత మలయ మారుతాలుగా వీచే సమాజంలో మాత్రమే— పసి పాపలు అప్పుడే వికసించిన గులాబీల్లాగా హాయిగా ఆనందంగా కళకళ లాడడానికి అవకాశం వుంటుంది!

మానవ సమాజాన్ని, సంపదలను సర్వనాశనం చేసే ఒక్క న్యూట్రాన్ బాంబు తయారు చేయడానికి అయ్యే ఖర్చు – లక్షలాది పసి పిల్లల ఆకలి తీర్చడానికి సరిపోతుంది! అంతేకాదు. ఇలాంటి మారణాయుధాలు తయారు చేయడం కోసం వెచ్చించే కోట్లకొద్ది ధనంతో పాఠశాలలు, వైద్యశాలలు నిర్మించవచ్చు. ఇది లక్షలాది పిల్లలు విద్యా వైద్య సౌకర్యాలు పొందడానికి దోహదం చేస్తుంది!

ఐక్యరాజ్యసమితి జనరల్ అసెంబ్లీ ముప్పై ఒకటో సమావేశంలో 1979వ సంవత్సరాన్ని అంతర్జాతీయ బాలల సంవత్సరంగా జరుపుకోవాలని నిర్ణయించింది. పిల్లల హక్కులకోసం పోరాడడానికి ఇది దోహదం చేయగలదని ఆశించవచ్చు. పిల్లల డిక్లరేషన్ ఆఫ్ రైట్స్ ఇరవయ్యో వార్షికోత్సవం కూడా ఇదే సంవత్సరంలో వస్తుంది. ఈ తీర్మానాలను అన్ని దేశాలలోనూ ఆచరణలో పెట్టడానికి అందరూ కృషి చేయాలి. పసి పాపల ప్రగంతి పథంలో కొత్త వెలుగులు వెదజల్లి వారి జీవనస్థితికి మెరుగులుదిద్దే ఈ అంతర్జాతీయ శిశు సంవత్సరం – మహిళా దశాబ్దంలోనే రావడం మరొక విశేషం!

శిశువుల సమస్యలను పరిశీలించి ఆమూలాగ్రం ఆకళింపు చేసుకోవాలి. వాటిని పరిష్కరించడానికి నిర్వర్తించవలసిన బాధ్యతలో ప్రతి ఒక్కరూ పాలు పంచుకోవాలి. దీనికి ప్రభుత్వంతోపాటు సేవా సమాజాలు, అన్ని రాజకీయ పక్షాలు, మతాలకు సంబంధించిన సంస్థలు మొదలైనవన్నీ తమ సంపూర్ణ సహాయ సహకారాలు అందించాలి.

బాలల జీవితాలకు శాంతి సంక్షేమాలు, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ప్రసాదించే సామాజిక న్యాయ సూర్యోదయం కోసం ప్రతి ఒక్కరూ, ప్రతి క్షణం కృషి చేయాలి!

—బాల

# గోష్ఠి

# స్త్రీలు ఎదుర్కొంటున్న సమస్యలు....


ఇందిరా ఆర్య

విజయవాడ లయన్ లేడీస్ క్లబ్ సభ్యులు–
నేటి సమాజంలో స్త్రీలు ఎదుర్కొంటున్న
వివిధ సమస్యలపై ప్రత్యేకంగా "వనిత"
కోసం ఒక గోష్ఠి జరిపారు. ఆ గోష్ఠిలోని
ముఖ్యాంశాలు గల ఈ వ్యాసం–
వివిధ అభిప్రాయాలను చెప్పగలదు.

**స్త్రీలు–కట్నాలు :**

క్లబ్ కార్యదర్శి శ్రీమతి బి. రత్నవతి స్త్రీలు ఎదుర్కొంటున్న ప్రధాన సమస్య వరకట్నమని, ఈ సమస్య ఇటీవల 30 శాతం వరకు పరిష్కారమయిందని, ఇంకను జరగవలసింది చాలా ఉందని అన్నారు.

వివాహ వయస్సు, వరునకు 18 సంవత్సరాలు, వధువుకు 15 సంవత్సరాలు ఉండటం వలన వారు స్వంతంగా ఆలోచించే స్థితికి చేరలేకపోతున్నారు. వివాహ వయస్సు మగవారికి 25 సంవత్సరాలు ఆడవారికి 20 సంవత్సరాలు నిర్ణయిస్తే తల్లిదండ్రుల ఒత్తిడికి లొంగిపోకుండా స్వతంత్రంగా ఆలోచించి నిర్ణయాలు గైకొనగలుగుతారు.


శారదగుప్త


జి. నాగదుర్గ


ఎం. వి. సూర్యవతి


పి. సుశీల


యు. గ'రీమణి


బి. రత్నవతి

స్త్రీలు ఉన్నత విద్యనభ్యసించి ఉద్యోగాలు చేస్తే కట్నాల సమస్య కొంతవరకు పరిష్కారం అవుతుంది. ఒకసారి రు. 10,000 కట్నం యిచ్చే యువతికన్న జీవితాంతం సంపాదించే ఉద్యోగం కలిగిన స్త్రీకి ఎక్కువ విలువ ఉంటుంది.

'స్త్రీలకు స్త్రీలే శత్రువులు' అంటే అతిశయోక్తి కాదేమో! స్త్రీల దృక్పథంలో మార్పు రావాలి. కట్నం కోసం పట్టుపట్టకుండా, తోటి సోదరీమణులకు సులభంగా వివాహాలు అయేందుకు వారు తోడ్పడాలి. కట్నాలు తీసుకురాని యువతులను దెప్పి పొడవడం, సతాయించడం మొదలైనవి వారు చేయరాదు.

ఉన్నవారు కట్నాలు యివ్వకపోయినా స్త్రీ స్వంత ఖర్చుల నిమిత్తం కొంత మొత్తాన్ని స్త్రీ ధనంగా ఇవ్వవచ్చు. యువకులు కట్నాలు తీసుకోకుండా వివాహాలు చేసుకోవడానికి ముందుకు రావాలి. ఎక్కువమంది స్త్రీలకు ఉపాధి లభించేందుకు వీలుగా నర్సు ట్రైనింగ్, బి ఇడి ట్రైనింగ్ స్త్రీల పాలిటెక్నిక్ సంఘాలు ఎక్కువగా ఏర్పడాలి. కుటీర పరిశ్రమల ఏర్పాటు ద్వారా స్త్రీలలో నిరుద్యోగ సమస్య పరిష్కరించాలి.

**స్త్రీలు–చదువు :**

ఈ రోజులలో ఆడవారికి చదువు చాలా అవసరం. పూర్వం రోజులలో చదువులు లేక ఆడవారు అజ్ఞానంలో ఉండేవారు. ఇప్పుడు చదువుకోవడానికి ఉద్యోగాలు చేయడానికి ముందుకు వస్తున్నారు.

మనదేశంలో ఆడవారు చదువుకోవాలంటే పల్లెటూళ్ళలో కాలేజీలు లేవు. పట్నంలో చదువుకోవాలి. చదువుకునే స్త్రీలకు ప్రస్తుతం హాస్టల్స్‌ను ఏర్పాటు చేయాలి అని 'స్త్రీలు–చదువు' అను విషయంపై విజయవాడ లయన్ లేడీస్ క్లబ్ అధ్యక్షురాలు శ్రీమతి ఇందిరా ఆర్య కొన్ని సూచనలు చేశారు. 'ఒక ఇంట్లో ఒక గృహిణి చదువుకుంటే ఆ కుటుంబంలో అందరూ విద్యావంతులవుతారు'.

చదువుకున్న స్త్రీలు సమస్యలను సులభంగా ఎదుర్కొనగలుగుతారు. వారిలో ఆలోచనా శక్తి, ధైర్య సాహసాలు పెంపొందుతాయి. స్త్రీలు చదవడానికి వీలైన ప్రత్యేక కోర్సులు నర్సింగ్, టీచింగ్, ఎలెక్ట్రానిక్స్, వాచ్ మెకానిజం మొదలైనవి ఉన్న శిక్షణ సంస్థలుగా ప్రభుత్వం ఎక్కువ ఏర్పాటు చేయాలి.

**స్త్రీలు–రక్షణ :**

'స్త్రీలు-భద్రత' అను విషయంపై మాట్లాడుతూ శ్రీమతి జి. నాగదుర్గ ఇలా అన్నారు:

ఈ రోజులలో కొంతమంది స్త్రీలు తల్లి తండ్రులకు, భర్తకు దూరంగా ఉంటూ ఉద్యోగాలు చేస్తున్నారు. వారికి సరైన ఇళ్ళు దొరకక, దొరికిన ఇళ్ళలో సరైన వసతులు లేక ఆఫీసుకు ఆలస్యంగా రావడం, వ్యాకూలమైన మనస్సుతో పనిచేయడం జరుగుతున్నది. ముఖ్యమైన పట్టణాలలో ఉద్యోగాలు చేస్తున్న స్త్రీలకు వసతి

కల్పించడానికి ప్రభుత్వం 'వర్కింగ్ ఉమెన్స్' హాస్టల్స్‌ను ఎక్కువ నిర్మించాలి.

ఇక ఆఫీసులకు వెళ్ళడానికి స్త్రీలకు ప్రత్యేక బస్సులు వేసినట్లయితే మగవారితోపాటు సమానంగా కుస్తీపట్టి బస్సులు ఎక్కే 'దుస్థితి' ఆడవారికి తప్పుతుంది. బస్సుల్లో లేడీ కండక్టర్స్‌ను వేయడం ఉత్తమం.

**స్త్రీలు-ఉద్యోగాలు :**

నేటి ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా సంసారం ఒడిదుడుకులు లేకుండా సాఫీగా సాగడానికి స్త్రీ పురుషులతో పాటు ఉద్యోగం చేయవలసి వస్తున్నది. సహృదయంతో ఆమె మానసిక పరిస్థితులను అర్థం చేసుకుని ఆమెకు అన్ని విధాలా సంపూర్ణ సహకారాన్ని అందించే భర్త లభిస్తే ఆమె అదృష్టవంతురాలే. అలా కాకుండా పురుషాహంకారాన్ని మాటిమాటికి ప్రదర్శిస్తూ, ఆమె సాధకబాధకాలను అర్థం చేసుకోలేని భర్త ఉంటే ఇక ఆమె పాట్లు భగవంతునికి తెలియాలి!

ఒక ఊళ్ళో ఇద్దరూ ఉద్యోగాలు చేస్తే ఫరవా లేదు. వేర్వేరు ఊళ్ళలో ఉద్యోగాలు చేస్తే అనేక సమస్యలు ఉత్పన్నమవుతాయి. ఎవరో ఒకరు ఉద్యోగానికి రాజీనామా యివ్వక తప్పదు. అది సాధారణంగా స్త్రీయే అవుతుంది. వివాహం ముఖ్యోద్దేశం స్త్రీ పురుషులు జీవితాన్ని పంచుకుంటూ, సుఖదుఃఖాలను కలసి అనుభవించడం లేకపోతే ఆ వివాహానికి అర్థం లేకుండా పోతుంది. పిల్లలకు 10-12 సంవత్సరాల వయస్సు వచ్చే వరకు తల్లి తండ్రుల ఆదరణ కావాలి. అది కరువైన పిల్లలు అల్లరిబిల్లరిగా తయారవుతారు.

స్త్రీ ఒకవైపు తన సంసారాన్ని చూసుకొంటూ మరోవైపు ఉద్యోగం చేయడానికి వీలుగా 'పార్ట్ టైమ్ జాబ్స్' స్త్రీలకు యివ్వాలి. ఫుల్‌టైమ్ జాబ్‌తో అటు సంసారాన్ని చూడటం ఇటు ఆఫీసు పనికి హాజరవడం కష్టంగా ఉంటుంది'' అని శ్రీమతి యు. గౌరీమణిగారు సూచించారు.

**నేటి సమాజంలో స్త్రీ :**

''స్త్రీకి జీవితాంతం ఎవరో ఒకరి రక్షణ ఉంటుంది. బాల్యంలో తల్లి తండ్రులు, వివాహానంతరం భర్త, వార్థక్యంలో కుమారుల రక్షణ ఉంటుంది. పూర్వపు రోజులు స్త్రీలకు ఎంతో గౌరవముండేది. కాని రోజులు మారిపోయాయి. ఈ రోజులలో స్త్రీలకు ఎంత రక్షణ ఉందో మనకు తెలుసు. పాశ్చాత్య దేశాలలో స్త్రీలకు గల సౌఖ్య స్వాతంత్ర్యాలు రక్షణ చూస్తే మనం ఎంత వెనుకబడి ఉన్నాము అనిపిస్తుంది.

పట్టపగలే దేశ రాజధానిలో, పెద్ద పెద్ద పట్టణాలలో స్త్రీలకు జరిగే అవమానాలు, అత్యాచారాలు గురించి రోజూ పత్రికలో చదువుతున్నాము.

స్త్రీలకు తగినంత రక్షణ కలిగించాలంటే స్త్రీలపై అత్యాచారాలు జరిపేవారిని కఠినంగా శిక్షించాలి. పోలీసులు స్త్రీల విషయంలో మర్యాదతో ప్రవర్తించేటట్టు చూడాలి. మహిళా పోలీసులను ఎక్కువగా నియమించి స్త్రీలకు అన్నిచోట్ల రక్షణ కల్గించాలి'' అని శ్రీమతి ఎం. వి. సూర్యవతి సూచించారు.

**పిల్లల చదువు :**

''పాఠశాలలను ఉదయం 8 గంటల నుండి 2 గంటల వరకు నిర్వహిస్తే బస్సుల రద్దీ తగ్గడానికి సాయంత్రం పూట ఇంటివద్ద పిల్లలు చదువుకోవడానికి వీలవుతుంది'' అని శ్రీమతి శారదగుప్త సూచించారు.



'పిల్లలకు పుస్తకాలు తగ్గించి లోకజ్ఞానం గురించి ఎక్కువ బోధించాలి. విద్యాసంస్థలలో క్రమశిక్షణను పెంపొందించడానికి అల్లరిచేసే పిల్లలపై కఠిన చర్యలు తీసుకోవాలి. అల్లరి పిల్లలకు విద్యాసంస్థలలో స్థానం ఉండదని పాఠశాల అధికారులు స్పష్టంగా చెప్పాలి. ఉపాధ్యాయుడు పిల్లలను ఏ కారణం చేతనైనా మందలించినా, కొట్టినా తల్లిదండ్రులు అది తమ పిల్లల మంచికే అని భావించి ఉపాధ్యాయులతో గొడవ పెట్టుకోకూడదు. పిల్లలు రోజూ స్కూలు నుండి తిరిగి రాగానే తల్లితండ్రులు వారిని దగ్గర కూర్చోబెట్టి పాఠాలు, హోంవర్కు మొదలైన విషయాలు అడిగి తెలుసుకోవాలి.

పిల్లలు అడిగినప్పుడల్లా డబ్బు యిచ్చి గారం చేయకూడదు. చేతిలో డబ్బు ఉంటే చిరుతిళ్ళు, దుర్వ్యసనాలు పిల్లలకు అలవాటు అవుతాయి. పిల్లలకు నీతిని బోధించే కథలు చెప్పాలి. పుస్తకాలు చదివించాలి. సినిమాలు చూపించాలి. 'బాల విహార్'కు పిల్లలను తీసుకు వెళ్ళి వారిచేత ఆటలు ఆడించాలి. వినోద కార్యక్రమాలలో వారు పాల్గొనేటట్టు చేయాలి' అంటారు శ్రీమతి శారదాగుప్త.

**ధరల సమస్య :**

''నిత్యావసర వస్తువుల ధరలను అదుపులో పెట్టడానికి ప్రభుత్వం మధ్యవర్తులు, దళారులు లేకుండా ఉత్పత్తి స్థానంలోనే అన్ని వస్తువులు కొని వాటిని సూపర్‌బజారులు, సహకార సంఘాల ద్వారా విక్రయించాలి. అధిక ధరలకు సరుకులను విక్రయించేవారిపై ప్రభుత్వం కఠిన చర్యలు గైకొని వారిని సరాసరి జైలుకు పంపి కనీసం రెండేళ్ళు జైలులో ఉండేటట్టు చేయాలి.

సూపర్ బజార్‌లలో అన్నిరకాల సరుకులు న్యాయమైన ధరలకు సరైన కొలతలతో లభ్యమయేటట్టు ప్రభుత్వం చూడాలి.'' అని శ్రీమతి పి. సుశీల సూచించారు.

'ఇక నవలలు, కథలు, సినిమాలలో స్త్రీ ఓటమికి గురైనట్టు, పురుషులే విజయాన్ని సాధించి తమ ఆధిక్యతను చాటుతున్నట్టు చూపిస్తున్నారు. ఈ దృక్పథంలో మార్పు రానంతవరకు స్త్రీ పురోగమనానికి ఆటంకం ఉండనే వుంటుంది'— అని వారంతా ఏకగ్రీవంగా అన్నారు. —మీరా

# సుందరి స్వగతం



కాకాని కమల

ఎదురింట్లో పెండ్లి జరుగుతోంది!

ఎలా జరుగుతోంది?

రంగ రంగ వైభవంగా జరుగుతోంది!

కిటికీ దగ్గర బల్లమీద కూర్చున్న సుందరి కళ్ళు ఆ వైభవాన్ని అత్యంత కుతూహలంగా తిలకిస్తున్నాయ్! అంతటి వైభవాన్ని చూస్తున్న ఆనందం తాలూకు ఛాయలు ఆమె కళ్ళల్లో స్పష్టంగా ప్రతిఫలిస్తున్నాయ్!

పెద్ద షామియానా వేశారు!

రంగు రంగుల దీపాల తోరణాలు వ్రేలాడ దీశారు!

దానికింద ఎత్తుగా కళ్యాణ మండపం కట్టారు!

ముంగిట్లో ఎర్రటి యూనిఫారంలో వున్న బ్యాండు మేళం వరస వెంబడి నిలిచి వున్నారు.

అనేక రకాల ఖరీదయిన వాహనాలు బారులు తీర్చి వున్నాయ్. నగరంలోని ప్రముఖులంతా అక్కడే సభ తీర్చారా అన్నట్లు ఆడంబరంగా వుంది వాతావరణం. రకరకాల పట్టు చీరలు, విలువైన కోట్లు, ఖరీదయిన సూట్లు! పెళ్ళి పందిరి ఆహూతులతో కళకళలాడి పోతోంది!

పెళ్ళికూతురు రాధిక విలువైన ఆభరణాలు ధరించి ఖరీదైన పట్టుచీరతో మెర్క్యురీ కాంతిలో అపరలక్ష్మిలా ధగధగా మెరిసిపోతోంది!

పెళ్ళికొడుకు విదేశాలలో చదువుకుని వచ్చాడుట! ఎర్రగా, ఎత్తుగా రాజీవిలో వున్నాడు.

ఆ జంటను చూడటానికి రెండు కళ్ళు చాలవు! ''నిజంగా పెళ్ళి వేడుక అంటే అలాగ వుండాలి! రంగరంగ వైభవంగా!'' స్వగతంలో సుందరి ప్రశంసగా అనుకుంది.

కాని అంతలోనే ఆమె మనస్సు సన్నగా నిట్టూర్చింది!

''హుఁ....ఏడాది క్రితం తనకీ జరిగింది పెళ్ళి! ఎలా జరిగింది?''

ఇంటి ముందు నాలుగు పుచ్చిపోయిన గుంజలు పాతి పచ్చికొబ్బరి ఆకులతో పందిరి అల్లారు. మామిడి తోరణం కట్టారు. రెండు పెట్రోమాక్సు లైట్లు తెప్పించారు. ముసలయ్య కొడుకుతో వచ్చి డోలు సన్నాయి మ్రోగించాడు. అంతే! తన మెళ్ళో మూడుముళ్ళూ పడ్డాయి. తనకి పెళ్ళి జరిగిపోయింది. వెయ్యిన్నూట పదహార్లు కట్నం ఇయ్యటానికే తల తాకట్టు పెట్టాడు నాన్న! అందువల్ల తను ఒక మంచి పట్టుచీర కూడా కొనుక్కోలేకపోయింది!

పెళ్ళికొడుకు శంకరం....అదే....తన భర్త మాత్రం ఎలా వున్నాడు? నల్లగా పోతపోసిన విగ్రహంలా వున్నాడు! మొఖాన ఇంత 'కళ' అయినాలేదు. తుమ్మల్లో ప్రొద్దు క్రుంగినట్లు ఎప్పుడూ మటమటే! చూడగానే తనకి కడుపులో తిప్పింది!

పానకం బిందెల్లో చేతులు పెట్టినప్పుడు నల్లని తుమ్మ చెక్కలాంటి అతని చెయ్యి ప్రక్కన తెల్లటి తన చెయ్యి మరీ బంగారంలా మెరిసిపోయింది.

పందిట్లో వున్న వాళ్ళంతా ముక్కున వేలేసుకున్నారు!

''కాకి ముక్కుకి దొండపండు'' అన్నారు. కాని తన అత్తగారు ఏమంది?

''మా శంకరానికి ఆరువేలకు పైగా ఇస్తామని వస్తున్నారు. ఏదో .... అయినవాళ్ళం కదా అని ఈ సంబంధం కలుపుకున్నాం. ఘనంగా లాంఛనాలు లేవు మర్యాదలూ లేవు!'' అంటూ మూతి విరిచింది.

అంతేగాని..''పిల్ల బాగుందని చేసుకున్నాం'' అని ఛస్తే అనదే! ఆవిడ్ని చూస్తే తనకి ఒళ్ళు మండిపోయింది!

నిజం చెప్పాలంటే ఆ పెళ్ళి తను మాత్రం 'పడి పడి' చేసుకుందా? గతిలేక చేసుకుంది. ఇంకా చెప్పాలంటే తల్లిపోరుపడలేక తల ఒగ్గింది.

అసలు తనకి ఊహ తెలిసినప్పట్నుంచి ఎన్ని కలలు? ఎన్ని కోరికలు?....

డబ్బు లేకపోయినా ఫరవాలేదు. తన కంటికి నచ్చిన భర్త రూపాన్ని కోరుకుంది. అతడు పట్టు చీరలు నగలు తేనక్కరలేదు. మంచి సరసుడు, సహృదయుడు కావాలని ఆశించింది.

తెచ్చిన పదిపైసల మల్లెపూలు అయినాసరే....

"సుందీ! నీ కోసం తెచ్చాను. ఊఁ...." అంటూ తన భుజాల చుట్టూ చెయ్యి తిప్పి ఆప్యాయంగా దగ్గరికి తీసుకునే భర్తని కోరుకుంది. కాని.... కాని.... ఏం జరిగింది? తన బ్రతుక్కి ఆ చిన్న ముచ్చట కూడా కరువు అయిపోయింది".

గాఢంగా రాబోతున్న నిట్టూర్పుని ఆపుకుంది సుందరి.

"తన భర్త శంకరానికి ఓ సరసం తెలియదు సరదా తెలియదు. ఆ మోటు అవతారానికి తగ్గదే ఆయనగారి అభిరుచీనూ ఛీ...."

నాలుగు రూపాయిలు జేబులో వుంచేచాలు తాగటం, పేకాడటం అర్ధరాత్రి ఎప్పుడో పక్క మీదికి వస్తాడు. జన్మకో శివరాత్రి అన్నట్లు ఆ సొగసుకి తోడు సాయంత్రం ఎప్పుడో కొన్న పూల సంగతి అప్పుడు జ్ఞాపకం వస్తుంది కాబోలు! పాంట్ జేబులో నలిగిపోతున్న పూలపొట్లం తీసి తన మంచం మీదికి విసురుతాడు. పామో తేలో మీదకి వచ్చి పడినట్లే అనిపిస్తుంది. కాని పూల చెండు తగిలిన అనుభూతే అందదు! 'బ్రాంది' కంపుకొట్టేనోరు, ఎర్రటి కళ్ళు ... ఏ గొంగళి పురుగో మీద ప్రాకినట్లు తనకి ఒళ్ళు జలదరిస్తుంది.

పగటిపూట తనతో అసలు మాట్లాడడు! అన్నింటికి అమ్మనే పిలుస్తాడు. అమ్మకూచి!

"ఒరేయ్ నాయనా! నా తండ్రి! శంకిగా...." అంటూ తన అత్తగారూ అంతే! తలకి నూనె రాయటం దగ్గర్నుంచి విస్తట్లో అన్నం వడ్డించటం వరకూ అద్దాల్లో బిడ్డడ్ని చూసుకున్నట్లు తెగ అపురూపం చూపెడుతుంది!

ఆ ప్రేమలో, కొడుకు ఎక్కడ కోడలి పరమైపోతాడో అన్న తాపత్రయమే కనుపిస్తుంది కాని సహజత్వం తోచదు. అయినా తనకి మాత్రం అంత తీరిక ఎక్కడ చచ్చింది? లేచింది మొదలు చాకిరి! చాకిరి!! ఈ ప్రపంచంలో అసలైన వెట్టిచాకిరి చేసే బానిసబ్రతుకు ఆడదానిది! అత్తంటి కోడలిది! ప్రభుత్వం ముందుగా నిర్మూలించాల్సింది ఈ వెట్టిచాకిరీనే!........

అంత చాకిరి చేసినా తన "అత్త"కి తృప్తి లేదు! ఆపేక్షలేదు. "కోడల్ని అత్త సాధించటం జన్మహక్కు" అన్న నియమం పెట్టుకున్నదానిలా ప్రతిక్షణం పాటిస్తుంది. సాధించని రోజు తన హోదా తరిగిపోయినట్లు, తన పెద్దరికం దెబ్బ తిన్నట్లు తెగబాధపడిపోతుంది! తన ఆడపడుచులు తల్లికి వంతపాడతారు! వాళ్ళు రేపు అత్తవారింటికి వెళ్ళరో ఏమో!

కష్టం సుఖం తనకి భర్తతో చెప్పుకొనే స్వాతంత్ర్యం లేదా! అతగాడి దృష్టిలో తానొక యంత్రం. ఏనాడైనా పొరపాటున రాత్రిపూట గదిలో అత్తగారి గురించి చెప్పబోతే....

"ఇదిగో....మా అమ్మ చాలా మంచిది. నోరుమూసుకుని పడివుండు. మా నాన్న పోయిన దగ్గర్నుంచి మమ్మల్ని కంటికి రెప్పలాగ కాపాడింది. మా అమ్మ గురించి నా దగ్గర ఇంకో మాట అన్నావంటే మర్యాద దక్కదు. అంత కష్టంగా వుంటే పుట్టింటికి పో...." అంటూ కళ్ళు ఎర్రగా చేసి హుంకరిస్తాడు.

"అమ్మ"గా అతనికి మంచిదే. కాని అత్తగా తనకి మంచిది కాదే! కాని ఆ విషయం అతనికి బోధపడదు.

అదే....తల్లి గనుక "ఒరేయ్ శంకరా! మీ ఆవిడ చూశావట్రా?...."అంటూ తన మీద ఏదైనా చాడి చెపితేచాలు ముందు వెనుక ఆలోచన అయినా లేకుండా తన వీపు వంగదీసి "ధబీ ధభీ" మని బాదతాడు. జుట్టుపట్టి గోడకేసి కొడతాడు. నెత్తురు బొట బొట కారి, బొప్పి కట్టాల్సిందే. తన అభిమానం చచ్చిపోతుంది. అందుకే నోరు ఎత్తటం మానివేసింది. అదింకా అలుసు అయిపోయింది.

"మగడు కొట్టినందుకు కాదు – ఆడబిడ్డ నవ్వినందుకు ఏడ్చాను"....అందిట వెనకటికో ఇల్లాలు! అంతే మరి!

భార్య మీద మమకారం వుండాలి. అంత మాత్రం చేత తల్లి మీద ఆపేక్షని ఒదులుకో నవసరం లేదు! తల్లి మీద గౌరవాభిమానాలు వున్నంత మాత్రాన భార్యని నిరసించనక్కర్లేదు! మనిషికి రెండు కళ్ళూ ముఖ్యమే. ఒక కన్ను వుంది కదా (అవసరం గడుస్తుంది) అని రెండో కన్నుని పొడుచుకుంటామా? దేనివిలువ దానిదే! ఏ వయసుకి ఆ ముచ్చట వుంటేనే అందం–ఆనందం!....

ఆరోగ్యవంతుడైన యువకుడికి సహజంగా వయసులో భార్య పట్ల ప్రేమకోరిక వుంటుంది. తల్లి పట్ల భక్తిభావం వుంటుంది. కాని తన భర్త శంకరం రోగిష్టి. శృంగారం అక్కర్లేదు. సరదా అక్కర్లేదు. సరసం అక్కరలేదు. ముప్పొద్దులా తిండి పెట్టి కాళ్ళొత్తి సేవ చేసేవాళ్ళు కావాలి.

అందుకే సంసారం అంటే తనకి మరీ ఏవగింపు కలిగింది. భర్త దగ్గర తగినంత చొరవా స్వాతంత్ర్యం అసలే లేవు. కాగా భయం. ఇంక ప్రేమ పుట్టుకురమ్మంటే ఎట్లా వస్తుంది?...

భర్త నిరసన, అత్తగారి సాధింపు, ఆడబిడ్డల ఆరళ్ళతో తాను విసిగిపోయింది. మానసికంగా, శారీరకంగా తాను అలిసిపోయింది. ఇరవై ఏళ్ళకే అరవై ఏళ్ళ వైరాగ్యం వచ్చిపడింది.

"మండుటెండలో మలయమారుతంలా" అప్పుడప్పుడూ పుట్టింటికి వస్తే కాస్త ఇలా ప్రాణం హాయిగా వుంటుంది.

పండగో పబ్బమో వస్తే....నాన్న ఈసారి పిలిస్తే బాగుణ్ను. పండక్కి రమ్మని ఉత్తరం రాస్తే బాగుణ్ను. తనని తీసుకుని వెళ్ళడానికి అన్నయ్యా అయినా రాకపోతాడా? — అని ఆలోచిస్తుంది. పండగ ఇంకో పది రోజులు వుండనగానే వాళ్ళ రాకకోసం గడపలో రోజూ ఎదురుచూస్తుంది.

"ఒరేయ్ అన్నయ్యా! మీ ఆవిడకి నీ కంటె పుట్టింటి మీదనే ప్రేమ ఎక్కువరా!" అని ఎగదోస్తుంది తన పెద్ద ఆడపడుచు.

అత్తింట్లో కూడా అభిమానం ఆప్యాయత దొరికితే – ప్రేమించే భర్తని విడిచి ఏ ఆడపిల్ల మాత్రం పుట్టింటికి పరిగెడుతుంది?.... ఆ మాత్రం తెలుసుకోలేరు కాని సాధించటం మాత్రం తెలుసు.

అన్నయ్యకి కొడుకు పుట్టాడు. వాడికి ఆరు నెలలు వచ్చాయి. తనకి చూడటమే పడలేదు! పైగా పెద్దక్క కూడా ముగ్గురు పిల్లలతో వచ్చింది. అంతా పది రోజులపాటు కలిసి ఆనందంగా గడపవచ్చని పుట్టింటికి వచ్చింది. ఇప్పుడు ప్రాణానికి హాయిగా వుంది.

"మీ అక్క పిల్లలు వచ్చారు అంటున్నావ్ కనుక పంపుతున్నాను. ఓ వారం రోజులు వుండి

వెంటనే వచ్చేయ్!'' అని ఖచ్చితంగా మరీ మరీ చెప్పాడు తన భర్త శంకరం వచ్చేస్తుంటే!

తన అత్తగారు ఆ మాత్రం కూడా ఒప్పుకోలేదు! తనమీద ప్రేమ చేత కాదు! తను లేకపోతే ఆ చాకిరి అంతా ఎవరు చెయ్యాలి?

''ఇదిగో....సుందరీ! ఓ నాలుగు రోజులుండి వచ్చేయ్....'' అంది సాగదీసుకుంటూ!

''మా అమ్మ చెప్పింది విన్నావా? ఓ నాలుగు రోజులకంటె ఎక్కువ వుండటానికి వీలులేదు. తీరా మీ అన్నయ్య వచ్చాడని పంపుతున్నాను...'' అన్నాడు భర్త.

వాళ్ళ ఎదురుగా మాత్రం ''సరే! అలాగే'' అని తలూపి అక్కడ్నుంచి ఎలాగో బయట పడింది. కాని ఆ నరకంలోకి ఇప్పుడిప్పుడే వెళ్ళ దల్చుకోలేదు. వచ్చి పది రోజులు అవుతోంది! ఇంకో పదిరోజులు ఎలాగో గడిపేసిందంటే దసరా! బతకమ్మ సంబరం వస్తుంది. ఆ తరవాతే వెళ్ళటం! అంతగా అయితే వెళ్ళాక రెండు తంతాడు! ''ఇన్ని రోజులు పుట్టింట ఎందుకున్నావ్'' అని రెండు తగిలిస్తాడు! కానియ్ అది తనకి అలవాటే!

పండగకో పబ్బానికో పదిరోజుల పాటయినా, పుట్టింట్లో వుండలేకపోతే ఇంకెందుకు బ్రతుకు? అక్క, అమ్మ కూడా ఎదురింటి పెళ్ళికి వెళ్ళారు! అసలు పెళ్ళంటే తనకి ఎన్ని కలలు? ఎన్ని కోరికలు? వాటన్నింటికి ఆలంబన శేఖరం బావ! స్వయాన మేనత్త కొడుకు!....

చెయ్యెత్తు నిలువుతో బలంగా ఆకర్షణీయంగా వుండేవాడు. అతడికి తనంటే ఎంత ప్రేమ!

''సుందీ! నీ అంత అందమైన మరదల్ని ఒదులుకొని వేరే చేసుకుంటానా?'' అనేవాడు అభిమానంగా.

ప్రతీసారి శలవులకి తమ ఊరు వచ్చేవాడు! తనకి చిన్న చిన్న ప్రేమ కానుకలు తెచ్చేవాడు. తన మనసునిండా కమ్మని కలల్ని నింపేవాడు! ఎన్ని బాసలు చేశాడు! ఎన్ని ప్రమాణాలు చేశాడు!

అతడు అంత చేసినా తనకి సంశయమే! తన అదృష్టం మీద అపనమ్మకమే!

''బావా! మేం పేదవాళ్ళం కదా?'' అంటే...

''మేం మాత్రం గొప్పవాళ్ళమా?'' అనేవాడు!

''నిజమే! కాని నువ్వు పెద్ద చదువు చదువుకుంటున్నావ్. రేపు పెద్ద ఉద్యోగం వస్తే....''

''ఊ....వస్తే?''

''మేం ఎక్కువగా కట్నం ఇచ్చుకోలేం కదా?'' దిగులు దిగులుగా తన సంశయాన్ని బయట పెట్టేది.

కాని ఆప్యాయంగా తన చేతిని పట్టుకునేవాడు!

''నువ్వు వట్టి పిచ్చిపిల్లవి సుందరి! కట్నం దేముంది? నీలాంటి అందమైన బుద్ధిమంతురాలే గొప్ప కట్నం!'' అనేవాడు కొంటెగా.

ఏకాంతంగా ఎన్నో బాసలు చేశాడు. ఆశలు రేపాడు! ప్రమాణాలు చేశాడు! కాని చివరికి అవి అన్నీ గాల్లో కలిసి పొయ్యాయి.

అతడికి అదృష్టం కలిసి వచ్చింది. మంచి ఆఫీసరు ఉద్యోగం అయింది. అంతే! నిముషాల మీద అతడి 'డిమాండ్' పెరిగిపోయింది. పదిహేను వేల కట్నంతో వేరే సంబంధం చేసుకున్నాడు! ఆశ చావక తీరా నాన్న అడిగితే—

''నన్ను ఏం చెయ్యమంటావ్ మామయ్యా! అమ్మ ఒప్పుకోవటం లేదే. ఆవిడ నీ చెల్లెలు. నాకంటే ఆవిడకే మీపై మమకారం ఎక్కువ వుండాలి. అమ్మ ఒప్పుకుంటే నాకేం అభ్యంతరం లేదు'' అన్నాడుట శేఖరం బావ. నాన్న దిగాలు పడి వచ్చాడు! ఆరోజు తనెంత ఏడ్చింది? అత్తయ్య డబ్బు మనిషే; కాని శేఖరం వ్యక్తిత్వం మాట ఏమిటి?....

ఆ విరక్తిలోనే శంకరంతో పెళ్ళికి ఒప్పుకుంది.

అయితే మాత్రం తన కలలు ఇలా కరిగిపోవాలనేముంది? జీవితాంతం ఏడవాలనేముంది? కాని తన ఖర్మ!

శంకరంలాంటి మోటు భర్తతో సారంలేని జీవితం గడపమని భగవంతుడు తన నొసట వ్రాశాడు! అదే జరిగింది!....



జర్మనీలోని మ్యూనిచ్ నగరంలో ఒక జీవితభీమా సేల్స్‌మాన్, భార్య నుంచి విడాకులు పొందడానికి ఒక అర్జీ పెట్టుకున్నాడు. ఇంతకీ ఆయన అంత హఠాత్తుగా విడాకులు పుచ్చుకునేందుకు నిర్ణయించడానికి కారణం—ఆమె అతనికి చెప్పా పెట్టకుండా రహస్యంగా తన 42 అంగుళాల వక్ష సౌందర్యాన్ని కాస్తా ఆపరేషన్ ద్వారా తగ్గించుకోవడంట!

''నేను నా భార్యని—ఆమె ఆ సౌందర్యం చూసే వివాహం చేసుకున్నాను. నాకు తెలియకుండా ఆపరేషన్ చేసుకు వచ్చిన తరువాత నేను ఆమెను చూసి దిగ్భ్రాంతి చెందాను. అప్పటి నా పరిస్థితి మీరే ఊహించండి'' అన్నాడట.

ఆ న్యాయాధికారి కేస్ అంతా పరిశీలించి భర్త వైపే తన సానుభూతి మొగ్గించి, ''ఆపరేషన్ చేసుకునే ముందు తన భర్తకి ముందుగా ఆమె తెలియబరిచి వుండవలసింది'' అన్నాడు. 'ఇంతకీ ఇదంతా నేను నా భర్త కంటికి మరింత ఆకర్షణీయంగా కనిపించాలన్న ఉద్దేశ్యంతోనే చేశాను' అని వాపోయిందిట ఆ ఇల్లాలు.

## ఎ. కన్యాకుమారి

ప్రముఖ గాయకురాలు - ఎం. ఎల్. వసంత కుమారితో కచ్చేరీలు చేసి విఖ్యాత వయొలినిస్టుగా పేరుపొందారు అవసరాల కన్యాకుమారి. 1974లో నేపాల్ మహారాజు, మహారాణిల ఆహ్వానంపై ఎం. ఎల్. వి తో బాటు ఆమె నేపాల్ పర్యటించారు. 1975 లో తిరిగి ఆమెతోటే మలేషియా, సింగపూర్‌లలో జరిగిన 12 ప్రదర్శనలలో పాల్గొన్నారు. ఆ మరుసటి సంవత్సరం ఆమె కెనడా, అమెరికా దేశాలలో - 33 కచేరీలలో పాల్గొన్నారు.

ప్రముఖ వయొలిన్ విద్వాంసులు – శ్రీ ఇవటూరి విజయేశ్వరరావుగారి దగ్గర కన్యాకుమారి వయొలిన్ విద్య అభ్యసించారు. సుస్వరాలతో సున్నితంగా పలికించడం ఆమె వాద్యములోని ప్రత్యేకత.

1971–73 లో రెండు సంవత్సరాలపాటు ఆమె కేంద్రప్రభుత్వం ఉపకారవేతనం పొందారు. కళలలో ఉత్సాహం వున్న యువతిని ప్రోత్సహించడానికి యిచ్చే ఉచితవేతనం అది. అప్పుడే ఆమె ప్రముఖ వయొలిన్ విద్వాంసులు శ్రీ ఎమ్. చంద్రశేఖరన్ వద్ద ప్రత్యేక శిక్షణ పొందారు.



ఇంతేకాక 1969 లో మద్రాసు మ్యూజిక్ అకాడెమిలోనూ, ఇండియన్ ఫైన్ఆర్ట్స్‌లోనూ, 1970 లో ఆలిండియా రేడియో నిర్వహించిన సంగీత పోటీలలోనూ పాల్గొని ఆమె ప్రథమ బహుమతులు అందుకున్నారు. ఈ సంవత్సరం కూడా మ్యూజిక్ అకాడెమివారు నిర్వహించిన పోటీలలో ఉత్తమ వయొలిన్ విద్వాంసురాలుగా ఆమె ప్రథమ బహుమతిని అందుకోవడం మరో విశేషం!

1974 నుంచి ఆమె రేడియోలో – జాతీయ కార్యక్రమాలలోనూ, సంగీత సమ్మేళన కచ్చేరీలలోనూ పాల్గొంటున్నారు.

ఆరేళ్ళుగా ఎం. ఎల్. వసంతకుమారితో పాటు దేశ, విదేశాలలో ఎన్నో కచ్చేరీలు చేసిన కన్యాకుమారి డి. కె. పట్టమ్మాళ్, బాలమురళీకృష్ణ, టి. ఆర్. మహాలింగం తదితర ప్రముఖ విద్వాంసులతో పాటు కచ్చేరీలు చేశారు. తనే స్వయంగా కొన్ని ప్రదర్శనలు యిచ్చారు. పలువురి ప్రశంసలు పొందారు.

కన్యాకుమారి కేవలం సంగీతంలోనే కాక చదువులోనూ 'సరస్వతి' అనిపించుకున్నారు. సంగీతం, తత్వశాస్త్రం, మనస్తత్వశాస్త్రాలు ముఖ్య పాఠ్యభాగాలుగా ఆమె మద్రాసు విశ్వ విద్యాలయం నుంచి బి. ఎ ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణురాలయ్యారు. మద్రాసు విశ్వవిద్యాలయం నుంచి బహుమతి కూడా పొందారు. ఆంధ్ర విశ్వ విద్యాలయం నిర్వహిస్తున్న డిప్లొమా పరీక్షలో శాస్త్రీయ, కర్ణాటక సంగీతంలో-వయొలిన్‌లో మొదటి తరగతిలో కూడా ఆమె వుత్తీర్ణురాలయ్యారు.

---

"సీతమ్మ పెళ్ళికూతురాయెనె

రామయ్య పెండ్లి కొడుకాయెనె...."

ఆలోచనల్తో నలుగుతున్న సుందరి ఒక్కసారిగా ఉలిక్కిపడి తెప్పరిల్లింది.

ఎదిరింటి పెండ్లి పందిరిలో నుంచి పెద్ద బ్యాండుమేళం వినిపించింది.

"మాంగల్యం తంతునా నేనా...."

మైకులోనుంచి మంత్రాలు వినిపించాయ్! అంతే! ఆ మూడు ముళ్ళు పడ్డాయ్.

పెళ్ళి పెద్దలంతా వధూవరులపై అక్షతలు చల్లారు. కెమెరాలు క్లిక్‌మన్నాయి. ఫిల్మ్ కూడా తీస్తున్నారుట!

ఆ పవిత్ర దృశ్యాన్ని కిటికీ వూచలు పట్టుకుని తిలకిస్తున్న సుందరి శరీరం ఝల్లు ఝల్లుమంది. తెలియని వింత అనుభూతితో కళ్ళల్లో సన్నటి నీటి పొర క్రమ్మింది!

"తన భర్త మూర్ఖుడు! భార్యని తిన్నావా లేదా అని అడగడు! కష్టం సుఖం విచారించడు! పవిత్రమైన వివాహ బంధాన్ని నిరసించి భార్యని గడ్డి పోచలా చూస్తున్నాడు!........

"ధణేల్........"

విసురుగా శబ్దం వినవచ్చింది.

సుందరి చివ్వున వెనక్కి తిరిగింది.

"సుందరి....సుందరి...." అంటూ వీధి తలుపు నెట్టుకుని అన్నగారు ఎవరో తరుముతున్నట్లుగా లోపలికి వచ్చాడు!

"సుందరీ! బావ వచ్చాడే...." అన్నాడు హడావుడిగా!

ఉలిక్కిపడింది సుందరి. పిచ్చిదానిలా బిత్తర చూపులు చూసింది.

"నిన్నేనే? చెప్పింది వినిపించలే? బావ వచ్చాడు...."

"ఎ....ఏ....బావ?" తత్తరపాటుగా అడిగింది.

"శంకరం బావే! నిన్ను తీసుకుని వెళ్ళటానికి వచ్చాడు. నాలుగు రోజుల్లో వచ్చెయ్యమంటే నువ్వు పది రోజులయినా వెళ్ళలేదని చాలా కోపం మీద వున్నాడే?" అంటూ ఖంగారు ఖంగారుగా తిరిగి వీధి వసారాలోకి వెళ్ళాడు.

సుందరి 'కల' చెదిరింది!

ఒక్కసారిగా స్వర్గంలోంచి నరకంలోకి ఎవరో తోస్తే వచ్చి పడినట్లుగ అయ్యింది ఆమె పరిస్థితి!

శరీరంలోని జీవశక్తి అంతానశించి పోయినట్లు, మొదలు నరకిన వృక్షంలా వున్నచోటే కుప్పలా కూలబడిపోయింది. గుండెలు రెట్టింపు వేగంతో కొట్టుకుంటున్నాయ్. శరీరంలో సన్నగా ఒణుకు ప్రారంభమైంది.

"సీతమ్మ పెళ్ళికూతురాయెనె....రామయ్య పెండ్లికొడుకాయెనే...."

పందిట్లో సన్నాయ్ మ్రోగుతూనే వుంది!

సుందరి గుండెల్లో అలజడి రేగుతూనేవుంది! ☐

# వైద్యసలహాలు



'-డాక్టర్'

శ్రీమతి జె.

మా అమ్మాయికి ఇరవై ఆరు సంవత్సరాలు. ఐదడుగుల ఒక అంగుళం ఎత్తు వుంది. కానీ చాలా పీలగా వుండడం వల్ల బుగ్గలు కొంచెం లోపలికిపోయినట్టు వుంటాయి. పెళ్ళి చూపులకు వచ్చేవాళ్ళంతా అమ్మాయి మరీ సన్నగా వుంది అంటున్నారు. లావెక్కడానికి ఏదైనా మార్గం చెబుతారా డాక్టర్.

**మంచి బలవర్ధకమైన ఆహారం ఎక్కువ ఇవ్వండి. ముఖ్యంగా పాలు, పెరుగు బాగా తీసుకుంటే బరువు పెరగడానికి చాలా అవకాశం వుంది.**

కుమారి జి. యన్.

వక్షోజాల మీద చిన్న చిన్న రోమాలు పెరుగుతున్నాయి. వాటిని చూస్తే నాకే అసహ్యం వేస్తోంది. వీటిని పోగొట్టడానికి ఉపాయం చెప్పగలరు.

**రోమాలను చేతితో తీసివేయడం వల్ల రక్తనాళాలు దెబ్బతింటాయి. అంచేత అలా చెయ్యకూడదు. ఇకపోతే ఈ రోమాలు ఎందుకు పెరుగుతున్నాయో తెలుసుకోవాలి. హార్మోనుల లోపమా అని చూడాలి. దానిని అనుసరించి చికిత్స చేయాలి. ఋతుస్రావం సక్రమంగా జరుగుతూ, గ్రంథుల్లో ఎలాంటి లోపమూ లేకుండా వుంటే, బెంగపడవలసిన అవసరం లేదు.**

శ్రీమతి కె.

నేనూ, మా ఆయన పొడవుగానే వుంటాము. మాకు రెండున్నర సంవత్సరాల పాపాయి వుంది. పాపాయి వయసుకు తగ్గ ఎత్తులేదని అనుమానంగా వుంది. ఈ ప్రాయంలో పాపాయి ఎత్తూ, బరువు ఎలా వుండాలి?

**అసలు మీరు మీ పాపాయి బరువూ, పొడవూ చెప్పనేలేదు. తల్లిదండ్రుల ఎత్తును అనుసరించి పిల్లల పెరుగుదల ఆధారపడి వుంటుంది. ఐదేళ్ళ ప్రాయం వరకు మంచి బలవర్ధక ఆహారం, పాలు, పప్పులు ఎక్కువగా ఇస్తే పిల్లలు మంచి ఆరోగ్యంతో వుంటారు. రెండున్నర సంవత్సరాల వయసులో సాధారణంగా పిల్లలు 15 నుంచి 18 కిలోల బరువు, 50 నుంచి 60 సెంటిమీటర్ల ఎత్తూ వుంటారు.**

శ్రీమతి టి.

నాకు పెళ్ళయి రెండేళ్ళయింది. ఇరవైనాలుగు సంవత్సరాల వయసులో వుండి కూడా ఇంకా రజస్వలకాలేదు. లైంగికక్రియలో సరిగా పాల్గొనలేకపోతున్నాను. ఈ మధ్య బరువు కూడా చాలా తగ్గిపోయాను. కాళ్ళు, చేతులు చాలా బలహీనంగా వుంటున్నాయి. అప్పుడప్పుడు మైకం వస్తూ వుంది. నా ఆరోగ్యపరిస్థితిని తలచుకుంటే చాలా భయం వేస్తుంది. అయినా మా ఆయన చూపే ఆప్యాయతవల్ల దిగులును దిగమ్రింగి తట్టుకుంటున్నాను. తల్లిని కావాలనే ఆశ మరోవైపు పీడిస్తూంది. దీనికేం చెయ్యమంటారు?

**ఇరవైనాలుగేళ్ళు నిండినా ఇంకా రజస్వల కాలేదంటే దానికి కారణం గర్భాశయం సరిగా పెరిగి వుండకపోవచ్చు లేదా అనాళికాగ్రంథుల అనారోగ్యం కూడా కారణం కావచ్చు. అంచేత వెంటనే ఒక మంచి డాక్టర్‌ను సంప్రదించి వైద్యపరీక్ష చేయించుకొని తగిన చికిత్స పొందడం ఎంతైనా అవసరం**

కుమారి ఆర్.

ఆరు ఏడు నెలలుగా ఋతుస్రావం జరిగే చోట ఒకే నవ్వ (దురద)గా వుంటుంది. ఋతుస్రావం జరిగిన ఐదారు రోజుల తర్వాత ఈ నవ్వ ప్రారంభమవుతుంది. రోజూ డెట్టాల్ వేసి శుభ్రం చేసినా తగ్గడం లేదు. డాక్టర్ దగ్గరికి వెళ్ళి సంప్రదించ డానికి సిగ్గుగా వుంది. ఇది తగ్గడానికి దయచేసి ఒకదారి చూపండి డాక్టర్.

**నవ్వ ఉండే చోటులో డెట్టాల్ వేస్తే మంట యేర్పడవచ్చు. అంచేత దానిని ఉపయోగించకండి. అలర్జీ వల్ల లేదా ఒక రకమైన క్రిములవల్ల ఈ నవ్వ యేర్పడుతుంది. GENTIAN VIOLET 1% ACQUEOUS SOLUTION ను రోజుకు రెండు మూడుసార్లు పూయండి. దీనికి నయం కాలేదంటే సిగ్గును కాస్తా తగ్గించుకుని డాక్టర్‌ను సంప్రదించండి!**

కుమారి వి. యల్.

నా వయసు పందొమ్మిది సంవత్సరాలు. గత పదేళ్ళుగా మూలవ్యాధితో బాధపడుతున్నాను. దీనికి ఆపరేషన్ చేయించుకోడం ఒకటే మార్గమా? లేక మందుల ద్వారానే గుణపరచడం సాధ్యమవుతుందా?

**మూల వ్యాధివల్ల ఇంకా ఎన్నో ఇబ్బందులు కలగడానికి ఆస్కారం వుంది. రక్తస్రావం ఎక్కువై పాండురోగం రావడానికి, గర్భాశయంలో క్రిములు చేరి తెలుపు వడడానికి అవకాశం వుంది. మందు వల్ల కొంత నయం కావడం సాధ్యమైనప్పటికీ, ఆపరేషన్ చేయించుకోవడమే ఉత్తమం.**

శ్రీమతి జి. యం.

నా వయసు పదిహేడు సంవత్సరాలు. నా శరీరం మరీ లావుగా వుంది. రోజుకు రెండు పూటలు భోజనం మానివేసినా బరువు తగ్గడంలేదు. ఒక సంవత్సరం నుంచి తల వెంట్రుకలు విపరీతంగా రాలిపోతున్నాయి. దీనికొక పరిష్కారం చెప్పరూ!

**బరువు తగ్గాలంటే ఆహార నియమంతోపాటు శరీర వ్యాయామం కూడా చేయాలి. ఉదయం సాయం కాలం కొంచెం దూరం నడిచి రావడం మంచిది. ఆహారంలో పచ్చటి ఆకు కూరలు, తాజా కూరగాయలు తీసుకోవడం వల్ల తలవెంట్రుకలు రాలడం కొంచెం తగ్గుతుంది. చల్లటి నీళ్ళతో తల స్నానం చేస్తే కూడా మంచి ఫలితం లభించవచ్చు.**

కుమారి ఎస్. ఎస్.

నాకు కొన్ని నెలలుగా ఋతుస్రావం జరిగే తొలి రోజు కడుపునొప్పి వస్తూవుంది. కడుపు మొత్తం కాకుండా ఎడమవైపో, కుడి ప్రక్కో బాధ కల్గుతుంది. కొంచెం కష్టమైన పని చేస్తే కూడా అప్పుడప్పుడు కడుపు బాధ కల్గుతుంది. ఈ బాధ తగ్గడానికి ఒక నివారణ మార్గం చెప్పగలరు.

**దీనికి కారణాలు రెండు: గర్భాశయ ద్వారం**

చిన్నదిగా వుండడం ఒకటి. దీనికి DIALATATION మాత్రమే సరియైన పరిష్కారం. ఇకపోతే గర్భాశయంలో INFECTION అంటే పుండు లాంటిది వుండడం రెండో కారణం. దీనికి డాక్టర్‌ను సంప్రదించి ఒకవారం మందు తీసుకుంటే సరిపోతుంది.

కుమారి ఆర్. యన్.

నేను మా అత్తకొడుకును పెళ్ళి చేసుకోబో తున్నాను. మూడేళ్ళకు ముందు ఆయనకు లైంగిక వ్యాధి సంప్రాప్తించింది. కాని వెంటనే చికిత్స చేయించుకుని పూర్తి ఆరోగ్యం పొందారు. దీనివల్ల మా వైవాహిక జీవితానికిగాని మా సంతానానికిగాని, ఏదైనా హాని కల్గుతుందా?

లైంగిక వ్యాధి వస్తే, వెంటనే వైద్యం చేయించుకుని నయం అయిందంటే వారి వైవాహిక జీవితానికి ఎటువంటి ఇబ్బందీ వుండదు. సంతానోత్పత్తికి గాని, సంతాన ఆరోగ్యానికి గానీ, ఎలాంటి హానీ ఏర్పడదు. అంచేత మీరు ఆయన్ని నిశ్చింతగా పెళ్ళి చేసుకోవచ్చు.

కుమారి ఆర్. యస్.

నా క్రింది పెదవి ఎర్రగా వుంది. చర్మం తెల్లటి పొరలు పొరలుగా వస్తూంది. పెదవి తడి ఆరి పోతూంది. దీన్ని పోగొట్టడం ఎలా? కళ్ళ క్రింది భాగంలో నల్లటి చారలు ఏర్పడ్డాయి. వీటికి బి కాంప్లెక్స్ మాత్రలు వాడవచ్చా? మందుల షాపులో బి కాంప్లెక్స్ అడిగితే విటమిను ఎ & డి ఇస్తున్నారు. రెండూ ఒకటేనా?

రెండూ వేర్వేరు. అయినా మీరు వైటమిన్ బి కాంప్లెక్స్‌కు బదులు మల్టీ వైటమిన్ తీసుకోవడం మంచిది. ఆహారంలో ఎక్కువగా ఆకు కూరలు తీసుకోవడం మంచిది. పెదవి తడి ఆరి ఎండి పోకుండా వుండడానికి మామూలు క్రీమ్స్ వాడవచ్చు!

కుమారి కె.

ఇంటి పనులు చేసినా, చెయ్యకున్నా, నా కాళ్ళూ చేతులు ఎప్పుడూ పోటుగానే వుంటున్నాయి. ఎన్నో వైద్యాలు చెయ్యించుకున్నాను. కాని ప్రయోజనం కనబడలేదు. దీనికేం చెయ్యమంటారు డాక్టర్?

నరాల బలహీనతవల్ల, అలా కాళ్ళు చేతులు పోట్లు వేస్తాయి. డాక్టర్‌ను సంప్రదించి బి–కాంప్లెక్స్ ఇంజెక్షన్స్ వేయించుకోవాలి. కారట్, టొమేటో లాంటి కూరగాయలను పచ్చిగా తీసుకోవడం కూడా మంచిదే.




## ముగింపేమిటి?

(నవల)

[రచన: పవని నిర్మల ప్రభావతి; వెల: రూ. 3-50; పేజీలు: 172; ప్రచురణ: యం. శేషాచలం అండ్ కో, మద్రాసు]

తోచిన ప్రతి ఒక భావనకు, వెంటనే అక్షర రూపం కల్పించి, పరమ పేలవమైన జీవరహిత సాహిత్యం ఎక్కువగా ఉత్పత్తి చేస్తున్న ఈ కాలంలో, ఒక సజీవమైన పరిస్థితిని చూసి, కొన్ని మౌలికమైన అభిప్రాయాలతో, నియమబద్ధమైన పరిధుల్లో, ఒక చక్కటి ప్రయోజనకరమైన నవల రాశారు రచయిత్రి. గొప్ప నవలల పరిధిలో ఆలోచిస్తే అక్కడ ఒకటో రెండో తప్పటడుగులు ఉన్నాయనిపించినా, నవల ఆదర్శం ముందు, రచయిత్రికి ఉన్న విషయ జిజ్ఞాసముందు అవి పాఠకుల్ని అంతగా బాధించవు.

ఈ నవలలో కథ కాదు ముఖ్యం. ఆ కథ చుట్టూ అల్లబడిన సజీవమైన పాత్రలు, వాటి మనస్తత్వ పరిశీలన. అర్థంలేని ప్రేమకథలతో, అల్పమూ, పేలవమూ అయిన పేజీలు నింపే కార్యక్రమాన్ని "రచన" అంటున్న ఈ రోజుల్లో చెప్పదలచుకున్న విషయానికి ఎక్కడా లోపం జరగకుండా తనకు తెలిసిన పరిధుల్లో చాలావరకు న్యాయం కలుగజేశారు రచయిత్రి.

తన అందం మీద గాఢ విశ్వాసం గల వరలక్ష్మి అనే అమ్మాయిని, చిన్నతనంలోనే ఆడదంటే సెక్స్ కోసరమే అనే అభిప్రాయాన్ని, స్వప్రయోజనాల కోసరం ఆమెలో కలిగించాడు ఒక వృద్ధ జంబూకంలాంటి లాయరు. ఆమెలో ఆ సెక్స్ తృష్ణ రాను రాను పెరిగింది. అది లోకం తప్పంటుందేమోనన్న లోపలి భయంతో బయటికి అదే జీవితం, సెక్స్ జీవన ధ్యేయం అన్న ఆదర్శాన్ని లొంగినవారికల్లా బోధించి వీరలక్ష్మి అయింది. ఎందరో ఉడుకు రక్తపు యువకులు ఆమె వాంఛావాహినిలో ఉక్కిరిబిక్కిరి అయ్యారు. ఆమెకు దొరికిన భర్తను ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్‌తో లొంగదీసి, అతని ఎదుటే స్వేచ్ఛా విహారానికి పూనుకుంది వరలక్ష్మి. వయసు వచ్చిన కొద్దీ వాంఛా, చిన్నపిల్లలా కనబడాలన్న తపనా పెరిగాయి ఆమెలో. ఆమె మాటకు ఎదురులేని గృహ సామ్రాజ్యంలో కోడలు అన్న హక్కుగల వ్యక్తి అడుగుపెట్టడం కన్నెర్ర అయింది ఆమెకు. తనకులేని సంప్రదాయం, నీతీ, ఆప్యాయత, సెంటిమెంటు మరొక వ్యక్తిలో వుండడం భరించలేకపోవడం, ఆమె సహజ గుణం. భగవంతుడిచ్చిన తీయటి మాటలతో అందర్ని లొంగదీసుకోగలగడం ఆమె ఆయుధం. అసహ్యకరమైన, వాంఛా ప్రతిరూపమైన స్త్రీత్వానికి, ఆమె ప్రతీక. తనకులేనిది ఏదీ మరొకరికి ఉండరాదనే మనస్తత్వంతో కోడలు వంశం పిచ్చిదని చెప్పి, కొడుకుకు మరొక విశృంఖలతకు అలవాటుపడి, పెళ్లి పట్టింపు పెద్దగాలేని ఆడదానితో సంబంధం కలిపించి, కోడలిని నిజంగా పిచ్చిదాన్ని చేస్తుంది. యువకుడై, తన వాంఛలకు సమిధ అయిన ఒక కుర్ర లాయరుచేత విడాకులు ఇప్పించి, కోడలు బ్రతుకు నాశనం చేసి, ఆమె పెద్దబిడ్డను ఆమెకు దూరం చేసేదాకా నిద్రపోదు ఆమె. ఈ నవలలో నరహరి, సంగమేశ్వరరావు పాత్రలు వరలక్ష్మి ప్రవర్తనను పచ్చిగా బైటపెడతాయి.

"డాక్టర్! సైకియాట్రిస్ట్‌గా మిమ్మల్ని ఒకటి కోరుతున్నాను. నా జీవితం మీకు తెలిసిన ప్రతి ఒక్కరికి చెప్పండి. నా జీవితంలో, నా చుట్టూరా ఉన్న వ్యక్తుల్లో ఎవరికి "ఏ పిచ్చి" లేదో రుజువు చేయమనండి. రకరకాల "పిచ్చులు" పరాకాష్ఠనంది ఉన్న ఈ సమాజంలో, నాలాటి వాళ్ళు కొందరు మాత్రమే ఎందుకు "పిచ్చివారుగా" వెలివేయబడ్డారో వీరినే "వారసత్వపు పిచ్చులు"గా ఎందుకు ఎక్స్‌పోజ్ చేయబడుతున్నాయో జడ్జ్ చేయమనండి" — ఆత్మహత్య చేసుకుంటూ లక్ష్మి డాక్టరుకు రాసిన ఉత్తరం మనకు చాలా కథ చెపుతుంది.

ఏది ఏమైనా ఈనాటి నవలల్లో ఇదొక మంచి ప్రయత్నం. 'నవల నవలకోసరమే' అనిపించే ఈ రోజుల్లో పవని నిర్మల ప్రభావతిలాంటి మరి కొందరు రచయిత్రులు, నిజమైన సమస్యలు కథావస్తువుగా తీసుకుంటే, 'ఆడ రచనలు' అన్న పేరు పోయి ప్రయోజనాత్మకమైన కొన్ని పరిష్కారాలు లభించవచ్చు.




# మీ మనసులోని ఆనందాన్ని మరింత తేజోమయం చేయండి.



పండుగ రోజుల్ని ఫిలిప్స్ డెకొరేషన్ ల్యాంపులతో ప్రకాశవంతం చేయండి. లోకానికి అభినందనలు తెలిపేందుకు అత్యంత వర్ణమయమైన, జిగేల్మనే విధానం ఇదే. మీ ఇళ్ళలో వాడేందుకు ఫిలిప్స్ డెకొరేషన్ శ్రేణిలో లో-వాటేజ్ ల్యాంప్‌లు కూడా లభిస్తున్నాయి.

**ఫిలిప్స్ డెకొరేషన్ ల్యాంపులు**

**ఫిలిప్స్**



# చలికాలానికి పిల్లలకు 'బేబీ' శాలువ

దక్షిణాది వాళ్ళకంటే ఉత్తరాది వాళ్ళకే వూలు బట్టలు చాలా అవసరం. కాని ఇటువైపు నుంచి చలి ప్రాంతాలకు వెళ్ళే వాళ్ళు ఎక్కువగా తొలి రోజుల్లో యిబ్బంది పడేది - చలికి ఆగే బట్టల కోసమే. అక్కడి వాళ్ళు సీజన్ రావడానికి ముందుగానే కొత్త రకాలు అల్లుకోవడం మొదలు పెడతారు. కొత్త నమూనాలు అల్లుకోవడం కోసం పాత వాటిని విప్పేసి మళ్ళీ విచ్చెలుగా చుట్టుకుంటారు. మిషన్ నిట్టెడ్ వాటికంటే యీ చేతి అల్లికవి చాలా వెచ్చగా వుండడమే కాదు. చాలా చౌకలో కూడా వస్తాయి.

ఈ బేబీశాలువ అలా రకరకాల రంగుల స్వెట్టర్లూ శాలువలూ కేప్‌లూ అల్లినప్పుడు — మిగుళ్ళూ తగుళ్ళూగా వుండిపోయిన వూలుతో అల్లినది. పసివాళ్ళని బయిటికి తీసుకు వెళ్ళేప్పుడు మనవాళ్ళు 'దిష్టి తగలకుండా' అంటూ యింత నల్లనిబొట్టు గట్రా పెట్టేస్తారు. కాని ఇటు పార్టీలకీ, వాటికీ పిల్లల్ని తీసుకు వచ్చేప్పుడు పోటీపడి అందంగా స్పెషల్‌గా వుండేలా చూస్తారు. బొద్దుగా వున్న బేబీనిలా అందమైన శాలువలో చుట్టి తీసుకువెడితే 'ముద్దొస్తున్నాడు. శాలువ ఎలా అల్లారు?' అంటూ అడుగుతూ వుంటారు. ఇక ఆ తల్లి ఆనందానికి అవధులు వుండవు. మొదట జమ్ములో ఒకామె దగ్గిర ఇది చూసినప్పుడు ఎంత కలర్‌ఫుల్‌గా వుంది అనుకున్నాను. 'ఇది ఒక వారం బేబీకని ప్రారంభించాను. అలా అతుకుతూ పోతే ఇప్పటికి ఇంత పెదదైంది' అందామె. ఇది అల్లడం చాలా సులభం. ఇదిగో ఇదీ పద్ధతి :

**కావలసిన పూలు :**

| | | | | |
|---|---|---|---|---|
| 2 | బంతులు | 25 | గ్రాముల | పసుపు |
| 2 | ,, | | ,, | గులాబి |
| 2 | ,, | | ,, | ఊదారంగు |
| 1 | ,, | | ,, | చిలకపచ్చ |
| 1 | ,, | | ,, | తోపురంగు |
| 1 | ,, | | ,, | నారింజ పండురంగు |
| 1 | ,, | | ,, | నీలం |

**పద్ధతి :** గులాబి రంగుతో ప్రారంభించి, నెం. 10 సూదుల మీద 81 కుట్లు వేయండి. 1వ వరస నిట్ 2 వ వరస పర్ల్ 3 వ వరస 1 నిట్; సూది ముందుకి నూలు వేసి రెండు కుట్లు కలిపి నిట్ వేయాలి. ఇలా వరస ముగించాలి,

4 వ వరస పర్ల్, 5 వ వరస నిట్. 6వ వరస పర్ల్, 7వ వరస నిట్, 8వ వరస 1 పర్ల్; నూలు సూది వెనక్కవేసి రెండు కుట్లు కలిపి పర్ల్ వేయాలి. వరస ముగించాలి ఇలాగే.

మళ్ళీ 9వ వరస నిట్, 10వ వరస పర్ల్.

ఈ పది వరసలూ కలిస్తే ఒక పేటర్న్ అవుతుంది. అంటే రెండు కన్నాల వరసలు ఏర్పడతాయన్నమాట. ఇలాగే 14 కన్నాల వరసలు ఏర్పడేదాకా ఇదే పద్ధతిన అల్లుకుంటూ రావాలి, పూలు తెంచుకుని మళ్ళీ యిలాగే యింకో రంగు పూలుతో మళ్ళీ యింకో పాటర్న్ ప్రారంభించాలి. ఇలాగే 14 కన్నాల వరసలు అయ్యాక, యింకో రంగు ప్రారంభించాలి. మీకు నచ్చిన రంగులు మీ ఇష్టం వచ్చిన పద్ధతిలో ఇలా అల్లి ముగించాలి.

ఇలాగే 61 కుట్లు వేసి రెండు పేటర్న్‌లు వెసుకోవాలి. ఈ ముక్కలన్నీ సాఫీగా వుండేలా యిస్త్రీ చేసి ఈ కింది విధంగా అతకాలి.

| 61 కుట్లు | 81 కుట్లు | 61 కుట్లు |
|---|---|---|
| పసుపు | ఊదా | గులాబి |
| గులాబి | పసుపు | ఊదా |
| నారింజ | తోపు | గులాబి |
| ఊదా | గులాబి | పసుపు |

లేసు సూదితో చుట్టూ ఒక వరస ముద అల్లాలి. (సూది మీద దారం వేసుకుని వేయాలి) 2వ వరస 3 గొలుసు 2 స్తంభాలు (అంటే సూదిమీద రెండు రింగులు రావాలి) చొప్పున చుట్టూ వేసుకోవాలి. నాల్గుమూలలా మటుకు 3 స్తంభాలు రావాలి.

—కవితా చింతామణి

# జ్యోతుల రంగవల్లి

దీపావళి, కార్తీక పౌర్ణమిల్లాంటి పండుగ రోజులలో ఇంటిని ఈ రంగవల్లితో అలంకరించవచ్చు. ముఖ్యంగా ముందు గదిలో ఈ ముగ్గుకు తగిన రంగులతో దిద్దినట్టయితే మరీ అందంగా వుంటుంది.

మొదట, మొదటి చిత్రంలో వున్నట్టు చుక్కలు పెట్టుకోవాలి. ఆ పైన రెండవ చిత్రంలో చూపిన ప్రకారం ఇరువైపులా వున్న దీపాలవరుస అల్లికను పూర్తిచేయాలి. తర్వాత పీటికి మధ్య వున్న పంచముఖ జ్యోతి అల్లికను వేయాలి. మనసుకు నచ్చిన రంగులతో అలంకరించినట్టయితే ఈ జ్యోతుల రంగవల్లి చూడడానికి చాలా ఆకర్షణీయంగా కనుల విందు చేస్తుంది.

—మోహన








పడమటి ఆకాశంలో సూర్యుడు దిగబడి వెలుగును మాత్రమే మిగిల్చాడు. మీగడ తరగల్లాంటి మేఘాలు అక్కడక్కడ నిలబడి ఆ చోద్యాన్ని చూస్తున్నాయి. చల్లబడ్డగాలి. చెట్ల ఆకుల మధ్యగా పరుగెత్తుతూ ఆడుకుంటూంది.

సన్నజాజి పందిర మీంచి కమ్మటి వాసనలు గుబాళిస్తుంటే డాబా మీద నిలబడి ఎదురుగా ఉన్న ఖాళీస్థలం వైపు ఆసక్తిగా చూస్తూంది వర్దని. అక్కడ చాలామంది పిల్లలు ఆడుకుంటున్నారు. సరిగ్గా తన వయస్సే వుంటుంది. ఆ పిల్ల 'దొంగ' కాబోలు కళ్ళకు నల్లటిగుడ్డ కట్టారు. మిగిలిన పిల్లలంతా "నన్ను ముట్టుకోకు నామాల కాకీ" అంటూ ఒక్కొక్కరే ఆ అమ్మాయి దగ్గరగా వెళ్తున్నారు. తీరా ముట్టుకోబోయేసరికి మరో ప్రక్కనుంచి మరొకరు. పాపం ఎంతసేపైనా ఆ అమ్మాయికి ఎవరూ దొరకలేదు. అక్కడున్న పిల్లల్లో ఆ అమ్మాయి ఒక్కతే చిన్నది. ఎంత సేపటికీ ఎవరూ తనకు దొరక్కపోడంతో కళ్ళకున్న గంతలు విప్పేసుకుని "నే నాడను బాబూ" అంటూ బుంగమూతి పెట్టి ఓ గట్టు మీద కూర్చుండి పోయింది. మిగిలిన పిల్లలు వూరుకుంటేగా! ఎగతాళి చేయడం మొదలు పెట్టారు. ఆ అమ్మాయి పౌరుషంగా లేచి తనంతట తానే కళ్ళకు గంతలు కట్టుకుని ఒక్కక్షణంలో నలుమూలలకు పరుగెత్తి అందర్లోకీ పెద్ద పిల్లను 'ఔట్' చేసింది.

ఆ అమ్మాయిని చూస్తే వర్దనికెంతో గర్వమనిపించింది.

'తనూ వాళ్ళతో పాటు ఆడితే?' అన్న ఆలోచన రాగానే మనసులో దిగులు ఆవరించింది.

"అటువంటి వాళ్ళతో నువ్వు ఆడకూడదమ్మా" అంటుంది అమ్మ. వాళ్ళు తక్కువ కులస్తులట - అసలు కులమంటే ఏమిటో అడిగితే అర్థం మాత్రం చెప్పదు - తనకు తెలిసిందొక్కటే - వాళ్ళు తనలా నీటుగా వుండరు. శుభ్రమైన బట్టలు వేసుకోరు. తల దువ్వుకోరు-కాళ్ళకి జోళ్ళు వేసుకోరు-బళ్ళోకి వెళ్ళరు-తనకు కనిపిస్తున్న తేడాలు మాత్రం యివే.

అయితే మాత్రం? వాళ్ళతో పాటు ఆడుకుంటే నేం?

చచ్చినా అమ్మ వెళ్ళనివ్వదు.

'వెళితే చంపుతా' అంటుంది.

ఎంతసేపూ రబ్బరుబొమ్మలూ-లక్క పిడతలూ-ఇంతే!

వర్ధనిదృష్టి పక్కింటి మేడముందు ఆగిన కారు మీద పడింది.

ఆ మేడలో వుండే రబ్బరు బొమ్మల్లాంటి యిద్దరు పిల్లలూ చెంగుచెంగున దూకుతూ కారు దగ్గరకు వచ్చారు.

వాళ్ళతో ఆడుకోమంటుంది అమ్మ.

ఒక రోజు తను వెళితే అదోలా చూశారు తన వంకా తన బట్టలవంకా. వాళ్ళవి ఖరీదైన బట్టలు. పైగా అబ్బాయిల్లా పాంట్లూ చొక్కాలూ వేసుకున్నారు. వాళ్ళముందు వాయిల్ గౌను వేసుకున్న తను, వాళ్ళకి తక్కువకులం దానిలా అన్పించింది.

తక్కువకులమంటే డబ్బు లేకపోడమా ? అర్థం కాలేదు తనకు. వెనుదిరిగి వచ్చేసింది. అంతే. అప్పట్నించీ మరి వెళ్ళలేదు.

వాళ్లు రోజూ ఎక్కడికో అక్కడికి షికారు వెళ్తారు. లేదా యింటి ముందు గడ్డి జాగాలో రింగ్ టెన్నిస్ ఆడతారు.

తనకి షికార్లూ లేవు - ఇంటి ముందు జాగానూ లేదు. రింగ్ టెన్నిసూ లేదు. అసలు ఆడుకుందికి తనకు, అక్క, అన్న, తమ్ముడు, చెల్లీ ఎవరూ లేరు. తనొక్కతే !

సీసా పాలు తెచ్చే క్రిష్ణుడికి కూడా ఒక తమ్ముడున్నాడు. సాయంత్రం యిద్దరూ చెట్టాపట్టా లేసుకుని వచ్చి పాలు తెస్తారు.

అందర్లా ఆడుకునేరాత తనకి లేదేమో మరి !

అప్పుడే చీకటి పడిపోయింది. ఆడుకునే పిల్లల్లో కొందరు యిళ్ళకు పోయారు గావును మిగిలిన కొద్దిమందీ సీతారామస్వామి కోవిల అరుగు మీద కూర్చుని కథలో, కబుర్లో చెప్పుకుంటున్నారు. బుర్రుమని శబ్దం చేసుకుంటూ బయల్దేరిన పక్కింటి వారి కారు వంక చూస్తూ అలానే వుండిపోయింది వర్ధని.

*

ఎంత సేపట్నించి చూస్తోందో —

కాళ్ళు లాగుతున్నాయిగాని తను ఎక్కే బస్సు మాత్రం వచ్చే జాడ కన్పించలేదు. ఎన్నో బస్సులు వస్తున్నాయి. వెళ్తున్నాయి. ఎక్కే జనం ఎక్కుతున్నారు - దిగే జనం దిగుతున్నారు. సాయంకాల మయ్యేసరికి యీ జన సందోహం ఎక్కణ్నించి వస్తుందో ? ఆఫీసు నుండి యింటికి వెళ్ళాలంటే రోజూ కనీసం ముప్పావు గంటైనా బస్సు కోసం నిరీక్షించాలి.

ఈ నిరీక్షణ జీవితంలో కూడ అలవాటై పోయింది తనకు — నిట్టూర్చింది వర్ధని —

మొన్న చూసి వెళ్ళిన పెళ్ళివారి ఉత్తరం కోసం నాన్న నిరీక్షిస్తూనే వున్నాడు. ఈ రోజన్నా వచ్చిందో లేదో ! నిన్న రాత్రి మరో సంబంధం గురించి చెబుతోంది అమ్మ. తల్చుకుంటే ఆశ్చర్య మేస్తుంది. ఎందరు పెళ్లికొడుకులు చూశారు తనని ! ఎన్ని ప్రశ్నలు !

ఒక్క సంబంధమూ ఖాయపడలేదు — తను నచ్చిందిట చాలామందికి. మిగతావే నచ్చలేదు గావును. తనను చూసిన వాళ్ళలో చాలమందికి పెళ్ళిళ్ళయిపోయాయి-పిల్లల్తో కన్పిస్తూంటారు అప్పుడప్పుడు.

"దానికారాత వుందో లేదో" అంటుంది అమ్మ.

నిజమే మరి - వోణీలు వేసిన దగ్గర్నించీ అమ్మ చెబుతూనే వుంది.

"మన కుటుంబాల్లోకి లక్ష్మీదేవి ఎలానూ రాదు. ఆ వచ్చే సరస్వతీదేవినన్నా రానియ్" అంటూ తనకు డిగ్రీ చెప్పించడానికే సిద్ధపడ్డాడు నాన్న —

కాలేజీలో చదివినందుకు నిజంగా గర్వమే అన్పించింది తనకు.

తెలివి తేటలున్నా చదివే స్తోమత లేకే తాలూ కాఫీసులో గుమస్తాగా మిగిలిపోయాడు నాన్న !

డిగ్రీ పూర్తయిన దగ్గర నుండీ అమ్మ పెళ్ళికొడుకుల వేటలోనూ నాన్న ఉద్యోగం వేటలోనూ పడ్డారు. తను లోకాన్ని తెల్సుకున్నదప్పుడే. వేట పూర్తవలేదు - వయసు మాత్రం అటు పెళ్ళికి,

---

**[లోకజ్ఞానం : సమాధానాలు]**

1. జీలం, చీనాబ్, రావి, బీస్, సట్లెజ్ - ఈ అయిదు నదులు సింధునది ఉపనదులు.
2. ఆంధ్రప్రదేశ్.
3. దక్షిణ చీనా సముద్రము. లేక సౌత్ చైనా సీ (South China Sea) విస్తీర్ణం : 1,148,500 చదరపు మైళ్ళు. హిందూమహాసముద్రానికీ చైనాకి దక్షిణంలో వున్న దక్షిణపసిఫిక్‌కి మధ్య వున్న మలయన్ సముద్రం విస్తీర్ణం 3,144,000 చదరపుమైళ్ళు. కాని అంతర్జాతీయ హైడ్రోగ్రాఫిక్ బ్యూరోవారు ఈ సముద్రాన్ని గుర్తింపకపోవడం వల్ల దక్షిణ చీనా సముద్రం అతి పెద్ద సముద్రంగా పరిగణింప బడుతోంది.
4. నూరుకోట్లు. మిలియర్డ్ అంటే వెయ్యి మిలియన్లు అని అర్థం.
5. తొడ ఎముక. దీనినే ఫెమూర్ (Femur) అని కూడా అంటారు. మానవదేహంలోని 206 ఎముకలలో తొడ ఎముక అత్యంత పొడవైనది. మనిషిపొడవులో యిది 27½ శాతం వుంటుంది.
6. మాక్ మహన్ లైను (The Mc Mahon Line).
7. మన దేశపు తొలి ప్రధానమంత్రి పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ.
8. 24. అశోకచక్రం ముదురు నీలం, తెలుపు రంగులలో మన జాతీయపతాకాన్ని అలంకరించి వున్నది. క్రీస్తు పూర్వము 273 - 232 మధ్య పాలించిన అశోకచక్రవర్తి తన ధార్మిక పరిపాలనకి చిహ్నంగా వుపయోగించిన ధర్మచక్రం యిది.
9. ఎక్స్‌పో '70. జపానులోని ఒసాకానగరంలో మార్చినెలనుండి సెప్టెంబరు 13, 1970 వరకు జరిగిన అంతర్జాతీయ వస్తుప్రదర్శనశాల- ఈ ఎక్స్‌పో 70. ఈ ప్రదర్శన తిలకించడానికి జపానులోని వారే కాక వివిధ దేశాలనుండి 65,000,000 (6 కోట్ల 50 లక్షలు) మంది వచ్చారు. ఈ ప్రదర్శనవల్ల మూడు కోట్ల డాలర్లు (అంటే దాదాపు 26 కోట్ల రూపాయల పైచిలుకు) లాభాలు వచ్చినట్లు అంచనా వేయబడుతోంది.
10. భారతదేశంలో. బాడ్మింటన్ ఆట మన దేశంలోనే ప్రారంభమయింది. అయితే ఈ ఆటని అప్పట్లో 'పూనా' (Poona) అనే పేరుతో వ్యవహరించేవారు. ఆ తరువాత 1860 ప్రాంతాలలో గ్లూసెస్టర్‌షైరు (ఇంగ్లండు)లోని బాడ్మింటన్‌హాల్ ప్రాంతంలో ఈ ఆటకి మెరుగులు దిద్దబడి అభివృద్ధి చెందడంతో బాడ్మింటన్ అనే పేరు వచ్చింది.

యిటు వుద్యోగానికి పనికిరానిదయింది.

చివరికి తనే సంపాదించుకుంది ఓ షిప్పింగ్ కంపెనీలో రిసెప్షనిస్ట్ ఉద్యోగం.

బతుక్కో దారి కన్పించిందని సంతోషించింది తను.

చదివించిన చదువు వృధా పోలేదన్నాడు నాన్న.

"ఎందుకొచ్చిన చదువులూ వుద్యోగాలూ - ఆడపిల్లకి పెళ్ళి కానపుడు" అంటుంది అమ్మ.

నిజంగా అమ్మ అన్నట్లు తనకా 'గీత' లేదేమో!

లేకపోతే ఏమిటి?

తను అనాగరికురాలూ, అనాకారీ కాదే!

కంపెనీలో అందరూ తనవంకే చూస్తారు!—

అలా చూసే వాళ్ళలో పెళ్ళికానివాళ్ళెందరో వున్నారు.

వాళ్ళలో ఒక్కరికీ తను నచ్చలేదా? నచ్చిందనే వాళ్ళ చూపులు చెబుతాయి - మరి పెళ్ళెందుకు చేసుకుంటామనరు? పెళ్ళనేసరికి పెద్దవాళ్ళూ, వాళ్ళ ఆశలూ, కట్నాలూ, ఆచారాలూ - యివన్నీ వస్తాయి కాబోలు!

చదువుకున్నవాళ్ళూ అంతే - చదువుకోనివాళ్ళూ అంతే-ఏమైనాసరే వాటిలో ప్రమేయం లేకుండా కేవలం 'తను' కావల్సినవాళ్ళనే చేసుకుంటుంది తను.

సీతమ్మధార వెళ్ళే బస్సు రావడంతో ఆలోచనల్లోంచి సర్దుకుని ముందుకొచ్చింది వర్ధని-అప్పటికే జనం ఫుట్‌బోర్డుమీద వేలాడుతున్నారు.

స్టాపులో ఆగకుండానే వెళ్ళిపోయింది బస్సు.

నిట్టూర్పు విడిచి మళ్ళీ జరిగి నిల్చుంది వర్ధని.

కాస్త చీకటి పడిందేమో బజారంతా దీపాలతో అందంగా మారింది. రోడ్డు మీద ఎన్నో జంటలు!

ప్రతి జంటనీ పరీక్షగా చూస్తోంది - అందులో చాలమంది తనకంటే చిన్నవారే-సరదాగా, సంతోషంగా భర్త ప్రక్కన నడుస్తూ, చక్కగా నవ్వుకుంటూ మరీ వెళుతున్నారు.

వర్ధని దృష్టి అకస్మాత్తుగా ఒక యిల్లాలిపై పడింది.

ఆవిడకు ఖచ్చితంగా తన వయసే వుంటుంది. కడుపుతో వున్నట్టుంది.

భర్త చెయ్యి పట్టుకుని నడుస్తోంది. అటువంటి స్త్రీని చూస్తే అదోలా అన్పిస్తుంది తనకు.



జోసఫ్ బార్డర్స్, మోనికా అనే దంపతులు అమెరికాలోని కన్సాస్‌లో నివసిస్తున్నారు. వాళ్ళిద్దరూ ఇటీవల విడాకులు పుచ్చుకున్నారు. ఆస్తిపాస్తుల పంపకం విషయంలో వారికి ఎలాంటి గొడవా రాలేదు గానీ, తమ పెంపుడు పిల్లి పెంపకం విషయంలో మాత్రం మాటా మాటా వచ్చింది. దాంతో కోర్టుకి ఎక్కారు. హచిన్‌సన్ నగరపు న్యాయాధికారి మొదట ఇచ్చిన తీర్పులో 'పిల్లిని పోషించగల శక్తి సంపాదనా పరుడైన జోసఫ్‌కే వుంది కాబట్టి పిల్లి అతనికే చెందుతుందని' అన్నాడు.

కాని మోనికా 'తన భర్త (?) పగలంతా ఉద్యోగంలో వుంటాడు కాబట్టి ఇంట్లో పిల్లిని చూసుకునేందుకు ఎవరూ వుండరు కాబట్టి ఆ పిల్లి తనకే చెందాలని' ఆర్జీ పెట్టుకుంది.

దాంతో ఆ న్యాయాధికారి 'ఔనౌను' అన్నాడు. కాని జోసఫ్ ఊరుకుంటాడా— అతను మరో ఆర్జీ పెట్టుకున్నాడు. 'ఆ పిల్లిని చూడలేకపోతే తనుండలేనని.'

రిచర్డ్‌రోన్ అనే న్యాయాధికారి కలగజేసుకుని ఆ భార్యాభర్తల వివాదాన్ని పరిష్కరించాడు. ఆయన తీర్పు ప్రకారం 'పిల్లి మోనికా రక్షణలో వుంటుంది. జోసఫ్ కావలసినప్పుడల్లా వచ్చి ఆ పిల్లిని చూసి వెడుతూ వుండవచ్చు.'

ఆ అనుభూతి ఎలా వుంటుందో?

కొత్తరుచులు, కోరికలు పుడతాయట-అటువంటి స్థితిలో భర్తకూడ అపురూపంగా చూసుకుంటాడట.

కడుపులో చక్కిలి గింతలు పుడతాయట.

ఆ ఆనందం అనుభవించాల్సిందే నేమో!

కొత్త జంట మధ్య కోరికల పంట.

ఆ తర్వాత బోసినవ్వులు. ఆటలు, పాలుపట్టడం, నీళ్ళుపోయడం, పౌడరద్ది బట్టలువేయడం. ఆ అనుభూతుల కోసమన్నా పెళ్ళికావాలనిపిస్తుంది.

మరి ఆ రాత వుందో లేదో తనకు?

*

తనకారాత లేదేమో మరి?

పెళ్ళయి మూడేళ్ళయింది.

రెండో పెళ్ళివాడయితే మాత్రం మళ్ళీ ఎందరికి పిల్లలు కలగటం లేదు?

ఆఫీసరుహోదా, డబ్బూ, పలుకుబడీ వీటిగురించి కాదు తను పెళ్ళిచేసుకున్నది - అది లోకందృష్టి.

రెండో పెళ్ళని తెల్సినా, ఎదిగిన పిల్లలున్నారన్నా సిద్ధపడింది — ఎందుకని?

యే కొద్ది అనుభూతులు మిగిలినా చాలునని కాదూ?

కానీ....కానీ....

"మనకిక పిల్లలు పుట్టరా" అని ఆయన నడగాలంటే అభిమానం అడ్డొస్తుంది.

"ఏది దాచినా ఈ విషయం దాస్తారా?" అన్పిస్తుంది వెంటనే.

ఆయనలో లోపం లేదనటానికి రుజువుంది.

మరి తనలో వుందా ఆ లోపం?

ఏమో....ఏమో!

తన కోరిక ఎప్పటికన్నా తీరేదేనా? ఏమో!

ఎదురు చూద్దాం; ఆశించడం; చివరికి పొందడమో పొందకపోవడమో....

అదే మరి జీవితం!

"ఈ నెక్లెసు ఎక్కడ కొన్నావు వదినా....ఎంత బాగుందో."

"ఆ మధ్య మీ అన్నయ్యగారు ఢిల్లీ వెళ్ళినప్పుడు కొత్త మోడల్ అని చెబితే తీసుకు వచ్చారు."

"నాకూ కొనుక్కోవాలనే వుంది. కాని యిప్పుడెలా కుదురుతుందిలే" అంది నిరుత్సాహంగా సుశీల.

# బంగారం

"అదేమిటి బంగారం వేలం వేస్తున్నారటగా... అంటే వెలలు తగ్గుతాయనేగా" అమాయకంగా అంది శాంత.

"ఆ వేలం ఎందుకు వేశారోగానీ వేలం వెర్రిగా వెలలు మాత్రం పెరిగిపోయాయి."

నిజమే....

దేశ ఆర్థిక పరిస్థితితో నిమిత్తం లేకుండా అతి తక్కువ వ్యవధిలో కూడా బాగా అమ్మకం సాగే విలువైన వస్తువు – బంగారం మాత్రమే. ఆ విధంగానే – కరెన్సీ విలువ తగ్గుతున్నకొద్దీ విలువ పెరిగే మొదటి వస్తువులలో చెప్పుకోదగ్గదీ – బంగారమే!

ఈ సూత్రాన్ని ఆర్థికశాస్త్రం గురించి బొత్తిగా తెలియని ఒక సామాన్య రైతు ఇలా చెప్పాడు.

"మా చిన్నతనంలో కాసు బంగారం 25 రూపాయలు వుండేది. అప్పట్లో ధాన్యం బస్తా 4 రూపాయలు వుండేది. కాని యిప్పుడు కాసు బంగారం 670 రూపాయల దాకా వుంది. ధాన్యం వెల రూ. 92 నుండి 116 దాకా పలుకుతోంది. అందుకే బంగారం ధర మాత్రం ఎన్నటికీ తగ్గదు. వెలలు దానితో పోటీపడి పెరగాల్సిందే తప్ప."

అసలు బంగారానికి అంతర్జాతీయ రంగంలో యింతటి ప్రాముఖ్యత ఎలా ఏర్పడింది?

ఈ కరెన్సీనోట్లు, నాణాలు కనిపెట్టని రోజుల్లో వ్యాపారం అంతా బార్టర్ పద్ధతిలో జరిగేది. అంటే బియ్యం వున్నవాళ్ళు యింత బియ్యానికి యింత పప్పుదినుసులనో, కాయగూరలనో లెక్కగట్టి అవి పుచ్చుకునేవారు. ఆ తర్వాత ఇది పద్ధతి కాదనుకుని కౌరీషెల్స్ అనబడే గవ్వలను నాణాలుగా ఉపయోగించుకున్నారు. దరిమిలా తోలు నాణాలు వచ్చాయి. ఆ తరువాత పేపర్ కరెన్సీ వాడకంలోకి వచ్చింది. వివిధ దేశాల మధ్య వ్యాపారం సజావుగా సాగేందుకు ఈ కాగితపునోట్ల విలువ యింత అని నిర్ణయించడానికి ఒక కొలమానం అవసరం ఏర్పడింది. లోహాలన్నిటిలోకీ విలువ తరగనిది బంగారం మాత్రమే కాబట్టి ఆ స్థానంలోకి బంగారం ప్రవేశించింది.

అప్పటినుంచి నేటిదాకా కేవలం స్త్రీల కంఠహారాలలోనే కాక దేశదేశాల ఆర్థిక స్థితిగతులలో కూడా బంగారం ప్రముఖస్థానం వహిస్తున్నది.

ఈ ప్రపంచంలో పెరగడమే కాని తరగడమంటూ వుండనివి రెండే రెండు అని అంటూ వుంటారు.

అవి – ఒకటి వయసు, రెండవది వెల.

అందులోనూ బంగారం విలువ, దీని వెల అసలు తరగడమంటూ వుండదు. అందుకే మనకి బంగారం అంటే అంత మోజు.

ఈ మధ్య బంగారం వెల ఎన్నడూ లేనంత విపరీతంగా పెరిగింది. పది గ్రాముల బంగారం వెల (8 గ్రాములు = 1 కాసు) 960 రూపాయల దాకా వెళ్ళింది. ఇందుకు కారణం ప్రభుత్వం బహిరంగంగా బంగారం వేలం వేయడం.

ఈ సంవత్సరం మే నెలలో ప్రారంభమైన ఈ వేలం పాటలకి ముందు బంగారం ధర 10 గ్రాములు 650 రూపాయలు వుండేది. సాధారణంగా దీపావళి పండుగ ముందు బంగారం అధికంగా అమ్ముడుపోతూ వుంటుంది. గత సంవత్సరం దీపావళికి 700 రూపాయల దాకా పెరిగి ఆ తరువాత యథాస్థితికి వచ్చింది.

వేలం వేయడం వల్ల మే నెలలో రూ. 700, ఆగస్టులో రూ. 750, సెప్టెంబర్‌లో రూ. 800కి పెరిగిన బంగారం వెల అక్టోబరు నాటికి ఊహకి అందనంతగా పెరిగిపోయింది.

బొంబాయిలో రూ. 960 (10 గ్రాములు) వుంటే మద్రాసులో రూ. 983కి చేరుకుంది.

ధన్‌బాద్‌లో అయితే, 1,075 రూపాయల దాకా పెరిగిందట! ఈ బొగ్గు నగరంలో యిదే వెలకి 5 టన్నుల బొగ్గు కొనుగోలు చేయవచ్చు. కాని బంగారం మీద వున్న మోజు బొగ్గు మీద ఎవరికి వుంటుంది?

ఇతర దేశాలతో పోల్చి చూస్తే మన దేశంలో బంగారు నగల మీద ప్రత్యేకమైన మోజు వుంది. ఇది యిప్పటిది కాదు – అనేక శతాబ్దాలుగా వస్తున్న ఆనవాయితీ. అంతెందుకు - ఈ మధ్య బంగారం వెల పెరిగినా కొనేవాళ్ళు కొంటూనే వున్నారు. కారణం అడిగితే – 'ఇంకా పెరిగిపోక ముందే జాగ్రత్త పడుతున్నాం' అని సమాధానం చెప్పారు.

బంగారు నగలకి గల వ్యామోహంలో మన దేశం ప్రథమస్థానం వహిస్తే, ద్వితీయస్థానం ఇటలీకి చెందుతుంది. ఆ తరువాతనే అమెరికా, పశ్చిమ జర్మనీ మొదలైన దేశాలు వస్తాయి.

మన దేశంలోనే ఏటా దాదాపు 300 కోట్ల రూపాయల విలువ చేసే బంగారం నగల రూపంలోకి మారుతోంది. ఈ పరిశ్రమ దాదాపు 20 లక్షల మందికి ఉపాధి కల్పిస్తోంది.

మన దేశంలో సంవత్సరానికి 50 లక్షల వివాహాలు జరుగుతున్నాయి. సగటున ఒక్కొక్క వివాహానికి 5 తులాల బంగారం కావలసి వస్తోంది. ఇందులో సగం దాకా కుటుంబాల్లో తరతరాలుగా వస్తున్న బంగారం వుంటోంది. తతిమ్మాది కొనుగోలు చేయడం జరుగుతోంది. ఈ విషయాలు ఐదు సంవత్సరాలపాటు జరిపిన ఒక అధికార పూర్వకమైన సర్వేలో తేలాయి.

అసలు – బంగారు నగల మీద ఇంత మోజు ఎందుకు?

బంగారు నగలు అందంగా, ఆకర్షణీయంగా వుండడమే కాదు. అవి హోదాని కూడా చాటి చెబుతాయి. ఒక దేశంలో ఎంత బంగారు నిలవలు వుంటే ఆ దేశం అంత ధనికదేశం అని అంటూ వుంటారు. ఆ విధంగానే ఎవరి దగ్గర ఎక్కువ బంగారు నగలు వుంటే వారు అంత ధనికులుగా భావించడం జరుగుతోంది.

మరో ముఖ్యమైన కారణం ఏమిటంటే—బంగారం ఆపద సమయాల్లో ఆదుకునే పెన్నిధి కూడా. కొందరు పొదుపరులు తమ ధనాన్ని నగల రూపంలో భద్రపరుస్తూ వుంటారు. కారణం అది చెదలు పట్టనిది; విలువ తగ్గనిదీ కాబట్టి.

ఈ మధ్య బ్యాంకులు కూడా బంగారాన్ని కుదువబెట్టుకుని అప్పులు యివ్వడం ప్రారంభించాయి. ఆ విధంగా మంజూరు చేసిన రుణాలు 500 కోట్ల రూపాయల దాకా వుంటాయని అంచనా వేయబడుతోంది. ఇందులో 350 కోట్ల దాకా వ్యవసాయానికి, పారిశ్రామిక రంగానికి యివ్వబడింది.

మన గ్రామాలలో పంటలు బాగా పండడం, వెలలు పెరగడంతో పొలం వున్న రైతుల పరిస్థితి కూడా మెరుగుపడింది. వారికి అదనంగా లభించిన ధనాన్ని బంగారం రూపంలోకి మార్చుకుంటున్నారు.

ఒక్క పంజాబు, హర్యానా రాష్ట్రాలలోని రైతులు మాత్రమే ఫుడ్ కార్పొరేషన్ వారి వద్ద నుంచి 250 కోట్ల రూపాయలు పొందారు. ఇందులో చాలామటుకు బంగారం కొనుగోలుకే వుపయోగించ బడినట్లుగా చెప్పబడుతోంది.

బంగారం మీద మన వనితలకు ఎంత మోజు వుందో తెలియజేయడానికి ఒక సంఘటన:

1963 జనవరి, 9 న అప్పటి ఆర్థికమంత్రి శ్రీ మొరార్జీదేశాయ్ 'బంగారు కంట్రోలు' చట్టం తీసుకు వచ్చారు. ఆయన పథకం ప్రకారం దేశంలో వ్యక్తిగతంగా ఎవరూ ముడి బంగారాన్ని తమ వద్ద వుంచుకోకూడదు. 14 క్యారెట్ల బంగారాన్ని (మన దేశంలో 22 క్యారెట్ల బంగారాన్ని వుపయోగిస్తున్నారు) నగల తయారీకి వుపయోగించాలి.

ఇది మన ఆర్థిక వ్యవస్థని మెరుగుపరచడానికి తోడ్పడవచ్చు. కాని సంస్కృతీ, సంప్రదాయాలనే మాయా పాచికలలో చిక్కుకుని వున్న భారతస్త్రీ 'కంట్రోల్' ని సహజంగానే వ్యతిరేకించింది.

'14 క్యారెట్ల మంగళ సూత్రాలను కట్టుకోవడమా?' అని మండిపడ్డారు మగువలు. వివాహబంధం అనేది మేలిమి బంగారంతోనే కాదు పసుపుతాడుతో కూడా దృఢపడుతుంది అన్న ఆలోచనే వారికి కలగలేదు_ఆ ఆవేశంలో.

ఆభరణాలంటే విపరీతమైన మోజుగల వనితలు లేవదీసిన అలజడితో ఆ చట్టం మాట అటుంచి, ఆ తర్వాత-ఆయన తన పదవినుండే పైదొలగవలసి వచ్చింది!

అమెరికా వంటి దేశాలలో నగల తయారీకి 9 నుంచి 18 క్యారెట్ల వరకు బంగారాన్ని వుపయోగిస్తారు. అక్కడివారికి ఆభరణాల మీద అంతగా మోజు లేదు. ఉన్నా ఎంత బంగారం ఆ ఆభరణంలో వుంది?—అని కాకుండా ఆ నగ డిజైను ఎలా



ప్రపంచ ప్రసిద్ధ గాయని లతామంగేష్కర్‌కి కొల్హాపూర్ శివాజీ విశ్వవిద్యాలయం 'డాక్టర్ ఆఫ్ లిటరేచర్' గౌరవ పట్టాన్ని ఇచ్చింది. దాదాపు మూడు దశాబ్దాలుగా తన కంఠ మాధుర్యంతో అఖిల భారతావనిని, ప్రపంచంలోని తక్కిన దేశాలనూ అలరింపజేస్తున్న - సంగీత సామ్రాజ్ఞి లతామంగేష్కర్‌కి శివాజీ విశ్వ విద్యాలయం స్నాతకోత్సవాల సందర్భంగా నవంబరు 21 న 'డాక్టర్' పట్టప్రదానం జరిగింది.

వుంది అన్నది చూస్తారు వారు. కాని మన దేశంలో 22 క్యారెట్లకు వీసమెత్తు తగ్గినా ఏదో జరగరానిది జరిగిపోయినట్లు వుద్రేకపడడం జరుగుతున్నది.

మనకి ఏటా 50 నుంచి 60 టన్నుల దాకా బంగారం కావలసి వస్తోంది. కాని మన దేశంలోని కోలార్, హట్టిగనుల ద్వారా లభ్యమవుతున్న బంగారం కేవలం రెండు టన్నులు మాత్రమే!

అందుకే సంవత్సరానికి 40 టన్నుల బంగారం మన దేశంలోకి దొంగరవాణా చేయబడుతున్నట్లుగా అంచనా వేయబడుతోంది. గత సంవత్సరంలో 54 టన్నులు దొంగరవాణా చేయబడిందిట.

వ్యాపారస్తుల కథనం ప్రకారం 1,500 టన్నుల (అంటే సుమారు 13,500 కోట్ల రూపాయల) బంగారం గత 30 సంవత్సరాలలో మన దేశంలోకి దొంగరవాణా చేయబడింది. విశేషమేమంటే స్వాతంత్ర్యం రాక ముందు ఈ దొంగరవాణా మన దేశంలో లేనేలేదు!

ఈ పద్ధతిని రూపుమాపడానికే, ప్రభుత్వం రిజర్వ్‌బ్యాంక్ ద్వారా వేలం పాటతో బంగారం అమ్మకం జరిపింది.

ఈ బంగారం అంతా దొంగరవాణాలో పట్టుబడినది; పాకిస్థాన్, చైనా యుద్ధ సమయాలలో చందాల రూపంలో సేకరించిందీను. కాబట్టి వాటి అమ్మకం వల్ల ప్రభుత్వానికి వచ్చిన నష్టమేమీ లేదు. పైపెచ్చు 89.49 కోట్లు లాభం వచ్చిందిట కూడా.

అసలు ఏం చేసి వుండాల్సిందంటే-బంగారాన్ని చిన్న చిన్న ముక్కలుగా చేసి సామాన్య ప్రజానీకానికి నిర్ణీతగడువులో నేరుగా అమ్మకం చేసి వుంటే బాగుండేది. ఈ నల్లబజారు మధ్యవర్తులను దరి చేరనీయకుండా ఆ పని చేసి వుండవచ్చును. ఆ విధంగానే కొత్తగా వివాహమైనట్లు తగిన పత్రం చూపించగల నూతన వధువుకు రెండో మూడో కాసు[illegible] చొప్పున 'కంట్రోల్' ధరకి అమ్మకం [illegible]సి వుంటే - 'బంగారు జ్వరం' దేశాన్ని అంటు వ్యాధిలా సోకివుండేదికాదు.

బంగారాన్ని బట్టి కరెన్సీ విలువ_ఆ కరెన్సీ విలువను బట్టి ధరల పెరుగుదల ఆధారపడి వుంటాయి. బంగారాన్ని విరివిగా కొని దాచుకోవడమన్నది వృథా ఖర్చు. అందువల్ల బంగారానికి విలువ మరింత పెరిగి దాని వెల కూడా పెరుగుతున్నది. ఇక దాని మీద ఆధారపడి వున్న రూపాయి విలువ తగ్గడంతో నిత్యావసరవస్తువుల ధరలు పెరగక ఏం చేస్తాయి?

ఇక బంగారం మీద మోజు పోవాలంటే-తరతరాలుగా వస్తున్న అర్థం, పర్థం లేని సంప్రదాయాలను ఛేదించాలి. ప్రజల సాంఘిక, సాంస్కృతిక జీవనంలో మార్పు రావాలి.

మన వనితలకు బంగారు నగల మీద మోజు తగ్గినప్పుడు తప్ప ఈ వెలలు తగ్గవు. అంత వరకు బంగారం వెలలకి అడ్డుగోడ అంటూ వుండదు.

—ఖన్నీ

## కొన్ని విశేషాలు

☐ భారతదేశంలో దాచబడిన (ఆలయాల్లో, వ్యక్తుల వద్ద యితరత్రా) బంగారం 51 కోట్ల టన్నుల దాకా వుంటుందని అంచనా వేయబడుతోంది. వీటి విలువ 20,000 కోట్ల రూపాయల దాకా వుంటుంది.

☐ చరిత్ర ప్రారంభం నుంచి చూస్తే ప్రపంచం మొత్తం మీద యింత వరకు 82,000 టన్నుల బంగారం వుత్పత్తి చేయబడింది. ప్రస్తుతం సంవత్సరానికి 1,000 టన్నుల చొప్పున ఈ వుత్పత్తి పెరుగుతోంది.

☐ ప్రపంచంలో కల్లా అత్యధికంగా బంగారం వుత్పత్తి చేస్తున్న దేశం దక్షిణ ఆఫ్రికా. ద్వితీయ స్థానం సోవియట్ రష్యాకు చెందుతున్నది.

☐ మన దేశంలోని కోలార్ బంగారు గనులలో సంవత్సరానికి 3,000 కిలోల కన్న తక్కువ బంగారం వుత్పత్తి అవుతోంది.

☐ వ్యక్తుల ఆధీనంలో అధిక సంఖ్యలో బంగారం నిల్వలు గల దేశాలలో మనదేశం, ఫ్రాన్స్-ప్రముఖ స్థానం వహిస్తున్నాయి.

☐ తిరుపతి దేవస్థానంలో బంగారం-నగల రూపంలో ఒక టన్ను పైబడి, ముడి బంగారం 6 క్వింటాలులు వున్నాయి.

☐ ప్రపంచంలో కల్లా పెద్ద బంగారం మార్కెటు లండన్‌లో వుంది. జ్యూరిచ్‌లోని మార్కెటు ద్వితీయ స్థానం వహిస్తున్నది.

☐ ప్రపంచంలో కల్లా అత్యధికంగా బంగారు నిల్వలు వున్న బ్యాంకు-అమెరికాలోని ఫెడరల్ రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ న్యూయార్క్.

# మీ అందమైన శిరోజాలు పేలు మరియు ఈళ్ళకు గృహమా?

## శక్తివంతమైన, ఆల్కహాలులేని, ఆయుర్వేదిక్ పేల నివారిణి ఇక్కడ వుంది.

మీ తల ఎక్కువగా దురదగా వుండటానికి కారణం మీరు ఇప్పటికి గమనించే వుంటారు - పేలు మరియు ఈళ్ళు.

చాల విచారం. ఇవన్ని మీ మాడపై చేరియుండుట వలన, అనారోగ్యం, దురద, అసహ్యం గల్గుతుంది. ఇప్పుడు మా వద్ద సత్వరమైన, శక్తివంతమైన, ఎక్కువ కాలం అట్టే యుండు సువాసనగల తైలము లైసిల్ వుంది. లైసిల్ నందు ప్రత్యేకంగా ఆల్కహాలు లేనందువలన ఇతర పేల సంహారిణుల వలే ఆవిరి కాదు. మీ మాడపై నుండే తేమను, అత్యవసరమైన చమురును ఆరనివ్వదు. అందువల్లే లైసిల్ చుండ్రు పట్టకుండా చేస్తుంది. మీ శిరోజములను మృదువుగా మరియు పేలులేకుండా వుంచుతుంది, పొడిగా, బిగుతుగా వుంచదు.

రాత్రిపూట కావలసినంత లైసిల్ తీసుకొని తలపై వేసి రుద్దండి. ఉదయాన్నే దువ్వెనతో పేలను, ఈళ్ళను దువ్వివారేయండి. మీ తలకు తాజా నిమ్మరసం, షాంపూ పట్టించి తలంటు కొండి. అద్భుత కార్యాల ద్వారా నయమయ్యే వాటిని మీరు నమ్మరా? అయితే మమ్ములను నమ్మండి. లక్షలమంది స్త్రీలు వాడారు. గుర్తుంచుకొండి. లైసిల్ చాలా పొదుపైనది కూడా. శుభ్రమైన, ఆరోగ్యమైన శిరోజములకు ఖర్చుపెట్టేది తక్కువే.

సుజానిల్స్

# లైసిల్

## సుగంధిత పేల సంహారిణి

డా. మిత్రా ఏమంటారంటే "లైసిల్ అద్భుతమైన నివారిణి. ఇందులో ఆల్కహాలు లేదు గాన మీ మాడ మరియు జుట్టు పొడిగా వుంచదు. ఇది చుండ్రు చేర నివ్వదు. జుట్టును శుభ్రంగా మరియు ఆరోగ్యవంతంగా వుంచుతుంది."







సుజానిల్
కెమో ఇండస్ట్రీస్
గణేశ్ నగర్, చించ్‌వాడ్, పూనా-33

Expresso/SCI/78 TEL

# ప్రాచీన అలంకరణ

మనం ఉపయోగిస్తున్న ఆభరణాలూ, దుస్తుల శైలీ, శిరోజాలంకరణ శైలీ – ఇవన్నీ ఇప్పటికి అధునికంగా కనిపిస్తున్నా – వీటికి పునాదులు ఎప్పుడో పడ్డాయి. తొలి రోజుల్లో ఈ ఆభరణాలు, శిరోజాలంకరణలకు పూర్వీకులు ఇచ్చిన ప్రాముఖ్యత, వాటి కోసం వారు చూపిన శ్రద్ధ–తలచుకున్నప్పుడు ఎంతో ఆశ్చర్యంగా వుంటుంది. ఆ కాలంలో వారు ఆచరించిన సౌందర్య విధానాలు ఎలాంటివో చెప్పాలన్న ఉద్దేశంతో ఈ 'కొత్త శీర్షిక'ను ఆరంభిస్తున్నాము.

ఇక్కడ కనిపిస్తున్న చిత్రం - అజంతా గుహ (i) లోది. (రాణి యశోధర) క్రీస్తుశకం 3 నుంచి 7వ శతాబ్ది మధ్యకాలంలో వున్న నాగరికత



ఎలాంటిదో ఈ చిత్రం చెబుతుంది. అప్పటి స్త్రీలు ఆకర్షణీయంగా కనిపించడానికి, ఎలా అలంకరించుకునే వారో – అలంకరణలో ఎలాటి శ్రద్ధ చూపేవారో – సులభంగా గ్రహించవచ్చు. చిత్రంలో మహారాణి ధరించిన ఆభరణాలనే, విడిగా పెద్ద బొమ్మలుగా చూడవచ్చు. చేతులకు కంకణాలు, వేళ్ళకు ఉంగరాలు, కంఠ హారాలూ, కర్ణాభరణాలూ మొదలైనవి అప్పట్లో—యిలా వుండేవి.

చిత్రం: శ్రీమతి ఉదయగిరి

# సమస్యలూ-సలహాలూ

నిర్వహణ : కమలా వసంతకుమార్

యమ్. కె.

నాకింకా వివాహం కాలేదు. నా వయసు 24 సంవత్సరాలు. చిన్నప్పట్నుంచీ నేను పిరికిదాన్ని. ఏ పనిచెయ్యాలన్నా భయం. దానికి తోడు అమ్మ, నాన్న ప్రతి విషయానికీ నన్ను కొడుతూనే వుండేవారు. అలాగే పి. యు. సి వరకూ చదువుకున్నాను. ఇంకా చదవాలని నాకున్నా, మా వాళ్ళు నన్ను చదివించలేదు. అక్కడి నుంచి నాకేదో బాధ మొదలైంది. వ్యాపకం లేదు. ఓసారి, ఏదో ఎవరికో ప్రమాదం జరిగినట్టు విన్నాను. అప్పట్నుంచీ మా యింట్లో వాళ్ళకి కూడా ఏదైనా ప్రమాదం జరుగుతుందా ! అని నా భయం. లోపల్లోపల వాళ్ళ మీద వున్న కోపం చేత, వాళ్ళకి ప్రమాదం జరగాలి, అని అనిపిస్తుంది. అంతలోనే జరగకూడదు అనుకుంటాను. ఏదో పిచ్చి ఆలోచన ! మా యింటి పక్కనే గుడి వుంది. గుడికి వెళ్ళి దైవప్రార్థన చేస్తున్న సమయంలో కూడా "మా వాళ్ళకి ప్రమాదం జరగాలి" అనుకుంటాను. అంతలోనే "వద్దు" అనుకుంటాను. నా వూహలు బయటకు కనిపిస్తాయో, ఏమోగాని, నన్ను చూసిన వాళ్ళు నవ్వుకుంటారు. నాకేదో పిచ్చెత్తినట్టుగా వుంటుంది. ఎంత వద్దనుకున్నా ఆలోచనలు నన్ను వదలకుండా వున్నాయి. నాకెందుకిలాంటి ఆలోచనలు వస్తున్నాయి ? వాటిని నేను ఎలా మానుకోగలను ?

మీ సమస్య, ఒక రకమైన అనాలోచిత శత్రుత్వం. మీ తలిదండ్రులు మిమ్మల్ని ప్రతి విషయానికీ కొట్టేవారనీ, మిమ్మల్ని చదివించలేదనీ ఇంట్లో తీరిగ్గా కూచోపెట్టారనీ మీరు లోలోపల వాళ్ళమీద శత్రుత్వాన్ని పెంచుకున్నారు. ఆ విషయాన్ని మీరు ధైర్యంగా ప్రకటించలేక, వాళ్ళమీద వున్న మమకారంతో – అంతలోనే 'వాళ్ళకేమీ ప్రమాదం జరగకూడదు' అని అనుకుంటున్నారు. ఒకరకంగా మీరు శత్రుత్వాన్ని, అంతలోనే వారి క్షేమాన్నీ కోరుకుంటున్నారు. ఇదొక రకమైన మానసిన క్షోభ. ఈ క్షోభ మీకు తెలుసు కాబట్టి - ఆ బాధతో అల్లాడిపోతున్నారు. ఏమైనా – ఆ విషయాన్ని మీరు ఇలాగైనా బయటికి చెప్పుకో గలగడం మంచి సూచన. అయితే, మీ తలిదండ్రుల్ని మీరు అర్థం చేసుకోడంలో వుంటుంది. మీ తలిదండ్రులు మీ పిరికితనం వదుల్తుందేమోనని, చిన్నతనంలో దూషించేవారేమోగాని, మీ మీద శత్రుత్వం వుండి కాదు. మీరు వాళ్ళని సవ్యంగా అర్థం చేసుకోండి. మిమ్మల్ని కూడా పూర్తిగా వాళ్ళు అర్థం చేసుకునేలా ప్రవర్తించండి. తలిదండ్రులు ఇద్దరికీ కాకపోయినా, ఒకరికైనా మీ వాంఛ తెలియజేయండి. మీకు పెళ్ళి ప్రయత్నాలైనా చేస్తారు; మిమ్మల్ని ఏదైనా వ్యాపకంలోనైనా పెడతారు. అంతేగాని, మీ సమస్యను అనవసరంగా పెంచుకోకండి !

యమ్. ఎస్.

"అంగవిహీనులకు కృత్రిమ అంగాలు అమర్చే సదుపాయం మద్రాసులో వుంది. ఐదారు వందల రూపాయల ఖర్చుతో చెయ్యబడే ఈ కృత్రిమ అంగాలను లాంఛన ప్రాయంగా పాతికరూపాయలు మాత్రమే పుచ్చుకుని, పేదవారికి అమర్చుతున్నారు" అని లోగడ 'వనిత'లో చదివాను. మా ఫ్యాక్టరీలో పనిచేసే ఒక అబ్బాయికి ప్రమాదం జరిగింది. దాంతో అతని చెయ్యి తీసివేశారు. అతను మానసికంగా చాలా బాధపడతున్నాడు. అతనికి కృత్రిమ అంగం అమర్చే అవకాశం వుంటే, ఎవర్ని సంప్రతించాలి ?

మద్రాసులో 'ఆర్టిఫిషియల్ లింబ్ సెంటర్' అని వుంది. అక్కడ కృత్రిమ అంగాలను అతుకుతారు. అలాంటిది ఆంధ్రప్రదేశ్‌లో కూడా వుండే వుంటుంది. హైద్రాబాదులోనో, విశాఖపట్నంలోనో వుండొచ్చు. మీరు అక్కడి పెద్ద ఆసుపత్రుల్లో ఓసారి సంప్రతించండి. ఆ అబ్బాయిని బాధపడవద్దనీ, కృత్రిమ అంగం తేలిగ్గా అమర్చవచ్చనీ మానసికంగా కృంగిపోవద్దనీ ధైర్యం చెప్పండి.

యమ్. యమ్. యమ్.

నా వయసు ఇరవై రెండు సంవత్సరాలు. ఉద్యోగం చేస్తున్నాను. ఈ మధ్యనే నాకు వివాహం జరిగింది. కాని, భర్తకి ఉద్యోగం లేదు. ఉద్యోగంలేని వ్యక్తిని నేను పెళ్ళిచేసుకోడం మా యింట ఎవరికీ ఇష్టం లేదు. అయితే ఆయన ప్రవర్తన, మాట తీరూ నాకు నచ్చి వివాహం చేసుకున్నాను. అయితే, మొదటిరాత్రే అతని ప్రవర్తన వింతగా తోచింది. తను ఇదివరలో ఒక ఆమెను ప్రేమించినట్టు, ఆమె తనకంటె వయసులో పెద్దదైనట్టూ, ఆమెకు భర్త, పిల్లలూ వున్నట్టూ చెప్పారు. దాంతో నాకు అతని మీద అసహ్యం కలిగింది. కాని, రానురాను అతను నామీద చూపే ప్రేమవల్ల, అసహ్యతను తగ్గించుకొని, అభిమానాన్ని పెంపొందించుకోగలిగాను. కాని, మళ్ళీ కొన్ని రోజుల తర్వాత — తనకు ఆ ఒక్క ఆమెతోనే సంబంధం కాదని, చాలా మంది స్త్రీలతో సంబంధం వుండేదనీ, కొందరైతే తనను ఎంతగానో ప్రేమించారనీ చెప్పారు. అయినా, "నా సర్వస్వం ఇప్పుడు నీవే" అన్నారు. ఆ మాటలు నేను నమ్మలేకపోతున్నాను. ఆయన నన్ను దగ్గరగా తీసుకున్నా, ప్రేమగా మాట్లాడినా వాళ్ళెవరితోనో ప్రవర్తిస్తున్నట్లుగానే నాకు అనిపించి, తీవ్రమైన అయిష్టతను చూపిస్తున్నాను. ఒక్కోసారి ఆయన మీద నాకు విపరీతమైన ప్రేమ కలుగుతుంది; అంతలోనే ఆయన మాటలు గుర్తొచ్చి, ద్వేషం కలుగుతుంది. దాంతో ఆయన మీద కసి తీర్చుకోవాలనిపిస్తోంది. నేను కూడా వేరే వాళ్ళతో అక్రమ సంబంధం పెట్టుకోవాలని, అది చూసి ఆయన బాధపడాలనీ

# ఆదాచేసి ఆదాయం పొందండి!

# మీకు నచ్చే పథకములు

మంచి వడ్డీ,
బహుమతులు
పొందే అవకాశం.

ఉచిత
బహుమతులు
పొందే అవకాశం.

నేడే మీ సమీపములో గల బ్రాంచీలందు
సంప్రదించండి!




## ఆంధ్రప్రదేశ్ సేవింగ్ & ఫైనాన్సు

రాజమండ్రి - 533101.

ఫోన్: 4411. పి.బి.నెం. 47. గ్రాము: సేవింగ్.

రీజినల్ ఆఫీసులు:- స్టేషన్ రోడ్, నాంపల్లి. హైదరాబాద్.
రాఘవయ్య పార్కు ఎదురుగా. విజయవాడ.

బ్రాంచీలు:-
కడప, కర్నూలు, అనంతపురం, ఖమ్మం, కాకినాడ, ఫాలకొల్లు
భీమవరం, కొత్తగూడెం, నల్లగొండ, కేసవరం, అనకాపల్లి, ఆదోని, రాజంపేట,
విజయవాడ, సికింద్రాబాద్, కోయిలకుంట్ల, మండపేట. నూజివీడు,
గుంటూరు. తిరుపతి, పెద్దాపురం. గిద్దలూరు, నందలూరు, మదనపల్లి,
ధర్మవరం, ఏలూరు, కొయ్యలగూడెం, చిత్తూరు, బూర్గంపాడు.



ANU

## దండు విజయలక్ష్మి



**శ్రమ తీరికవేళలను వృధా చెయ్యకుండా, ఆ సమయాలలో ఏ ఎంబ్రాయిడరీ వర్కో, ప్లాస్టిక్ వైర్ల అల్లికలో-లేదా రకరకాల (పూసలు వగైరాలతో) బొమ్మల తయారీలో, యింకా ఓపిక వుంటే పెయింటింగు మొదలైన లలితకళల సాధనలో చేస్తూంటే-అటు చదువు, ఇంటిపన్లతోపాటు యిటు చక్కని అందమైన చేతిపనుల తయారీలో మంచి**



ప్రావీణ్యమూ సంపాయించి, నలుగురి మెప్పూ పొందుతారు.

ఆ కోవకు చెందినదే కుమారి దండు విజయలక్ష్మి. గత సంవత్సరం బి. కాం. పరీక్షలో ఉత్తీర్ణురాలైన విజయలక్ష్మికి చిన్నప్పటినుండి స్కిప్పింగు, ఖో-ఖో, కేరమ్సు, రింగుటెన్నీసు, చదరంగం మొదలైన ఆటలలో కూడా మంచి పేర్పు ఉంది. తాను చదువుకున్న భారతీయ విద్యా కేంద్రం అనుబంధ సంస్థలో వరసగా నాలుగు సంవత్సరాలు 'ఆల్‌రౌండ్ ఛాంపియన్ షిప్' సంపాయించింది. 1965 నుంచి చేతి వస్తువుల తయారీ మొదలు పెట్టి రకరకాల క్రోషియో, క్రాస్-స్టిచ్, ఎంబ్రాయిడరీ వర్కులతో పాటు ప్లాస్టిక్ వైరు, జనపనార (జూట్) లతో చేసిన చేతి సంచుల అల్లికలు, స్వెట్టర్ల అల్లికలు, టాట్టింగ్ వర్కు మొదలైన అన్ని కళలలోను ప్రావీణ్యం సంపాయించి, గదులలో అందంగా అమర్చుకొవేందుకు ముచ్చట అయిన బొమ్మలనీ, వస్తువుల్నీ తయారు చేసింది. ఆమెకు అది హాబీ

ఇక్కడ కనిపిస్తున్న ఫోటోలోని వస్తువులన్నీ ఆమె చేసినవే.

మట్టి పాత్రపై ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌తో తయారు చేసిన ఫ్లవర్‌వాజ్, అందులో అమర్చిన రంగు కాగితాల ముద్ద మందార పువ్వులు; గాజు కూజా మీద పెయింటింగ్ చేయబడిన టేబిల్ లైటూ, దానికి అమర్చిన ప్లాస్టిక్ గుడ్డ డోమూ; కొలాస్ పెయింటింగ్ అనే పేరుతో వ్యవహరింపబడే కట్-ఔట్ డాల్స్‌లో ఒక జపాన్ వనిత; మేటీ క్లాత్ మీద 'ఏంకర్' దారాలతో కుట్టి, గోడకు తగిలించుకునే క్రాస్-స్టిచ్ డిజైనూ; ప్లాస్టిక్ వైరుతో తయారు చేసిన ఫ్లవర్‌వాజ్; రకరకాల స్టఫ్డ్ డాల్స్ (మణిపూర్ నాట్యకత్తె, హిందూ, పంజాబీ, క్రైస్తవ వధువులు, తంబురా మీటుతున్న భక్త మీరా, కేరళ వనిత, లంబాడీ వనిత) మొదలైనవెన్నో కనిపిస్తున్నాయి.

ఇటీవల విశాఖపట్నం సాంబమూర్తి కళా మందిర్‌లో జరిగిన ఆల్ ఇండియా మేజర్ స్పోర్ట్స్ ఆర్ట్స్ అండ్ క్రాఫ్ట్స్ పోటీ ప్రదర్శనలో విజయలక్ష్మి అల్లిన క్రాస్-స్టిచ్ సీనరీకి ప్రథమ బహుమతి లభించింది! ఫిలటలీ (స్టాంపుల సేకరణ), విదేశీ నాణేల కలక్షన్, శరత్ సాహిత్యం-అంటే ఆమెకు చాలా అభిమానం. ప్రస్తుతం వీణావాద్యం, ఆయిల్ పెయింటింగులు కూడా ఆమె నేర్చుకుంటున్నది. విశాఖపట్నం పోర్టుట్రస్టు డిప్యూటీ సెక్రటరీ డి. తిరుపతిరాజుగారి అమ్మాయి – విజయలక్ష్మి.

—విలేకరి

అనిపిస్తోంది. అంతలోనే భయంవేసి, అది ఎంతటి ఘోరానికి దారితీస్తుందోననీ, అలాంటి తప్పు ఎక్కడ చేస్తానో అని—తల్లడిల్లిపోతున్నాను. ఆఫీసులో వున్నా, ఇంట్లో వున్నా నాకు ప్రశాంతత వుండడం లేదు. అయినా, ఆయన మీద చిరాకు కనబరచకుండా వుండడానికి ఎంతగానో ప్రయత్నిస్తున్నాను. నా వేదన తొలగడానికి మీరిచ్చే సలహా ఏమిటి?

**మీ భర్త మిమ్మల్ని మోసం చేశారని, మీ తాత్పర్యం. మీ మీద ఎంతో ప్రేమ నటించి,** మిమ్మల్ని వివాహం చేసుకున్నాక - తన అక్రమ ప్రవర్తన గురించి చెప్పడం నిజానికి - మోసమే! అయితే, దానికి ప్రతీకారం తీర్చుకుంటానని మీరు భావించకూడదు! దానివల్ల నష్టపోయేది మీరే! జరిగిందేదో జరిగిపోయిందని నచ్చ జెప్పుకుని, మీ భర్తను క్షమించాననుకుని–ఆయన్ని ప్రేమిస్తూ గడపండి. మిమ్మల్ని ఆయన ప్రేమిస్తున్నట్టుగా చెబుతున్నారు కాబట్టి - ఆయన్ను కూడా పాత విషయాలను మరిచిపొమ్మనీ, ఆ విషయాలను మీ దగ్గర మళ్లీ ఎత్తవద్దనీ చెప్పండి. అంతేగాని, ఆయన మీద కసి తీర్చుకోడం కోసం వేరే వ్యక్తులతో సంబంధం పెట్టుకుంటాననడం - అవివేకం! వివాహానికి ముందు ఎందరో తప్పులు చేస్తారు. కొందరు చెబుతారు; కొందరు చెప్పరు. కొందరు వున్నా లేకపోయినా, గొప్ప కోసం చెప్పవచ్చు! ఆయన తన విషయాలు చెప్పారు కాబట్టి మీకు తెలిసింది. లేకపోతే, తెలియడానికి అవకాశం లేదు గదా! అంచేత, ఆయన మీకు చెప్పలేదనే అనుకోండి. అవన్నీ మరిచిపోయి, మీ జీవితాన్ని సుఖమయం చేసుకోండి.

# పెరటితోట పెంపకం



— లలితకుమారి

**ఎస్. మణి, విశాఖపట్నం**

మా యింటి డాబా మీద రావి చెట్టు మొలిచింది. ఎన్నిసార్లు కొట్టించినా మళ్ళీ మొండిగా వస్తున్నది. ఇంటి పునాదుల వరకు వేర్లు పాకిపోతున్నాయి. డాబా గోడలు బీడులు వేస్తున్నాయి. ఏం చెయ్యాలో తోచడం లేదు. రావి చెట్టు మళ్ళీ మొలవకుండా చెట్టు మొత్తం నశించిపోయేటట్లు ఏదైనా మందు వుంటే తెలియజేస్తారా?

ఇంటి డాబామీద రావి, మర్రి, వేపచెట్లు మొలవడమన్నది — పక్షులవల్ల జరుగుతుంది. పక్షులు తిన్న గింజలు రెట్టలోపడి మొక్కలు మొలుస్తాయి. ఈ మొక్కలు కొట్టించి ప్రయోజనం లేదు. అలా కొట్టించిన కొద్దీ వస్తూనే వుంటాయి. ఇది ఇంటికి చాలా ప్రమాదం కూడా. అయితే దీనికి మందు వుంది. ఇ. ఐ. డి. ప్యారీ కంపెనీ వారి 'ట్రీకిల్' (E. I. D. Parry's 'Tree kill') మందు వేసినట్లయితే ఈ చెట్టు మొదలంటా నశిస్తుంది. కాని ఈ మందు చాలా విషపూరితమైనది. ఈ మందు చేతితో తాకకుండా ఒక పుల్లకి దూది చుట్టి సీసాలోకి ఆ పుల్లని ముంచాలి. రావిచెట్టు మొదలు దగ్గర బెరడు కొంతమేర తియ్యాలి. అలా తీసిన చోట పుల్లతో ఆ మందు రాయాలి. ఇలా ఒకసారి చేస్తే చాలు రెండో రోజుకల్లా చెట్టు చచ్చి వూరుకుంటుంది. రెండుసార్లు పైన ఈ మందు రాయవలసిన అవసరమే వుండదు. మీకు దగ్గరలోగల హార్టికల్చరల్ సొసైటీ వారిని 'ట్రీకిల్' అని అడిగితే ఆ మందు యిస్తారు. అయితే, ఆ మందు పిల్లలకి అందకుండా భద్రపరచండి. చాలా విషం సుమండీ!

**ఎస్. మాలతి, రాజమండ్రి**

అతి తక్కువ ఖరీదులో, అతి త్వరగా పండే, పోషకాహారాలు గల కూర మొక్కలు ఏవో చెబుతారా?

గట్టి ప్రశ్నే వేశారే.... బెండ, తోట కూర.... తక్కువ ఆకు కూరలన్నీ కూడా త్వరగానే వస్తాయి. మరి వాటిల్లో పోషకాహారాలు కూడా చాలానే వున్నాయి కదా.

**బి. సుమలత, విరుగంబాక్కం**

బాల్కనీలో ఎక్కువ వ్యాపించకుండా కుండీలలో పెరిగే పూల మొక్కలు ఏవి?

బూగన్‌విలియా. ఇవి అయితే మీరు పెంచడానికి అనువుగా వుంటాయి. ఇవి ఎక్కువ స్థలమూ ఆక్రమించవు; నీరు తక్కువ, ఎండ ఎక్కువ కావాలి. కాబట్టి బాల్కనీలో పెంచడానికి బాగుంటాయి. వీటికి పువ్వులు కూడా విరివిగా పూస్తాయి. అందులో ఈ మొక్క కత్తిరించిన కొద్దీ పువ్వులు అధికంగా పూస్తాయి.

**వి. ఆర్. అరుణ, అత్తూరు**

సన్నజాజి మొక్క పందిరి లేకుండా పెంచవచ్చా?

జాజి, తీగజాతికి చెందినది. ఆసరా వుంటే అల్లుకునిపోయి బాగా పెరుగుతుంది. ఆసరా లేకపోతే కుప్పగా కూలిపోయి నశించిపోతుంది. మీకు పందిరి వేయడం యిష్టం లేకపోతే ఒక కర్ర పాతి ఆ కర్ర చుట్టూ సన్నజాజి అల్లుకునేలా పెంచవచ్చును.

**ఆర్. ఇందిర, కోరగుంటపల్లె**

సుకుమారి (టేబిల్ రోజ్) మొక్కలు ఇంట్లో వుండడం వల్ల క్షయ వ్యాధి వస్తుందని అందరూ చెబుతూ వుంటారు. అది ఎంతవరకు నిజమో తెలియజేస్తారా?

అవన్నీ పిట్ట కథలు. నమ్మకండి. అసలు ఈ మాట మీ దగ్గరే మొదటిసారిగా నేను వింటున్నాను. పోచికోలు కబుర్లు చెప్పే పనిలేని వాళ్ళు కల్పించినవి యివన్నీ. అనవసరంగా యిలాంటి నమ్మకాలు పెట్టుకుని కూర్చుంటే చివరికి మనసు నెమ్మది కోల్పోవడమే కాక లేనిపోని జబ్బులు కూడా వస్తాయి.

**ఎస్. అండాళ్, అడవికొలను**

మా ఇంట్లో జామచెట్టు ఒకటి వుంది. కాయలు కాస్తున్నాయి. కాని అవి పెద్దవైన తరువాత లోపల పుచ్చులు పడుతున్నాయి. పిందెగా వున్నప్పుడు బాగానే వుంటున్నాయి. దీనికి ఏం చెయ్యమంటారు?

అనేక కారణాలవల్ల కాయ లోపల పుచ్చు ఏర్పడుతుంది. ఈ పురుగుల్లో రకాలు కూడా చాలా వున్నాయి. పరిశీలనగా చూస్తే తప్ప ఏ మందు వాడాలో చెప్పడం కష్టం. కాబట్టి వ్యవసాయ శాఖ వారికి చూపండి. వారు తగిన మందు యిస్తారు.

**ఎస్. వర్ధని, పెనుగొండ**

మేము 'కనకాంబరం' మొక్కలు కుండీలలో పెంచుతున్నాము. వాటికి ఈ మధ్య పురుగుపట్టి పువ్వులు పూయడం లేదు. ఆకు అడుగున, ముందుగా తెల్లటి బూజులా వుంది. బి. హెచ్. సి. 50 చల్లాము. కాని ఆకు ఎర్రగా అయి తెల్లటి మచ్చలు ఆకు నిండా పరుచుకున్నాయి. చేమంతి అంటు కూడా ఈ తెగులుకు గురైంది. ఏ మందు వేయాలో చెబుతారా?

మీరు వాడిన మందు చాలా ఘాటైనది. అంతకంటె కాస్త ఘాటు తక్కువవి వాడితే మంచిది. 'అఫిస్' అనే మందు వాడి చూడండి.

**కె. ప్రమీల, గుంటూరు**

మా యింట్లో ఆరంజి, పసుపు, గులాబి మొక్కలు వున్నాయి. అవి కొన్నప్పుడు వాటికి పువ్వులు, మొగ్గలు వున్నాయి. ఆ మొగ్గలు మాత్రం పువ్వులు పూచాయి. అవి కొని రెండు సంవత్సరాలు అవుతోంది. మొక్కలు బాగా ఎదుగుతున్నాయి. కాని పువ్వులు మాత్రం పుయ్యడం లేదు. ఏం చేస్తే పువ్వులు పూస్తాయంటారు?

## అనుకుంటున్నాను

అంతులేని ఆకాశంలో
అందాలొలుకు తారకనై
అనంతంలో లీనమైపోవాలని....

అరుణాకాశంలో
ఆనందంతో విహరించే మేఘమాలికనై
స్వేచ్ఛా విహారం చేయాలని....

ప్రతుళ్ళిపడే కొండవాగునై
పర్వతసానువులను పలుకరించి
పరవళ్ళు ప్రతొక్కుతూ పయనించాలని....

పరిమళాలు వెదజల్లే పూదోటలో
ధవళ కాంతులీను బొండుమల్లెనై
విరియాలని, మేనుమరవాలని....

తారకనై, మేఘమాలికనై
కొండవాగునై, బొండుమల్లెనై
ప్రకృతిలో అంతర్లీనమైపోవాలని....అనుకున్నాను..
కానీ....
చీకటి బ్రతుకులు బ్రతుకుతూ
ఆకలితో అలమటించే అభాగ్యులను చూసినపుడు
వారి జీవితానికి కాంతినిచ్చే
మహాయజ్ఞంలో నేనూ ఒక సమిధనైపోవాలని
అనుకుంటున్నాను— —పి. విజయలక్ష్మి

## కూరలు-పోషక పదార్థాలు

### గోరుచిక్కుడు

చిక్కుడు పాదైతే, 'గోరుచిక్కుడు' మొక్క. ఇది దాదాపు అరడుగుల ఎత్తువరకు పెరుగు



తుంది. ఈ చెట్టు కొమ్మలు రెమ్మలుగా విస్తరిల్లు తాయి. ఈ రెమ్మలనుండి గెలలు వచ్చి కాయలు కాస్తాయి. ఒక్కొక్క గుత్తికి పది-పన్నెండు కాయల దాకా వుంటాయి. వీటిలో. ముదిరిన కాయల్ని సులభంగా పోల్చుకోవచ్చును. అవి ఉబ్బి గోధుమ రంగులో వుంటాయి.

ప్రతి 100 గ్రాముల గోరు చిక్కుడులోనూ-82.5 గ్రాముల తేమ, 3.7 గ్రా॥ ప్రొటీన్లు, 0.2 గ్రా॥ కొవ్వుపదార్థం, 1.4 గ్రా॥ ఖనిజ పదార్థం, 2.3 గ్రా॥ నార, 9.9 గ్రా॥ పిండి పదార్థం, 0.13 గ్రా॥ కాల్షియం, 0.05 గ్రా॥ భాస్వరం, 5.8 గ్రా॥ ఇనుము, 330 యూనిట్ల విటమిన్ ఏ, 0.08 మిల్లిగ్రాముల విటమిన్ బి, 0.5 మి.గ్రా. నికోటినిక్ ఆమ్లము, 0.06 మి.గ్రా. రిబోఫ్లోవిన్, 49 మి.గ్రా. విటమిన్ 'సి' వుంటాయి. వీటి కెలోరీ విలువ-56.

గోరుచిక్కుడు సన్నగా ముక్కలు చేసి వుడకబెట్టి పులుసుతో తాలింపుకూర చేసుకోవచ్చు. దీనికి వుల్లిపాయముక్కలు, మిరపపొడి, వేరుసెనగ పప్పు కలిపి వేపుడుకూర చేసుకుంటే రుచిగా వుంటుంది. గోరుచిక్కుడు కొందరు బెల్లంతో కూడా వండుకుంటారు. నువ్వుపిండి, సెనగపిండితో పారోశిలా చేసుకుని తిన్నా-ఎంతో రుచికరంగా వుంటుంది.

అయితే గోరుచిక్కుడుకు అజీర్ణం చేసే లక్షణం వుంది. వాతం కూడా చేస్తుంది. కఫాన్ని పెంచుతుంది. ముదురుకాయలోని గింజలు పిత్తాన్ని అధికం చేస్తాయి. అసలు ముదురుకాయలు కూరకి పనికి రావు.

అయితే, గోరుచిక్కుడు చలవ చేస్తుందనీ, ఆకుకూర రేచీకటిని హరిస్తుందనీ ఆయుర్వేద వైద్యులు చెబుతారు.

ఆ మొక్కలకి సరైన ఎరువు పడలేదు. ఆహారం సరిగ్గా పడకపోతే అవి మాత్రం ఏం చేస్తాయి చెప్పండి? అందుకే పువ్వులు రాలేదు. బాగా మగ్గిన పశుపెంట, చెత్త ఎరువు, దుమ్ములపొడి వేసి చూడండి. మొక్కలు కళకళలాడే చక్కని పువ్వులు పూస్తాయి.

**సి. హెచ్. జయలక్ష్మి, రూర్కెలా**

మా యింట్లో ఒక బత్తాయి పళ్ళ చెట్టు వుంది. అది బాగా కాపుకి వచ్చింది. కాని రోజూ నాలు గైదు పళ్లు రాలిపోతున్నాయి. ఇలా పూర్తిగా పండకుండా రాలిపోవడానికి కారణం ఏమిటి? దీనిని అరికట్టడానికి వుపాయం సెలవిస్తారా? బత్తాయి పళ్ళు పులుపు పోయి తీపి రావాలంటే ఏం చెయ్యాలి?

పళ్ళు అలా రాలిపోతున్నాయని కంగారు పడకండి. మొదటి విడత కాపు అయితే అలాగే రాలిపోతాయి. ఆ తరువాత కాసేవన్నీ చక్కగా కాస్తాయి. అపుడు కూడా అలాగే రాలిపోతే మాత్రం వ్యవసాయశాఖ వారిని సంప్రతించండి. ఇక పులుపు, తీపి, వగరు యిలాంటివన్నీ ఆయా చెట్ల సహజ గుణాలు. వాటిని మార్చడం అన్నది ఆ బ్రహ్మకైనా సాధ్యంకాదు. □

"... ఆయన ఫేమిలీతో వస్తాడనుకుంటు న్నావా? రాడు....చూస్తూండు. ఒక్కడూ వస్తాడు. అప్పటికి డబ్బివ్వలేకపోతే యింటి పరువుని వీధిలోకీడ్చటానికికూడా సందేహించడు. నిన్నా స్థితిలో చూశాక కూడా అలాంటి మాటలన గలిగాడంటే....అంతకన్న కిరాతకుడు మరెవరూ ఉండడు వదినా!"

"అలాంటి మాటలనకు నిర్మలా! మనం అసహ్యించుకొని ఎవర్నీ మార్చలేము. మంచి ఉద్దేశ్యంతో మన ప్రయత్నం మనం చేద్దాం. ఆ తర్వాత మన ప్రాప్తం. అంతే!...."

ఆ సాయింత్రం రాఘవరావు వచ్చాడు. లాయరుతో మాట్లాడి కృష్ణారావు వాటాకి ఎంత వస్తుందో లెక్క కట్టించమని కోరింది కృష్ణవేణి.

"అలాగేనమ్మా! నువ్వేం దిగులు పడకు. డబ్బు కూడా నే నేర్పాటు చేస్తాను...." అన్నా డతను.

"అబ్బే. అదేం వద్దండి. డబ్బు సంగతి నేను చూసుకుంటాను." అంది కృష్ణవేణి తడ బడుతూ. ముందే తన తమ్ముడ్ని కొంత డబ్బు అప్పు యిప్పించగలడేమోనని అడిగింది. తన దగ్గర బ్యాంకులో రెండు వేలున్నాయని–ఇస్తానని అన్నాడతను. నెల వాయిదాలలో తిరిగి యిచ్చేస్తా నని ఈ సంగతి ఎవరికీ తెలియకుండా తనకీ సాయం చేయమని కోరింది. అతనందుకు ఒప్పు కున్నాడు. తక్కిన డబ్బుకి మళ్ళీ యింటి మీద అప్పు చేయటానికే నిర్ణయించుకుంది కృష్ణవేణి. అందుకనే రాఘవరావుతో అలాగంది.

కాని, మాధవినడిగి ముందే సంగతి తెల్సు కున్నాడతను. అందుకనే, "....నాకు నువ్వొకటి మాధవి ఒకటీ కాదమ్మా! కూతురి కవసరం వచ్చినప్పుడు సాయపడకుండా ఏ తండ్రి ఉండ గలడు?" అన్నాడు.

"మరొకలా అనుకోకండి బాబయ్యగారూ! అంత అవసరం వస్తే నా అంతట నేనే అడుగు తాను" అంది ఆమె తల దించుకుంటూ.

రాఘవరావుకి మనస్సు చివుక్కుమంది. "పోనీ. నా దగ్గర అప్పుగానే తీసుకోమ్మా!" అన్నాడు.

ఎర్రబడిన ఆయన ముఖాన్ని. చిన్నబోయిన మాధవి ముఖాన్ని చూసి చటుక్కున తల త్రిప్పు కుంది కృష్ణవేణి. ఆయన దగ్గర డబ్బు తీసుకొని ప్రస్తుతానికీ కష్టం గడిపి గట్టెక్కవచ్చు. తర్వాత డబ్బు యిస్తానంటే ఆయన పుచ్చుకుంటారో లేదో! అసలు ఈ పరిస్థితుల్లో తాను తీర్చనే లేక పోవచ్చు. అదీకాక....ఇంత సుళువుగా తానీ సమస్యని పరిష్కరించుకుందని తెలిస్తే భర్త మరింత నిమ్మకు నీరెత్తినట్టుంటాడు. ఇంటి పరిస్థితి యింకా క్లిష్టమయిందని అతనికి అర్థం కావాలంటే తానీ డబ్బు తీసుకోకూడదు....ఇంత ఆలోచించి "....నన్ను క్షమించండి. మిమ్మల్ని నొప్పించాలని నా ఉద్దేశ్యం కాదు. అవసరం లేకనే వద్దంటున్నాను" అంది కృష్ణవేణి.

ఆమె డబ్బు తీసుకోకూడదని నిర్ణయించు కుందని అర్థం చేసుకున్నాడు రాఘవరావు. "పోనీ లేమ్మా! అత్యవసరం వచ్చినప్పుడయినా నీ తండ్రి లాంటి వాడిని ఇక్కడున్నానని గుర్తుంచుకుంటే అది చాలు నాకు...." అని వెళ్ళిపోయాడు.

మాధవి ముఖం ముడుచుకోవటం చూసి తన దగ్గరికి పిలిచింది కృష్ణవేణి. "....నా మీద కోపం వచ్చిందా?" అని నవ్వు తెచ్చుకొని అడిగింది.

మాధవి మాట్లాడలేను.

సశేష నవల




విమలారామం

"సాధ్యమయినంతవరకు ఎవరి బరువు బాధ్య తలు వాళ్ళే మోయాలి. ఆయన్ని యిబ్బంది పెట్టటం నాకిష్టం లేదు."

"నాన్నగారిబ్బంది పడి యివ్వటం లేదు. అప్పుగానే తీసుకోమంటున్నారు కదా!"

కృష్ణవేణి చూపులు తప్పించుకుంది. "నేనెంతో దూరం ఆలోచించి అలాగన్నాను. నన్నపార్థం చేసుకోకు మాధవీ!"

అక్కగారి గొంతులోని ఉద్వేగానికి చకితురాలైంది మాధవి. "అది కాదక్కా! నీ బాధ్యత కొంత నేనూ పంచుకుందామని...."

తన కన్నీళ్ళు ఆమెకు కనపడకుండా చటు క్కున ఆమెను తన గుండెలకి హత్తుకుంది కృష్ణవేణి. "....ఇప్పుడు నువ్వెంత బరువు మోస్తున్నావో నీకు తెలియనే తెలియదు పిచ్చి దానా!" అని గొణిగింది.

"ఇంటి కోడళ్ళు భోజనాలకి రావచ్చు. వంటయింది...." అంటూ నిర్మల వచ్చింది.

"అయ్యో. నా మతి పాడుగాను...నువ్వొక్క దానివీ వంటింట్లో ఉన్నావని మర్చేపోయాను." అంది మాధవి నొచ్చుకుంటూ.

"మరేం భయంలేదు. సగం వంట మీ శ్రీవారే చేసారు."

అవునవునంటూ గరిటె చేతబట్టుకొని వచ్చాడు మురళీమోహన్.

నిర్మల మాటలతో ఆ వాతావరణం ఆహ్లాద కరంగా మారిపోయింది.

## 41

'డబ్బు సిద్ధంగా వుంది. మీరు రావచ్చు. వచ్చే టప్పుడు కుటుంబాన్నంతా తీసుకురండి. మీ అమ్మ గారు, నాన్నగారు మరీ మరీ రమ్మని వ్రాయ మన్నారు. గతాన్నంతా మర్చిపోయి తప్పకుండా అంతా కల్సి రండి. ఆత్రుతగా ఎదురు చూస్తు న్నాము....' అంటూ ఎంతో ఆప్యాయంగా స్వయంగా ఉత్తరం వ్రాసింది కృష్ణవేణి.

కాని, కరగని గుండెతో తానొక్కడే వచ్చాడు కృష్ణారావు.

"నేను చెప్పలేదా వదినా! రాళ్ళు కరగవు" అంది నిర్మల.

కృష్ణవేణి ఎంతో నిరుత్సాహపడిపోయింది. ఇక తాను చేయగల్గిందేమీ లేదని నిరాశచేసుకొని డబ్బు పట్టుకువచ్చి అతని ముందు పెట్టింది.

"డబ్బలా తీసుకోటానికి వీల్లేదు. తనవాటా

వదులుకున్నట్టు దస్తావేజు వ్రాసివ్వమనండి!'' అంది సుభద్రమ్మ.

''నాకేం అభ్యంతరం లేదు.'' అన్నాడు కృష్ణారావు.

''ఇదివరకూ వదినే దబ్బిచ్చింది. ఇప్పుడూ వదినే యిస్తోంది. న్యాయంగా ఈ యిల్లు వదినది. మనమంతా యిల్లు వదినపేర వ్రాసివ్వటం ధర్మం!'' అన్నాడు మురళీమోహన్.

''ఛ! అదేంమాట మురళీ! మామగారి పేరనే ఉండాలి.'' అంది కృష్ణవేణి కంగారుగా.

''లేదమ్మా! వాడు చెప్పిందే న్యాయం. అడుగడుగునా ఈ యింటి పరువు కాపాడుకుంటూ వస్తున్నావు. ఇది నీ పేరనే ఉండాలి.'' అన్నాడు సత్యనారాయణగారు.

''అంతేకాదు. మళ్ళీమళ్ళీ ఎవరికీ పాడు బుద్ధులు పుట్టకుండా పకడ్బందీగా దస్తావేజు వ్రాయించండి. కొడుకు యింట్లో ఉన్నాననుకునే కన్న కోడలి యింట్లో ఉన్నానని చెప్పుకోవటమే నాకు ప్రాణానికి హాయిగా ఉంటుంది!'' అంది సుభద్రమ్మ.

''అయ్యో! యేం మాటలివి అత్తయ్యా!'' అంది కృష్ణవేణి ఎంతో సిగ్గుపడిపోతూ.

''లేదమ్మా! నేను మనస్ఫూర్తిగానే అంటున్నాను... ఇన్నాళ్ళూ కొడుకు దూరమయ్యాడనే బాధుండేది. ఇప్పుడది లేదు. ఒక మంచి మనిషి నా యింటి కోడలుగా నా కళ్ళ ముందున్న తృప్తి ఉంది. సంతోషముంది. ఈ జీవితానికి ఇది చాలు!....''

కృష్ణారావుని అంతా అసహ్యించుకున్నారు. కాని, అతన్ని మార్చలేకపోయినందుకు ఎంతో నొచ్చుకుంది కృష్ణవేణి.

ఆమె మారుద్దామనుకున్న మనిషి మారకుండా వెళ్ళిపోయాడు కాని, ఇప్పట్లో మారడనుకున్న మామగారు హఠాత్తుగా మారిపోయాడు!

యధావిధిగా ఆ వారం తండ్రికి లాటరీ టిక్కెట్లు కొనటానికి వెళ్ళేముందు డ్రాతేదీ అయిపోయినవి యిమ్మని అడిగింది నిర్మల.

కూతురివైపు పరీక్షగా చూసి తన మంచం మీద తలగడయెత్తి చిన్న పుస్తకం బయటకు తీసాడాయన. పేజీలు త్రిప్పి కూతురికి చూపిస్తూ ''....చూడమ్మా! ఇన్నేళ్ళల్లో ఎన్ని టిక్కెట్లు కొన్నానో! ఇప్పటికెన్ని వందలు తగలబెట్టానో! ఒక్కసారంటే ఒక్కసారి వందయినా తగిలిందా? లేదు...మీ పెద్దన్నయ్య దబ్బడిగాడని తిట్టిపోసాను. నేనుమాత్రం చేసిందేమిటి?........దబ్బు దబ్బని మీ వదిన ప్రాణాలు తోడుకు త్రాగలేదూ! మీ సంపాదన బుగ్గిపాలు చేయలేదూ?''

నిర్మల ఆశ్చర్యంగా చూస్తుండగా ఆవేశంగా ఆ పుస్తకంలోని పేజీలని, లాటరీ టిక్కెట్లనీ ముక్కలు ముక్కలుగా చింపేసాడు.



అందరికన్నా ముఖ్యంగా మారవల్సిన మనిషి విశ్వనాధం. నిజంగా ఆ వ్యవధిలో అతను కూడా మారిపోయాడనే అనుకుంది కృష్ణవేణి. ఆమెకు దెబ్బతగిలిన తర్వాత పెందరాళే యింటికి రావటం ప్రారంభించాడు. ఆ తర్వాత నెల జీతంలో ఎక్కువ భాగం చేతుల్లోపెట్టాడు. తన కష్టాలిక గట్టెక్కినట్టేనని సంబరపడింది ఆమె.

ఆ సంతోషంలో శ్రీకాంత్‌కి ఓ వంద రూపాయిలు మొదటి నెల వాయిదాగా పంపేసింది. అది జరిగి వారమయిందో లేదో 'నేను మారలేదు' అంటున్నట్టు ఓ రోజు ప్రొద్దున్న మళ్ళీ డబ్బంటూ కూర్చున్నాడు విశ్వనాధం.

కొద్ది రోజులుగా ఆమె పెంచుకున్న ఆశలన్నీ లిప్తకాలంలో పటాపంచలయిపోయాయి. అప్పటికీ గుండె రాయి చేసుకొని "చేసిన అప్పులు కొన్ని తీర్చాను. ఇప్పుడు నా దగ్గరేమీ లేదు." అంది.

"అంత వెనకా ముందూ చూసుకోకుండా అప్పులెలా తీర్చావు?" అన్నాడు విశ్వనాధం.

ఆమె నిర్ఘాంతపోయింది. 'అప్పులెలా చేసావు అనటంపోయి–అప్పులెలా తీర్చావు' అని భర్త అడిగేస్థితికి వచ్చాడంటే–ఇంక మనిషి మారాడని ఎలా అనుకొనేది!

బావగార్ని మార్చాలన్న మంచి ఉద్దేశ్యంతో అతని వాటాకి డబ్బిస్తానని ఆమె అన్నట్టుగా ఇంట్లో అందర్కీ తెల్సు. ఆ పరిస్థితిలో ఆమెకు నైతికంగా అండనిలవవల్సిందిపోయి – అసలదంతా ఆమె యెలా సమర్థించుకుందో తెల్సుకోవాలన్న ఉత్సాహం కూడా చూపించలేదు విశ్వనాధం. ఆ సమస్యంతా ఎవరిదో పరాయివాళ్ళదయినట్టు కిమ్మనకుండా వూర్కున్నారు. రిజిష్ట్రారు ఆఫీసులో అంతా సంతకం పెడుతున్నారు – తననీ పెట్టమన్నారు అన్నట్టే ప్రవర్తించాడు కాని, ఆమె ఎన్ని అవస్థలుపడిందీ పెదవి కదిపి కనీసం అడగనయినా లేదు.

ఓ మూల యిదంతా మనస్సులో అసంతృప్తి కలిగిస్తుంటే అతనిలా మాట్లాడ్డం ఆమె ప్రాణాల్ని పట్టి పిండినట్టయింది.

డబ్బిస్తేకాని ఆ పూట కదలనన్నట్టు కూర్చున్నాడు. రోజు వారీ ఖర్చులకి తనదగ్గర కొంత డబ్బు దాచి వుంచింది. పరుపు క్రింద పట్టెడతాళ్ళ మధ్య దాచివుంచిన డబ్బు మరికొంత వుంది. కాని, అతనెదురుగా అవి ముట్టుకుంటే తను మరీ లోకువ అయిపోతుంది. రేపు నిజంగా లేనప్పుడు కూడా ఎక్కడో దాచిందనే అనుకుంటాడు. అందుకనే, తన దగ్గర లేదన్న మాటమీదే నిలబడి మాధవిని పిల్చి డబ్బడిగింది కృష్ణవేణి.... మాధవి వెంటనే తెచ్చిచ్చింది. ఆ మాత్రానికే తన భర్తని చెల్లెలిముందు అవమానించానని ఎంతో నొచ్చుకుంది కృష్ణవేణి. కాని, యిలాంటి వాటికి ఎప్పుడో అతీతుడయిపోయాడు విశ్వనాధం!

"మీ మరదలు అడగ్గానే యిచ్చింది. మళ్ళీ నన్ను రేపడిగితే నేనెక్కడ్నించి తేను?" అని మరునాటి గురించి ముందే హెచ్చరించింది ఆమె.

ఆ పూటకి డబ్బందిందన్న హుషారులో ఉన్నాడతను. ఇటీవల అతని దృష్టిలో 'రేపు' అన్నది లేదు. ఇప్పటికి పబ్బం గడిచింది. రేపటి సంగతి రేపు చూసుకోవచ్చు. అదే అతని సిద్ధాంతమయిపోయింది. వ్యసనపరుల నిఘంటువులో 'రేపు' లేదు!

"రేపు నువ్వివ్వనక్కర్లేదు. నేనే నీకిస్తాను." అన్నాడతను నవ్వుతూ.

అలాంటి మాట లతననటం–ఆమె వినటం క్రొత్తేమీకాదు. అనేక వందల సార్లు జరిగింది. ఇంక అడగనని అతనంటూనే ఉన్నాడు. ఇంక యివ్వలేనని ఆమె అంటూనే ఉంది. అతనా 'రేపు' వచ్చాక అడుగుతూనే ఉన్నాడు. ఆమె తన ప్రాణాలు పిండుకొని యిస్తూనే ఉంది! నేడే కాదు....ఆ 'రేపు'న కూడా కన్నీళ్ళు ఖర్చు పెట్టాల్సి వస్తోంది.

ఈ సమస్యకి పరిష్కారం ఎప్పుడు? అతను మారేదెన్నటికి? తనకీ శాపవిముక్తి ఈ జీవితంలో లభించేదేనా?....అనుక్షణం ఆమె వేసుకుంటున్న ప్రశ్నలివి.

కొన్నాళ్ళపాటు తానతనికి దూరమయితే అతనిలో ఆలోచన పుడుతుందేమో–అని చాలా రోజులుగా అనుకుంటోంది. కాని, ఈ సమస్యలన్నీ మాధవి మీద వదలివెళ్ళటానికి ఆమెకు ప్రాణమొప్పలేదు. అందుకనే, తను పుట్టింటికి వెళ్ళే ప్రయాణాన్ని నెలల తరబడి వాయిదా వేసుకుంటూ వచ్చింది.

కాని, ఆ ప్రయాణమేదో హఠాత్తుగా రానే వచ్చింది. తనపెళ్ళి నిశ్చయమైందని బావగారితో సహా పెళ్ళికి పదిరోజులు ముందుగానే బయల్దేరి రమ్మని శ్రీకాంత్ ఉత్తరం వ్రాసాడు. ముందామెను వెళ్ళమన్నాడు విశ్వనాథం. శలవు చాలా వుంది కదా–అతన్నీ వెళ్ళిరమ్మని అన్నగారితో చెప్పాడు మురళి.

"ఇప్పట్నించీ నేనక్కడికి వెళ్ళి చేసేదేముంటుంది?" అని మాటలు త్రుంచేసాడు విశ్వనాధం. భర్త బాధ్యత కూడా చెల్లెలి మీద పెట్టేసి చాల రోజులు పుట్టింట్లో ఉండడానికి కృష్ణవేణికి మనసొప్పలేదు. ఆమె కూడా తన ప్రయాణానికి వాయిదా వేసింది.

నిర్మల, మాధవి ఆమెతో అట్టే వాదులాడనవసరం లేకుండా-తనే అక్కా బావల్ని స్వయంగా తీసుకువెళ్ళటానికి వచ్చాడు శ్రీకాంత్. విశ్వనాధం మళ్ళీ అవేమాటలు వల్లించి తప్పించుకున్నాడు కాని, కృష్ణవేణికిక ప్రయాణం కాక తప్పలేదు. అత్తగారు, మామగారు కూడా సంతోషంతో వెళ్ళి రమ్మన్నారు.

"మీరంతా కూడా వస్తే బావుండేది." అన్నాడు శ్రీకాంత్.

"నా పరిస్థితి చూసావుగా నాయినా!....లేకపోతే, రాకపోయే వాళ్ళమా! పెళ్ళయ్యాక మీ దంపతులు కల్సి రండి. మా యింట్లో మూడు నిద్రలుచేసి వెళ్ళండి." అంది సుభద్రమ్మ.

ఇన్నాళ్ళూ ఏ భయంతో పుట్టింటి ప్రయాణానికి వాయిదా వేసిందో అదే వచ్చి యిప్పుడు గుండెల్లో కూర్చుంది! మెళ్ళో మంగళసూత్రం మినహా....ఒక్కటంటే ఒక్క నగలేదు. అన్నీ యేనాడో అమ్మేసింది. బోసిమెడతో ఈ ముఖం తన పుట్టింటి వాళ్ళకి చూపించేదెలా?

కన్నీళ్లతో తన గదిలో కూర్చుండిపోయిన కృష్ణవేణి దగ్గరకి కోరని వరమివ్వటానికి వచ్చిన దేవతలా నడిచి వచ్చింది మాధవి. "అక్కయ్యా! ఇవి పట్టుకు వెళ్ళు." అంటూ తన నగల పెట్టె ఆమె చేతుల్లో పెట్టింది.

కృష్ణవేణి ముఖం తెల్లగా పాలిపోయింది. గుండె ఝల్లుమంది. "....ఎందుకు? నావి....నా వున్నాయి." అంది కంగారుగా.

మాధవి చిరునవ్వుకి చెక్కు చెదరలేదు. "నీవి నువ్వెప్పుడూ పెట్టుకొంటావుగా! నావి ఒక్కసారి పెట్టుకోవూ! ఇవి వూరికే పెట్టెలో పడి వున్నాయి....అన్నయ్య పెళ్ళిలో నువ్వు పెట్టుకుంటే నాకు తృప్తిగా వుంటుంది. నా మాట కాదనకు." అని ఆమె చేతిని ప్రేమగా నొక్కి గబగబా గది బయటికి వచ్చేసింది మాధవి.

'ఎంత అమాయకంగా యీ అక్కయ్య గండం గడిపావమ్మా!' అని కృష్ణవేణి మనసులో

కె. అమ్ములు



రాజమండ్రిలోని 'కళాదర్బార్' రాష్ట్ర స్థాయిలో ఏర్పాటు చేసిన నాట్య పోటీలలో పాల్గొన్న కుమారి అమ్ములు మూడు బహుమతులు పొందడం విశేషం. వాటిల్లో-జానపద నృత్యంలో ప్రథమ బహుమతి, కూచిపూడిలో ద్వితీయ బహుమతి. భరతనాట్యంలో తృతీయ బహుమతి పొందిన అమ్ములు ఒక విధంగా రికార్డు స్థాపించిందనే చెప్పవచ్చును. ఇంతకీ ఆమె వయసు ఎనిమిది సంవత్సరాలు!

వేదాంతం నాగేశ్వరశర్మగారి దగ్గర నృత్యం నేర్చుకోవడం ప్రారంభించిన అమ్ములు, శ్రీమతి సత్యవతి, పూర్ణయ్యగారి దగ్గర ఆ నృత్యానికి మెరుగులు దిద్దుకున్నది. ప్రస్తుతం హేమాంబర దీక్షితులు వద్ద కూచిపూడి నాట్యం నేర్చుకుంటున్నది. అమ్ములు పెక్కు సాంస్కృతిక కార్యక్రమాలలో పాల్గొని పలువురి మన్ననలు పొందింది. అతి పిన్న వయసులో ఆమె 'భామాకలాపం' రంగస్థలం పై ప్రదర్శించి అనేకుల ప్రశంసలు పొందడం మరో విశేషం!

---

అనుకుందే కాని – 'తన పరిస్థితి తెలిసే ఈ పని చేసాను అని అక్కయ్య ఎక్కడ గుర్తిస్తుందో' అని ఆమె కంగారుగా వెళ్ళిపోయిందని ఊహించలేకపోయింది.

అప్పుడే చీరల పేకెట్టుతో లోపలికి వచ్చింది నిర్మల. ఆవేళ ప్రొద్దున్నే ఆఫీసుకి వెళ్ళే ముందు "....నా ఫ్రెండు వాళ్ళ బ్రదర్ పెళ్ళికి వెడుతోందిట. రెండు మూడు క్రొత్త చీరలు కొనుక్కోవాలనుకుంటోంది. మళ్ళీ డబ్బు తిరిగి యిచ్చేస్తుందిలే! పరుపు కింద డబ్బు దాచావుగా! అందులోది తీసిస్తావా వదినా!" అని అడిగింది.

అప్పటి నిర్మల మాటల్లోని గూడార్థం కృష్ణవేణికి తట్టలేదు....కాని, ఈ చీరలు తన కోసమే తెచ్చానని ఆమె అనేసరికి తెల్లబోయింది.

"అదేమిటి, నీ ఫ్రెండు కావాలందన్నావు!...."

"నిన్ను మించిన ఫ్రెండు నాకింకెవరున్నారు! నువ్వు నీ బ్రదర్ పెళ్ళికి వెడుతున్నావు కదా!" అని వదినగారి ముఖాన్ని తన దోసెల్లోకి తీసుకొని పకపకా నవ్వింది నిర్మల.

కృష్ణవేణి ముఖం ఎర్రగా కందిపోయింది. "నువ్విలా చేయటం నాకు బాగా లేదు...."

"కాని, నాకు బావుంది...." అంటూ ఆమె బుగ్గమీద ముద్దు పెట్టుకొని మైమరిపించేసింది నిర్మల సుభద్రకి, నారాయణకి తెచ్చిన క్రొత్త బట్టలు వాళ్ళకి తొడిగే వంకన అక్కడ్నించి గబగబా వెళ్ళిపోయింది.

వెళ్ళే ముందు "తొందర్లోనే వచ్చేస్తానత్తయ్యా!" అంది కృష్ణవేణి.

"అలా కాదమ్మా! వెళ్ళక వెళ్ళక ఇన్నాళ్ళకి వెడుతున్నావు. మీవాళ్ళు ఉండమన్నన్నాళ్ళు ఉండిరా!" అంది సుభద్రమ్మ నిండు మనస్సుతో.

"మా బాగా చెప్పావమ్మా!" అంది నిర్మల నవ్వుతూ.

"కాని, అక్కయ్య ప్రాణాలన్నీ ఇక్కడే పెట్టుకు వెడుతోంది." అంది మాధవి అమాయకంగా.

కృష్ణవేణి ఉలిక్కిపడింది!

## 42

"ఈ నాల్గు రోజులూ ఇంటి పట్టునే వుండండి. నా మర్యాద దక్కించండి...." అని ఎంతో ప్రాధేయపడుతూ భర్తతో చెప్పి వెళ్ళింది కృష్ణవేణి.

ఎంతో నిజాయితీపరుడిలా అలాగే నన్నాడు విశ్వనాథం. కాని, అతను నిగ్రహించుకోగలిగింది ఒక్కరోజు మాత్రమే! ఆ మర్నాటికి మళ్ళీ మనసు క్లబ్బువైపుకి లాక్కుపోయింది....పెళ్ళికి బయలుదేరి రావటానికి భార్య యిచ్చిన డబ్బు కూడా ఆ ఆటలో ఖర్చు పెట్టేసాడు.

తర్వాత మూడోనాడు ప్రొద్దున్న ఆఫీసుకి వెళ్ళే ముందు చెల్లెల్ని పిలిచి "నాకో పది రూపాయలు కావాలి. మీ చిన్న వదిన దగ్గరున్నాయేమో అడుగు..." అన్నాడు.

నిర్మల అతి కష్టం మీద కోపాన్ని అణచుకుంది. వదినగారి ముఖం చూసేసరికి ఆమె నడగ బుద్ధి కాలేదు. కనీసం ఆమె ముఖం చూస్తేనయినా అతను జంకుతాడేమోనన్న ఆశతో "....అన్నయ్య నిన్ను పిలుస్తున్నాడు...." అని చెప్పి ఏదో పనిలో పడిపోయింది.

మాధవిని చూసి కంగారు పడ్డాడు విశ్వనాథం.

"ఎందుకో పిలిచారట!...." అంది ఆమె చిరునవ్వుతో.

"అఁ! ఏం లేదు....ఏం లేదు...." అని తడబడ్డాడు అతను.

ఆమె కర్థమయింది. విషయం చెప్పకుండా నిర్మల తననే ఎందుకు వెళ్ళమందో కూడా అర్థమయింది. తొణక్కుండా "పర్వాలేదు. చెప్పండి." అంది.

అతను గతుక్కుమన్నాడు. తన బండారం బయట పడిపోయిందేమోనన్నట్టు ఓ క్షణం పాటు చూశాడు. ఆమె ముఖం నిర్మలంగా వుంది! బలవంతంగా నవ్వు తెచ్చుకుంటూ "....అబ్బే ఏం లేదు. నీ దగ్గరుంటే ఓ పది రూపాయలు ఇస్తావని .... మళ్ళీ రేప్రొద్దున్న యిచ్చేస్తాను." అన్నాడు.

మాధవి వెంటనే తెచ్చిచ్చింది. ఆ రాత్రి ఆ డబ్బు కూడా పేకాట పరమయిపోయింది. మర్నాడు ప్రొద్దుటికి మళ్ళీ అడిగే స్థితికి వచ్చాడు. మాధవికి తిరిగి యిస్తానన్నది యివ్వలేదు. మళ్ళీ అడగటం ఎలా?....పిచ్చిపట్టిన వాడిలా గదిలో అటూయిటూ తిరిగాడు.

అంతలో రాఘవరావు వచ్చాడు. ఎక్కడో జున్నుపాలు దొరికాయట. కూతురికి యిష్టమని జున్ను వండించి తెచ్చాడు. మాధవి అందరికీ పెట్టింది.

అతను వెళ్ళిపోతుంటే...ఏదో పని ఉందంటూ వెంటపడ్డాడు విశ్వనాథం....కొంతదూరం వెళ్ళాక

''....మీరేమనుకోనంటే ఒకటి అడుగుదామని అనుకుంటున్నానండీ।'' అన్నాడు.

రాఘవరావు నవ్వి ''నా దగ్గర సందేహం ఎందుకయ్యా। అడుగు'' అన్నాడు.

''ఏం లేదు....రెండు రోజుల్లో మా బావమరిది పెళ్ళికదండీ। ఏదయినా కొని పట్టుకు వెడదామని....చేతిలో ఏం లేదు. మీరో ఏభై రూపాయిలిస్తే జీతం రాగానే ఇచ్చేస్తాను. మురళీ నడగాలంటే వాడి దగ్గరుందో లేదోనని....''

''డబ్బున్నప్పుడే. ఇయ్యి, తొందర్లేదు....'' అంటూ జేబులోది తీసి ఇచ్చాడు రాఘవరావు.

పేకాట వ్యసనానికి బానిస అయిన మనిషిలో మంచితనం హరించి పోవట మొక్కటేకాదు. సిగ్గు అభిమానం అన్నవి కూడా తుడిచి పెట్టుకు పోతాయి. డబ్బు పుట్టట మొక్కటే వాళ్ళకి కావలసింది. ఎవర్ని అడుగుతున్నాము—అన్న ప్రశ్నలు వుండవు. ఇచ్చిన మాటలు గుర్తుండవు. మళ్ళీ ఇవేళ డబ్బు ఎక్కడ ఎవర్ని అడగాలనే కాని నిన్న ఎవర్ని అడిగి పుచ్చుకున్నాము? ఏమని చెప్పి పుచ్చుకున్నాము?—అన్న ఆలోచనలుండవు. అతి సునాయాసంగా అనేక అబద్ధాలు ఆడుతున్నామన్న స్పృహ కూడా వుండదు. విశ్వనాధం కూడా అలాంటివాడే।

రాఘవరావు ఇచ్చిన డబ్బు రెండు రోజులు 'పని' జరిపింది.

''రేపే శ్రీకాంత్ పెళ్ళి.'' అని మురళి గుర్తు చేస్తే కాని ప్రయాణం విషయం స్ఫురణకు రాలేదు. ఏవో ఆఫీసు పనులున్నాయని మాట దాట వేయబోయాడు.

''పెళ్ళికి తప్పకుండా వెళ్ళాలన్నయ్యా। లేకపోతే వదిన బాధపడుతుంది. శ్రీకాంత్ నొచ్చుకుంటాడు....'' అని ఎంతో ఇదిగా చెప్పాడు మురళి.

''ప్రయాణం ఖర్చులకి నా దగ్గర బొత్తిగా ఏం లేదు....'' అని నసిగాడు.

మురళి గాఢంగా నిట్టూర్చాడు. "సాయంత్రానికి నేను చూసిస్తాను. తప్పకుండా వెళ్ళిరా।'' అని చెప్పాడు.

అన్న మాటప్రకారం మురళి డబ్బు తెచ్చిచ్చాడు కాని, చెప్పిన మాటప్రకారం విశ్వనాధం వెళ్ళ లేదు....వెడదామనుకొని స్టేషను దాకా వెళ్ళాడు. బండి రెండుగంటలు లేటన్నారు. అప్పటి దాకా అక్కడ కూర్చోవటమెందుకని క్లబ్బుకి వెళ్ళాడు.



నువ్వుల నూనెలో నల్ల జీడి గింజలు వేసి మరగనివ్వాలి. ఇలా మరిగిన నూనెను నిలవ చేసి ఆ నూనెను రోజూ తలకు రాసుకుంటే వెంట్రుకలు నల్లబడతాయి.

మళ్ళీ స్పృహ వచ్చేసరికి బండీ వెళ్ళిపోయింది; డబ్బూ 'వెళ్ళి'పోయింది.

ఇంటికి వెళ్ళటానికి ముఖం చెల్లక ఆ రాత్రి క్లబ్బులోనే ఉండిపోయాడు. మర్నాడు ప్రొద్దున్న టిఫినుకి మాత్రం డబ్బులున్నాయి....మధ్యాహ్నం వేళ దాకా పిచ్చివాడిలా అక్కడే కూర్చుండి పోయాడు. డబ్బడగటానికి ఎవరయినా కనిపిస్తారేమోనని చూసాడు. కాని, ప్రొద్దుటి వేళ క్లబ్బుకి వచ్చేవాళ్ళల్లో డబ్బు అప్పుపెట్టేవాళ్ళెవరూ కనిపించలేదు.

ఆకలిబాధకి తట్టుకోలేక తిన్నగా యింటికి వచ్చాడు. అక్కడ రాఘవరావు కనిపించేసరికి అతనికి తల కొట్టేసినట్టయింది. భార్య యిచ్చిన డబ్బు పోయింది. ఆయన దగ్గర మూడు రోజుల నాడు పుచ్చుకున్న డబ్బు పోయింది. గత దినం తమ్ముడిచ్చిన డబ్బు పోయింది. ఇప్పుడేమని చెప్పాలి? పెళ్ళికెందుకు వెళ్ళలేకపోతున్నానని చెప్పాలి?

అతన్ని చూసి అంతా ఆశ్చర్యపోయారు. ''అదేమిటి పెళ్ళికి వెళ్ళలేదూ?....'' అని అడిగాడు రాఘవరావు.

''....రైల్లో ఎవడో పర్సు కొట్టేసాడు....'' అని నీళ్ళునమిలాడు విశ్వనాధం.

మరి రాత్రంతా ఎక్కడున్నాడో అడుగుదామని రాఘవరావు అనుకున్నాడు. మాధవికి వెంటనే విషయం అర్థమయిపోయింది. బావగారి గౌరవం కాపాడ్డం కోసం భోజనానికి లెమ్మని మాట మార్చేసింది.

తండ్రికి బావగారి 'సంగతి' తెలియకుండా మాధవి అప్పటంటే జాగ్రత్తపడగల్గింది కాని.... ఆ సాయంత్రానికే రాఘవరావుకి నిజం తెలిసి పోయింది.

ఆ రాత్రి బస్సుకయినా పంపిస్తే పెళ్ళివేళకి విశ్వనాధం చేరతాడని రాఘవరావు డబ్బుకోసం బయలుదేరాడు. ఎవరో అతనికి డబ్బివ్వాల్సి వుంది. వాళ్ళింటికి వెళ్ళి సంగతి చెప్పాడు. మాటల సందర్భంలో జేబుదొంగతనాల గురించి ప్రస్తావన వచ్చి విశ్వనాధం గురించి చెప్పాడు. అదే సమయంలో అక్కడున్న అప్పారావు పెఖ్ఖున నవ్వుతూ విశ్వనాధం రహస్యం కాస్తా బయిట పెట్టాడు. ''వాడేమిటి రైల్లో వెళ్ళటమేమిటండీ? రాత్రంతా క్లబ్బులో పేకాటలో కూర్చున్నాడు....'' అంటూ అతనికెన్నో యేళ్ళ నుంచి వున్న వ్యసనం గురించి పూసగ్రుచ్చినట్టు చెప్పాడు. కావాలంటే ఫలానా ఫలానా వాళ్ళనడగండి అని కూడా చెప్పాడు. రాఘవరావు అడగనూ అడిగాడు. అది నిజమని తెలిసేసరికి అతనికి మతిపోయినట్టయింది....అయినా అన్న మాటప్రకారం మళ్ళీ డబ్బు యిచ్చి విశ్వనాధాన్ని శ్రీకాంత్ పెళ్ళికి పంపాడు.

మనస్సులోని బాధ దాచుకోలేక మర్నాడు కూతురితో తను విన్న సంగతి చెప్పాడు రాఘవరావు.

''ఎవరో కిట్టనివాళ్ళు ఎన్నో అంటారు. అవన్నీ మీరు నమ్మకండి నాన్నా।'' అంది మాధవి.

కాని, ఆమె ఏమాత్రం కూడా తొణక్కుండా అన్న ఆ మాటలు ఆమె తల త్రిప్పుకోవటం తను విన్నదంతా నిజమని అతనికి స్పష్టం చేసాయి.

''ఇవి దాచుకుంటే దాగే విషయాలు కావమ్మా! లోకమంతా కోడైకూస్తోంది. నిన్నొక్కళ్ళు కాదు....ముగ్గురు చెప్పారు....నేనింక నమ్మకుండా ఎలా వుండగలను? మీ అత్తింటిగుట్టు నువ్వు కాపాడ్డం తప్పుకాదు కాని....నీ కాళ్ళ క్రింద నువ్వే నిప్పులు పోసుకుంటావా? కృష్ణవేణయినా నీతో చెప్పలేదూ?''

మాధవికేమనాలో తోచలేదు.

''ఈ సంగతి వెంటనే మురళికి చెప్పాలి..."

అతనికెప్పుడో తెలుసని ఏమీ చేయలేకనే అతనలా వూరుకున్నాడనీ ఆమె చెప్పలేక పోయింది. ఆమె వారిస్తున్నా వినకుండా రాఘవరావు హడావిడిగా మురళి ఆఫీసుకి వెళ్ళాడు.

అతనికేమీ తెలియదనుకొని ఎంతో వివరంగా చెప్పాడు. మాధవికి తెలుసునన్న సంగతి కూడా చెప్పాడు....కృష్ణవేణి ఈ సంగతి ఎవరికీ తెలియ

కుండా దాచటం అన్యాయమన్నాడు...తన అల్లుడి సంపాదన కూతురి కష్టార్జితం యిలా వృధా కావటం తను చూస్తూ ఉండలేనన్నాడు....

మామగారి మాటలకి మురళికెంతో కోపం వచ్చింది. ఆయన దగ్గరయితే నిగ్రహించుకు న్నాడు కాని....ఇంటికి వచ్చి భార్యని చూసాక ఆపుకోలేకపోయాడు.

ఆమె మీద ఉప్పెనలా విరుచుకుపడ్డాడు. ''....ఏమిటి నీ ఉద్దేశ్యం? నీ మనస్సులో ఏదయినా వుంటే నా ముఖానే ఏడు. ఇక్కడా అక్కడా చెప్పుకోవటమెందుకు?....''

ఎప్పుడూ ఎరుగని భర్త కోపానికి నిర్ఘాంత పోయింది మాధవి.

''ఎవరో ఏదో అన్నారని మీ నాన్నగారూ నువ్వూ యింటిపరువు బజారుకీడుస్తారా?....'' అంటూ నానా మాటలూ అన్నాడు.

''నేనేమీ అనలేదండీ!....'' అని ఇంకా ఏదో చెప్పబోయింది మాధవి.

''ఛీ! సిగ్గులేకుండా మాట్లాడకు....''

మాధవి అభిమానం దెబ్బతింది. ''నేనేం సిగ్గు పడాల్సిన పని చేయలేదు....'' అంది గొంతు హెచ్చించి.

మురళి నిగ్రహాన్ని కోల్పోయాడు....అప్పుడే ఆఫీసు నుంచి వచ్చిన నిర్మల అడ్డు రాకపోతే మాధవి రెండో చెంప కూడా చెళ్ళుమని వుండేది!

''కొట్టనీ నిర్మలా!....మొగుడి చేతిలో పెళ్ళాం దెబ్బలు తినటం ఈ దేశంలో కొత్త కాదని నువ్వనలేదూ! అది మీ అన్నయ్య రుజువు చేస్తున్నారు!''

చెల్లెలి కోపారుణిత నేత్రాలు చూసేసరికి మురళి నెత్తిన తాండవమాడుతున్న శివం సగం దిగి పోయింది.

''వదిన ఏమంత తప్పు చేసిందని కొట్టేదాకా వెళ్ళావన్నయ్యా!'' అని అడిగింది నిర్మల గంభీరంగా.

''అన్నయ్య గురించి వాళ్ళ నాన్నగారు నోటికి వచ్చినట్టు మాట్లాడారు. ఏమయినా అడగదల్చు కుంటే నన్ను అడగాలి. అంతే కాని, ఆయనతో అవీ యివీ చెప్పట మెందుకు?''

మాధవి బుగ్గల మీదకి జలజల నీరు జారి వచ్చింది.

''నేను చెప్పానా? ఏం చెప్పానండీ? మా నాన్నగార్నే పిలిచి నా ముందడగండి.... చెప్పింది నేను కాదు. ఆయనెవరో చెప్పారు. అది నిజమేనా అని నన్నడిగితే అబద్ధమని నేను చెప్పాను. అదా నా తప్పు!....మీకు ఎన్నో రోజులుగా తెలుసు. మీరెప్పుడూ నాతో చెప్పలేదు. నాకు తెల్సినా నేను నోరు విప్పలేదు....అదా నా తప్పు!....మీ అందరి గౌరవం నాదనుకు న్నాను. మీతో యీ సంగతులేవీ మాట్లాడవద్దని కూడా నాన్నగారితో చెప్పాను...ఆయన వినకపోతే నేనేం చేయను? అదీ నా తప్పేనా!....

మాధవి మాటలు ఆ అన్నా చెల్లెళ్ళ గుండెల్ని కదిలించివేసాయి.

''....అవును వదినా! నీది మామూలు తప్పు కాదు. మహాపరాధం! ఆ అన్నయ్య చేస్తున్న పని ప్రపంచానికంతా తెల్సిపోయినా ఫర్వాలేదు కాని....నీకు తెలియటం........నీకు తెలిసినట్లు ఈ అన్నయ్యకి తెలియటం మహామహాపరాధం! అంతేనా అన్నయ్యా?''

మురళి ముఖం ఎర్రబడిపోయింది.

''....అసలు నీ తప్పేమిటో నేను చెప్పనా వదినా! మేమిలా వందలకి వందలు అడగ్గానే నువ్విలా నోరెత్తకుండా తీసి యివ్వటం మొదటి తప్పు. ఏం చేస్తున్నారీడబ్బని పైకి అడక్క పోవటం రెండో తప్పు. శ్రమపడి నువ్వు సంపాదించి తెస్తున్నది – గంగపాలవుతుంటే కాస్తంతయినా బాధపడకుండా ఉండటం నీది పెద్ద తప్పు. చాలా పెద్ద తప్పు వదినా!....'' అంది నిర్మల గద్గదస్వరంతో.

''ఊర్కో నిర్మలా!'' కళ్ళు తుడుచుకుంది మాధవి.

''ఏం? ఎందుకూర్కోవాలి?....నేనేం తప్పు మాటనలేదు....''

మురళికి తను తప్పు చేసాడని తెలుసు. కాని, జరిగినదానికి అతని మనసంతా కలగిపోయింది.



మామిడి ఆకుల నడుమగల యీనెలను తీసి వాటిని కాల్చి చేసిన మసిని నీళ్ళలో కలిపి కంటి రెప్పల మీద వుండే వులిపికాయల మీద అంటిస్తే-. అవి హరిస్తాయి.

ఆ అసహనంతో "నోరు మూస్తావా ముయ్యవా?" అని గట్టిగా అరిచాడు.

''ముయ్యకపోతే కొడతావా?....కొట్టు.... వదిన్ని కొట్టగా మిగిలింది నన్ను కొడతావు. అంతేగా? నీకు చేతనయింది అదొక్కటే!''

''ఛీ! కొంప నరకం అయిపోయింది....''

''నరకం చేసింది మేముకాదు........ఎవరు చేసారో వాళ్ళనను. చేతనయితే వాళ్ళని మార్చు'' అంది నిర్మల ఉద్రేకంగా.

దొడ్లో గాలికోసం వెళ్ళి కూర్చున్న సుభద్రమ్మ లోపలేదో గొడవ జరుగుతోంది చూడమని భర్తతో అంది. సత్యనారాయణగారు రావటంతో ఆవేశాలు అణచుకొని అంతా తలోవైపూ వెళ్ళి పోయారు.

## 43

శ్రీకాంత్ పెళ్ళయిన మరునాడే వచ్చేసాడు విశ్వనాధం. మనుగుడుపులు అవీ అయినాక కృష్ణవేణి వస్తుందని చెప్పాడు. అతను కాసేపు స్థిమితంగా కూర్చుని పెళ్ళి విశేషాలు చెప్పటంతో అందరి మనస్సులూ కొంచెం తేలికపడ్డాయి.

మరో రెండు రోజులు పోయాక నిర్మలకో పెళ్ళి సంబంధం చూసానని ఆ అబ్బాయి తనకు తెలిసినవాడని మరో సంబంధం చూడ్డానికి ఆ వూరి మీదుగా వెడుతున్నాడని....తిరుగుప్రయాణంలో నిర్మలని చూడ్డానికి వస్తాడని........ఆ టైముకి తానూ వస్తానని మురళికి ఉత్తరం వ్రాసాడు రామచంద్రం.

చెల్లెలితో ఘర్షణపడినప్పటి నుంచి మురళి ఆమెతో మాట్లాడటం లేదు. తనకు ముఖం చెల్లక మాధవినే చెప్పమన్నాడు.

''మీ అన్నయ్యని ఉద్యోగం చూసి పెట్టమని చెప్పాను కాని పెళ్ళికొడుకుని కాదు.'' అంది నిర్మల బుంగమూతిపెట్టి.

''ఉద్యోగం నువ్వే చూసుకున్నావుకదాని పెళ్ళికొడుకుని తను చూసిపెట్టాడు.'' అంది మాధవి నవ్వుతూ.

''పాపం. శ్రమపడ్డారు కాని నాకు పెళ్ళి చేస్కోవాలని లేదులే!''

''నాతో తర్వాత వేళాకోళమాడుదుగాని- ముందీ పెళ్ళికొడుకుని చూడు.''

''నేను వేళాకోళమాడటం లేదు వదినా!

ఈ మధ్య మిజోరం రాష్ట్రంలోని బువార్‌పుయ్ గ్రామంలో ఒక విచిత్రమైన సాహసకాండ జరిగింది. ఆ సాహస కృత్యానికి కారకురాలు ఒక స్త్రీ కావడం విశేషం!

బాదంగి అనే యువతి బువార్‌పుయ్ సమీపంలోని అడవికి వెళ్ళి కట్టెలు కొట్టి తెచ్చుకుంటూ వుంటుందిట. ఇది ఆమె నిత్య కృత్యాలలో ఒకటి. ఆ విధంగానే ఇటీవల ఒక రోజు ఆమె ఒంటరిగా అడవికి వెళ్ళింది. తీరా కట్టెలు కొట్టడంలో నిమగ్నమయ్యేసరికి—ఒక పులి కాస్తా అటువైపు వచ్చి ఆమె మీదికి ఉరకబోయింది. దాంతో భయభ్రాంతురాలైన బాదంగి ఏం చెయ్యాలో తోచక తన చేతిలోని గొడ్డలితో ఆ పులి తల మీద విడవకుండా బాది-అక్కడి నుంచి గ్రామం వైపు వెనక్కి తిరిగి చూడకుండా పరిగెత్తిందిట. ప్రాణం బిగపట్టుకుని గ్రామం చేరిన బాదంగి, గ్రామస్తులకి జరిగిన కథంతా చెప్పేసరికి వాళ్ళు హుటాహుటిన (ఆయుధపాణులై) అడవికి బయల్దేరారట. తీరా అక్కడికి వెళ్ళి చూసేసరికి బాదంగి కొట్టిన దెబ్బలకి ఆ పులి కాస్తా బ్రహ్మాండమైన రక్తపు మడుగులో చచ్చి పడివుంది!




సీరియస్‌గానే చెపుతున్నాను. నాకు పెళ్ళి చేసుకోవాలనిపించటం లేదు. నాకు మగవాళ్ళ మీద నమ్మకం పూర్తిగాపోయింది....''

''ఏం? ఎందుకని?''

''ఎందుకా! చుట్టూ చూస్తుంటే కనిపించటం లేదూ?........ఒక్కడంటే ఒక్కడు భార్యని ఆదరించేవాడు కనిపిస్తున్నాడా? కనీసం అర్థం చేసుకోటానికి ప్రయత్నించేవాడు కనిపిస్తున్నాడా? ఎవరో ఎందుకు? మన కుటుంబాన్నే తీసుకో! పెద్దన్నయ్య అలా....విశ్వమన్నయ్య సరేసరి.... కనీసం మీ శ్రీవారేనా మంచి మనసున్న మనిషని నిన్న మొన్నటి దాకా అనుకున్నాను. తనూ అందరిలాంటి వాడేనని నిరూపించుకున్నాడు. ఇంతకన్న ఉదాహరణలేంకావాలి?....''

మాధవి చిన్నగా నవ్వింది. ''చూడు నిర్మలా! కళ్ళముందు కనిపించిందొక్కటే నిజం కాదు. నిదానంగా ఆలోచిస్తే....అర్థం చేసుకోటానికి ప్రయత్నిస్తే మరికొంత నిజం తెలుస్తుంది! ఆయన నన్ను కొట్టటమొక్కటే చూసావు.... ఆ తర్వాత ఎంత బాధపడ్డారో నన్నెంత బ్రతిమాలారో నీకు తెలియదు....''

''....అవును వదినా! ఆడవాళ్ళల్లో ఇలాంటి వీక్నెస్ ఉండబట్టే మగవాడు తొందరపడి కొట్టగలుగుతున్నాడు! ఏం, ఆవేశమన్నది వాళ్ళకేనా? మనకుండదా? మనమే ఆ పని చేస్తే?....''

మాధవి గలగల నవ్వింది. ''అప్పుడు ఆడవాళ్ళ గొప్పతనమేముంది?''

''నువ్వంత తేలిగ్గా క్షమించటం నీ గొప్పతనం కాదు....బానిసగుణం!''

మాధవి ముఖం మీద నవ్వు మాయమైంది. ''సహనంతో ఉండటమే బానిసగుణం అయితే బానిసనవాలనే నేను కోరుకుంటాను. తప్పొప్పుకున్న మగవాడిని క్షమించటమే బానిసగుణమయితే ఆ బానిసనే కావాలనుకుంటాను.''

ఆమె గంభీరమైన స్వరానికి చకితురాలైంది నిర్మల.

''నువ్వు ఉపన్యాసాలిచ్చేదేమిటి? మాటకి మాట అప్పగించమని. దెబ్బకిదెబ్బ కొట్టమని! ఇదేనా ఉమెన్స్‌లిబ్ బోధించేది? అభిప్రాయ భేదాలు తొలగించుకోవటం ప్రధానమా-ప్రెస్టేజ్ కోసం మనస్సులు ముక్కలు చేసుకోవటం ముఖ్యమా? ఒకడుగు తగ్గినా మంచిదారివైపు త్రిప్పటం అవసరమా లేక మనమూ తొందరపడి ముళ్ళబాటలోకి పరుగులెత్తటం అవసరమా? ఆలోచించు. చిన్నప్పట్నించి తెలిసిన మనిషినే నువ్వర్థం చేసుకోకపోతే....జీవితంలో ఇంకెవర్ని తెలుసుకుంటావు?''

నిర్మల కన్నార్పకుండ చూస్తూండిపోయింది.

''నోమేన్ ఈజ్ పెర్ఫెక్ట్! ఏ మగవాడూ సర్వసద్గుణ సంపన్నుడు కాడు! ప్రతి మనిషిలోను ఏవో లోటుపాట్లుంటాయి. బలహీనతలుంటాయి. అవి సహనంతో అర్థంచేసుకొని సర్దుబాటు చేసుకొనేవాళ్ళుంటే సంసారాలు సజావుగా ఉంటాయి. లేకపోతే, వీధినిపడతాయి. ఇందులో నన్నేదారిని వెళ్ళమంటావో నువ్వే చెప్పు. చేస్తాను!....''

నిర్మలలో ఆలోచన ప్రారంభమయింది.

అప్పటికా ప్రస్తావన వదలిపెట్టి నిర్మల ప్రసన్నురాలై వున్నప్పుడు మళ్ళీ అడిగింది మాధవి.

''పెళ్ళి చూపులంటే నాకేం ఎలర్జీలేదు కాని.. వచ్చే ఆయన పద్ధతి నాకు నచ్చలేదు''....అంది నిర్మల.

''ఇంకా చూడందే?''

''అక్కడో అమ్మాయిని చూసి వస్తూ.... ఇక్కడ నన్ను చూడడమేమిటి?''

''ఇందులో తప్పేముంది? మళ్ళీ మళ్ళీ ప్రయాణం పెట్టుకోనక్కర్లేకుండా ఒకే ట్రిప్పులో ఇద్దర్ని చూస్తున్నాడు. ప్యూర్ ఎకనమిక్స్ అనుకో! మనం మరోలా ఎందుకు తీసుకోవాలి? నచ్చిన పిల్లనే చేసుకుంటాడు. నీకు నచ్చితేనే చేసుకో....''

''నువ్వీ మధ్య మగవాళ్ళందర్నీ బాగా సమర్థిస్తున్నావులే!''

''అవును. మరి నీలాంటి వాళ్ళంతా ఏకబిగిని విమర్శిస్తుంటే జాలేసి....''అని నవ్వింది మాధవి.

ఇద్దరూ గలగల నవ్వుకున్నారు.

''మరి అప్పటికి వదిన వస్తుందో రాదో! వదిన లేకుండా చూడాలని నాకు లేదు.''

''అక్కయ్య వచ్చేస్తుందని బావగారు చెప్పారుగా!''

ఆ మర్నాడే కృష్ణవేణి రెండు మూడు రోజులలో బయలుదేరి వస్తానని వ్రాసిన ఉత్తరం అందింది. అందుచేత పెళ్ళి చూపులకి తనకేం అభ్యంతరం లేదంది నిర్మల. ఆ వార్త మురళి రామచంద్రానికి అందజేశాడు.

అన్న వేళకి పెళ్ళివారితో రామచంద్రం వచ్చాడు కాని ఏ కారణం చేతనో కృష్ణవేణి రాలేదు....

తల్లిదండ్రుల్ని సంప్రదించి పెళ్ళి చూపులకి కావలసిన ఏర్పాట్లన్నీ చేశాడు మురళి. ఏ కళ నున్నాడో విశ్వనాథం కూడా ఆ పూట యింటి పట్టునే వున్నాడు.

కృష్ణవేణి లేకుండా పెళ్ళిచూపులకి కూర్చోవటం నిర్మలకిష్టంలేదు. మాధవి ఎంతో బ్రతిమాలి ఒప్పించింది. ''....నువ్వలా మూతి ముడుచుకోకు. మా మరదలికి మూతి వంకరని పెళ్ళివారనుకోగలరు!....'' అని పరిహసించేసరికి నిర్మల ఫక్కుమని నవ్వింది.

''అహ! మరీ అంతగానవ్వకు. డేంజర్!''

ఈ క్రొత్త అనుభవమేమిటో చూద్దామన్న కుతూహలం నిర్మలకే కలిగింది. ఆమె ప్రసన్న వదనంతోనే మాధవి చేసిన ముస్తాబుతో వచ్చి పెళ్ళివారి ముందు కూర్చుంది.

పెళ్ళికళ ఉట్టిపడుతున్న నిర్మలని చూసి కన్నవాళ్ళు—అయినవాళ్ళే కాదు....పెళ్ళివారు కూడ ఎంతో ముచ్చటపడ్డారు. ముగ్ధులయ్యారు. రాఘవరావు, రామచంద్రం ఇరువైపులా మాట్లాడుతూ ఆ తతంగమంతా కానిచ్చారు.

''....పెళ్ళికొడుకేమయినా అడగవచ్చునని పెళ్ళికూతురు చెపుతోందండి.'' అన్నాడు రామచంద్రం నవ్వుతూ.

అతని మాట కేవలం పరిహాసంగా మిగిలిపోలేదు. అది నిజమనుకున్నాడేమో — పెళ్ళికూతురితో ఒంటరిగా మాట్లాడాలన్న అభిప్రాయం వ్యక్తంచేసాడు పెళ్ళికొడుకు.

నిర్మలకి గుండెలు దడదడలాడాయి. ''....ఇంతేనా నీ ప్రతాపం?'' అని మాధవి మేలమాడింది. ఎర్రబడిన ముఖంతో తనకేం అభ్యంతరం లేదని సవాల్‌చేసింది నిర్మల.

మురళి గదిలో వాళ్ళకి ఏకాంత సమావేశం ఏర్పాటు చేశారు.

నిర్మలకి ముచ్చెమటలు పోసాయి. ఆమె ముగ్ధ మోహన రూపాన్ని చూసి మురిసిపోయాడు పెళ్ళికొడుకు. ''....మీ గురించి రామచంద్రంగారు చాలా చెప్పారు. అప్పట్నించీ చూడాలని చాలా యిదయ్యాను.''

నిర్మల తలయెత్తి చిరునవ్వు నవ్వింది. ''థాంక్స్!''

''మీ కథలు కొన్ని చదివాను. చాలా బాగా వ్రాస్తారు మీరు!''

''థాంక్స్!''

''అదొక్కమాటేనా? మీ పాత్రల చేత ఎన్నో మాట్లాడిస్తారు!'' అని నవ్వాడతను.

''అవి కథలు కదండీ!....''

''మీరు తల్చుకుంటే జీవితాన్ని కూడా చక్కని కథగా మలచగలరు.''

''అది ఒక్కరి చేతిలో నడిచే కథ కాదు. ఇద్దరు వుండాలి.''

''అవుననుకోండి. మీకా సామర్థ్యం ఉందని నా నమ్మకం!''

నిర్మలకి మొదట వున్న బెంకు పోయింది. ధైర్యంగా మాట్లాడింది. పెళ్ళి విషయంలో తనకున్న నిశ్చితాభిప్రాయాల్ని చెప్పింది. అతను కూడా మెచ్చుకోలుగా మాట్లాడాడు. వరకట్నం తన కిష్టంలేదని చెప్పకనే చెప్పాడు. ఆమె నచ్చిందని నోటి మాటగా చెప్పకపోయినా....ఇక తమ పెళ్ళికి పెద్దవాళ్ళు ముహూర్తం పెట్టటమే తరువాయి—అన్నట్టు మాట్లాడాడు.

ఆమె కతని వ్యక్తిత్వం నచ్చింది. ''మీరు నన్నేమయినా అడగదల్చుకుంటే నిరభ్యంతరంగా అడగచ్చు.'' అని అతనన్నప్పుడు మనసులోని మాట చెప్పకుండా ఉండలేకపోయింది. ''ఒక వేళ మీరు నన్ను పెళ్ళి చేసుకోటానికి నిశ్చయించుకున్నట్లయితే నాదొక కోరిక వుంది. చెప్పమంటారా?''

అతను కుతూహలంగా అడిగాడు. ''తప్పకుండా! ఏమిటో చెప్పండి.''

''ఇప్పుడు నాకు ఉద్యోగముంది. నాకీ ఉద్యోగం కొంతకాలం పాటు చేయాలని వుంది. ఇదయినా మరొకటయినా చేయాలని వుంది. మీ కభ్యంతరమా?''

''నో! నాట్‌ఎటాల్! నాకెటువంటి అభ్యంతరం లేదు. మీ కిష్టమైనంత కాలం మీ కిష్టమైన ఉద్యోగం చెయ్యవచ్చు!''

ఆమెకెంతో ఆనందమయింది. ''నేనిలా అడిగినందుకు మరొకలా అనుకోకండి. ముందే అన్నీ మాట్లాడుకుని మరీ నిశ్చయించుకోవటం మంచిదని...''

''అవును. అలా చేయటమే నాకూ యిష్టం. ఇంకా ఏమయినా అడగాలా?''

నిర్మల క్షణంపాటు తటపటాయించింది.

''అడగండి. డోన్ట్ హెసిటేట్!''

ఆమె తల దించుకొని నెమ్మదిగా చెప్పింది. ''మా కుటుంబ పరిస్థితులంతగా బాగా లేవు. కొన్నాళ్ళపాటు నా సహాయం మా వాళ్ళకి అవసరం. నా జీతంలో కొంతయినా వాళ్ళకి పంపాల్సి ఉంటుంది....కనీసం మా యింటి మీద అప్పు తీరే వరకయినా!....''

అతను మాట్లాడలేదు. ఆమె తల యెత్తి చూసింది. అతను చూపులు తప్పించుకున్నాడు.

''అందుకు మీరభ్యంతరం చెప్పకూడదు!'' అంది నిర్మల మరింత స్పష్టంగా.

''ఆయామ్ సారీ! ఆ గ్యారంటీ నేనివ్వలేను. మా వాళ్ళని కూడా నేను కన్సల్ట్ చేయాలి!''

నిర్మల కొన్ని క్షణాలపాటు నిర్ఘాంతపోయింది. అంతకుముందు ఆమె మనసులో అంతెత్తుకు లేచిన అతని వ్యక్తిత్వం అర క్షణంలో నేలబారుకి దిగజారిపోయింది. ''నేను మా వాళ్ళని అడిగి నేనీ మాట మీతో చెప్పలేదు. మా వాళ్ళు అందుకు ఒప్పుకోరు కూడా! కాని, నన్ను పెంచి పెద్దచేసి నా కాళ్ళమీద నేను నిలబడేలా చేసారు. వాళ్ళ బరువు బాధ్యతలు కొంత తగ్గేలా రిలీఫ్ ఇవ్వటం నా డ్యూటీ అనుకొని చేస్తానంటున్నాను. మీరు మీ వాళ్ళని కన్సల్ట్ చేయాలంటున్నారు. ఇందులో మీకర్థం కానిదేముందో నాకు తెలియటం లేదు!'' అంది జేవురించిన ముఖంతో.

నిర్మల ఆవేశపూరిత స్వరానికి అతను చకితుడయ్యాడు. ''....సరే, అదంతా తర్వాత చూసుకోవచ్చును. ముందు పెళ్ళి కానివ్వండి!''

అతను మాటలు త్రుంచి వేయటంతో ఆమె కతని తత్వం పూర్తిగా అర్థమైపోయింది. వరకట్నం అక్కర్లేదు కాని....వధువు తెచ్చే ఆదాయమంతా తనకే కావాలి....అదృష్టవశాత్తూ

# లోకజ్ఞానం

1. సింధునది టిబెట్‌లోని కైలాస పర్వతంలో పుట్టి, పంజాబు, సింద్ ప్రాంతాల మీదుగా ప్రవహించి అరేబియా సముద్రంలో కలుస్తోంది. ఈ సింధు నదికి ఐదు ఉపనదులు వున్నాయి. అవి ఏవి?

2. మనదేశంలో బొగ్గు వుత్పత్తి చేస్తున్న ముఖ్యమైన రాష్ట్రాలు నాలుగు వున్నాయి. వాటిలో మొదటి మూడు—బీహార్, పశ్చిమ బెంగాల్, మధ్యప్రదేశ్ మరి ఆ నాలుగో రాష్ట్ర మేదో చెప్పగలరా?

3. మహా సముద్రాలలో అత్యధిక విస్తీర్ణం గలది-పసిఫిక్ మహాసముద్రం. అయితే సముద్రాలలో పెద్ద సముద్రం ఏది? దాని విస్తీర్ణం ఎంత?

4. ఇంగ్లండులోనూ, యూరోప్ దేశాలలోనూ నూరు వేలు అంటే మనం ఒక లక్ష అని అంటాం. ఆ విధంగానే వారు ఒక మిలియను అంటే మనం పది లక్షలని, పది మిలియన్లకి ఒక కోటి అని వ్యవహరిస్తున్నాం. అలాంటప్పుడు వారి మిలియర్డ్ అంటే మన పరిభాషలో ఎంత?

5. మన దేహంలో ఎక్కువ పొడవైన ఎముక ఏదో చెప్పగలరా?

6. చైనాకి, మన దేశానికి మధ్య అడ్డు గీతగా ఒక అంతర్జాతీయ సరిహద్దు రేఖ వుంది. ఈ రేఖవల్ల వచ్చిన వివాదాల మూలంగానే మన వుభయ దేశాలకూ మనస్పర్థలు ఏర్పడ్డాయి. అయితే ఆ రేఖ పేరేమిటి?

7. మనదేశ సంస్కృతిని, చరిత్రని చాటి చెప్పే గ్రంథాలలో "డిస్కవరీ ఆఫ్ ఇండియా" ఒకటి. ఈ గ్రంథం రచించిన వ్యక్తి ఎవరు?

8. మన జాతీయ పతాకంలో అశోక చక్రం వుందన్న సంగతి మీకందరికీ తెలుసు. అయితే ఆ అశోక చక్రంలో ఎన్ని గీతలు (స్థంబాలు) వున్నాయో చెప్పగలరా?

9. మన రాష్ట్రంలోని ముఖ్య నగరాలలో కూడా ప్రతి సంవత్సరం ఎగ్జిబిషన్లు అనబడే వస్తుప్రదర్శన శాలలు జరుగుతూ వుంటాయి. అయితే ప్రపంచంలో కల్లా అత్యంత అధిక సంఖ్యలో ప్రజలు హాజరైన ఎగ్జిబిషన్ ఏది? ఎంతమంది హాజరయ్యారు?

10. బాడ్మింటన్ ఆట ఏ దేశంలో ప్రారంభించబడిందో చెప్పగలరా?

[సమాధానాలు ఈ సంచికలోనే వున్నాయి. వెతికి మీ సమాధానాలతో సరిపోతాయేమో చూడండి.]

అతని రంగు వెంటనే బయట పడిపోయిందని అనుకుంది నిర్మల. "నో థేంక్స్। ఈ విషయాలు చాలా కాన్ఫిడెన్షియల్‌గా మీకు చెప్పాను. మీ కిష్టం లేకపోతే మీ వాళ్ళతో చెప్పనక్కర్లేదు. మీరెంతో మంది పిల్లల్ని చూస్తున్నారు. మీకు నచ్చిన పిల్లని మీరు నిరభ్యంతరంగా చేసుకోవచ్చు. శలవు।" అని చటుక్కున అక్కడ్నించి లేచిపోయింది.

కళతగ్గి ఎర్రబడిన ఆమె ముఖం చూసి ఏదో వాదన జరిగిందని మాధవి ఊహించింది కాని ఎంత అడిగినా ఆమె చెప్పలేదు........నిర్మల ఊహించినట్లుగానే ఊరికి వెళ్ళాక ఉత్తరం వ్రాస్తామన్నారు పెళ్ళివారు।

ఎంతో ఆశాజనకంగా దాదాపు సంబంధం కుదిరిపోయినట్టేనని రామచంద్రం చెప్పి వెళ్ళారు కాని... పదిహేను రోజులు పోయాక మరేకారణం చేతనో వాళ్ళింకో సంబంధం నిశ్చయం చేసుకున్నారని ఎంతో బాధపడుతూ అతనే ఉత్తరం వ్రాసాడు.

అలా జరిగినందుకు ఆ యింట్లో నిరుత్సాహపడనిది నిర్మల ఒక్కతే।

## 44

వస్తానన్న రోజుకి కృష్ణవేణి రాలేదు సరికదా పదిహేను రోజుల దాకా ఉత్తరం కూడా రాలేదు. మాధవి రెండుత్తరాలు వ్రాసాక కృష్ణవేణి నుంచి జవాబు వచ్చింది. రాకరాక యిన్నాళ్ళకి వచ్చింది కదాని వాళ్ళవాళ్ళుండమన్నారని త్వరలో నే వస్తానని వ్రాసింది. ఉత్తరం చాలా క్లుప్తంగా ఉంది. నిర్మలకి పెళ్ళిచూపులు జరిగిన వైనం వ్రాస్తే అసలా ప్రస్తావనే ఆమె యెత్తలేదు.... మాధవికి చాలా నిరుత్సాహం కలిగించింది ఆమె ఉత్తరం।

"....అక్కయ్య ఎప్పుడు వస్తుందో తెలియటం లేదు. తను మనల్ని వదలి యింతకాలం ఉండలేదు. అక్కడేమయినా జరగలేదు కదా! నాకెందుకో భయంగా ఉంది।" అంది మాధవి.

నిర్మల మనస్సులోనూ అదే శంక. ఆ మాట పైకంటే మాధవి మరింత కంగారుపడుతుందని పైకి ధైర్యం తెచ్చుకొని "త్వరలోనే వస్తానని ఉత్తరం వ్రాసిందికదా! వస్తుందిలే!....పోనీ, అక్కడున్నంత కాలమయినా మనశ్శాంతితో ఉంటుంది" అంది.

ఇరవై రోజులుగా విశ్వనాథం యింట్లో డబ్బడగలేదు. దాంతో ఇంట్లో వాతావరణం ప్రశాంతంగానే ఉంది. కృష్ణవేణి యింట్లో యిచ్చే నిండుతనం నిండుకుందన్న అసంతృప్తి తప్ప మరే బాధా ఎవ్వరికీ కలగలేదు. నిర్మల ఆఫీసుకి వెడుతూనే ఉంది. మాధవి కాలేజీకి శలవు పొడిగించి ఇల్లంతా తనే చక్కబెట్టుకుంటోంది। కృష్ణవేణి లేని లోటు మాధవి తీరుస్తోందని ఒకటికి రెండుసార్లు పైకే చెప్పుకొని మురిసిపోయింది సుభద్రమ్మ....

ఇదంతా రాబోయే తుఫానుకు ముందు ప్రశాంతత అని ఆ తర్వాత తెలిసింది।

ఒక రోజున విశ్వనాథం మీద మరో క్రొత్త అభియోగం తీసుకువచ్చారు రాఘవరావు. అతనికి తెల్సున్నవాళ్ళ దగ్గర ప్రామిసరీనోటు వ్రాసి డబ్బు పుచ్చుకున్నాడట విశ్వనాథం.

''....ఇవేళ నా పేరు చెప్పి అప్పుచేసాడు. రేప్రొద్దున్న నేనే యిమ్మన్నానని చెప్పి పుచ్చుకుంటాడు. అప్పుడేంచెయ్యాలి?....'' అన్నాడు రాఘవరావు నిష్ఠురంగా.

మామగారి మాటలకి చర్రున కోపం వచ్చింది మురళికి. ''అలాంటిది జరిగితే నాకు చెప్పండి. అన్నయ్య యివ్వాల్సిన డబ్బంతా నేనిస్తాను.''

''నువ్వు నన్నపార్థం చేసుకుంటున్నావు బాబూ! పోయేది నీ డబ్బయినా – నా డబ్బయినా నాకొకటే! విశ్వం యిలా ప్రతీదీ పేకాటలో పెట్టేయటం....బాగా లేదనే నేను చెప్పేది. మనమిలా నోరు మూసుకొని కూర్చుంటే ఏదో రోజున ఆ అప్పులవాళ్ళంతా ఇంటి మీదకి వచ్చి పడతారు. అప్పుడు బాధపడి ప్రయోజనం ఉండదు.''

''మీరు చెప్పదల్చుకున్నదేమిటి? మమ్మల్నిప్పుడు తగవులాడుకొని విడిపొమ్మంటారా?''

''తగవులాడుకోమని నేనటం లేదయ్యా! మీ అన్నయ్యా బాధ్యత గుర్తించేలా చెయ్యాలంటున్నాను. అందుకేదోటి చెయ్యక తప్పదు. విడిగా ఉండటమంటే ఇల్లువిడిచి పొమ్మనికాదు. ఇంట్లోనే కొన్నాళ్ళపాటు విడివిడిగా వంటా అదీ పెట్టుకోవటం....ఎవరి ఆదాయాలు వాళ్ళు చూసుకోవటం. ఎవరి ఖర్చులు వాళ్ళు భరించటం....పెద్దవాళ్ళ బాధ్యత అదీ పంచి పుచ్చుకోవటం....అలాంటిదేదో చేయటం అవసరం....''

ఇలా మాట మీద మాటగా అల్లుడు, మామల మధ్య వాదన పెరిగింది. తనని చదివించి అన్నయ్య ఎంతో త్యాగం చేసాడని మురళి.... అప్పుడతని త్యాగానికో అర్థమూ పరమార్థమూ ఉన్నాయి కాని........'ఇప్పుడు నీ త్యాగానికి ప్రయోజనమేమీ లేద'ని రాఘవరావు. అనుకోకుండా వాళ్ళ గొంతులు పెద్దవయ్యాయి.

''ఏమిటండీ బావగారూ!'' అంటూ వచ్చారు సత్యనారాయణగారు.

ఎవరూ వెంటనే మాట్లాడలేదు. ఆయన రెట్టించి అడిగేసరికి మురళివైపు చూసాడు రాఘవరావు.

''ఆ పుణ్యం కూడా మీరే కట్టుకోండి....'' అని విసురుగా అక్కడ్నించి వెళ్ళిపోయాడు మురళి.

''ఎందుకులెండి బావగారూ! మంచి చేద్దామని వచ్చి చిచ్చుపెట్టానన్నవాదు నాకెందుకు?'' అంటూ వెళ్ళిపోబోయాడు రాఘవరావు.

సత్యనారాయణగారు అతని చెయ్యి పట్టుకొని అపి సంగతేమిటని బలవంతం చేసి గ్రుచ్చిగ్రుచ్చి అడిగాడు. రాఘవరావుకిక చెప్పక తప్పలేదు.

సత్యనారాయణగారేకాదు...అప్పుడే అక్కడికి వచ్చిన సుభద్రమ్మ కూడా అంతావింది. అన్నాళ్లుగా కృష్ణవేణి ముఖంలో కళ తగ్గి వుండటానికి కారణమేమిటో వాళ్ళకి తెల్సింది. ఇంతకాలం ఈ నిప్పుని గుండెలో పెట్టుకున్న చిన్నవాళ్ళ నిబ్బరానికి అబ్బురపడ్డారు. 'బంగారు తండ్రి' అనుకున్న కొడుకు వ్యసనానికి బలి అయినందుకు వాళ్ళ గుండెలవిసిపోయాయి. నవనాడులు క్రుంగిపోయాయి.

సుభద్రమ్మ మౌనంగా ఏడుస్తూనే ఉంది. సత్యనారాయణగారికి ఆమె నోదార్చేందుకు నోరు విప్పే శక్తి కూడా లేకపోయింది. మాట కన్న ముందు ఆయనకు దుఃఖం వచ్చేలా ఉంది! ఆవేళ యింట్లో మనుషుల అడుగుల చప్పుడు తప్ప మాటలే కరువయిపోయాయి....

''అంతా అలా ఉన్నారేమిటి వదినా!'' అన్న మరది రవి ప్రశ్నకి జవాబు ఏమని చెప్పాలో తెలియక బలహీనంగా నవ్వింది మాధవి. అతని చదువు విషయం ఎత్తి సంభాషణ మరోవైపు త్రిప్పింది.

ఆ మర్నాడు ప్రొద్దున్న అన్నగారి గదిలోకి వెళ్ళి ఫలానా ఆయన దగ్గర నోటు వ్రాసి డబ్బు తీసుకున్న విషయం నిజమేనా—అని అడిగాడు మురళి.

తమ్ముడి ప్రశ్న కన్న ముఖంలోని తీవ్రత చూసి విశ్వనాథం గతుక్కుమన్నాడు. ''అవును రా! అవసరం వచ్చి....'' అని నసిగి తల త్రిప్పుకున్నాడు.

"అంత అవసరం వస్తే నన్నడక్కపోయావా? వాళ్ళదగ్గరా వీళ్ళదగ్గరా అప్పు తీసుకుని మాట పడటమెందుకు?''

ముఖం చిట్లించాడు విశ్వనాథం. ''ఇప్పుడెవరేమన్నారు? ఏం మీ మామగారు కంప్లయింట్ చేశారా?''

''మనం లోకువయితే ఎన్నయినా అంటారు! ఎవరయినా అంటారు.''

''నేనేం చేబదులు తీసుకోలేదు ఎగగొట్టటానికి. నోటు రాసిచ్చాను. వడ్డీతోసహా మొహాన పదేస్తాను....'' అంటూ విసురుగా స్నానానికని దొడ్లోకి పోయాడు విశ్వనాథం.

మురళికి మనస్సంతా కరిగిపోయింది. వెళ్ళి మంచం మీద పడుకున్నాడు.

విశ్వనాథం భోజనం చేసి వెళ్ళిపోయాక భర్తని పిలిచింది మాధవి. ఇంటి పనులతో అలసిపోయిన భార్య ముఖం చూశాడు మురళి. అతని మనసు ద్రవించింది. ఇంట్లో యిన్ని వ్యథలున్నా యిన్ని గొడవలు జరుగుతున్నా నోరెత్తదు. ఓర్పులో వదినగార్ని మించిపోయింది. వదిన అన్నట్లు ఈ 'బంగారు తల్లి' దొరికినందుకు తను సంతోషించాలా? ఈ 'దేవత'ని కష్టపెడుతున్నందుకు తను బాధపడాలా? అతనికి కళ్ళ నీళ్ళు వచ్చాయి. ''నువ్వీఇంటికి సుఖపడటానికి రాలేదు మధూ! అందుకే ఆనాడే చెప్పాను నన్ను పెళ్ళి చేసుకోవద్దని. నిన్ను నేను సుఖపెట్టలేనని!...." అన్నాడు చేతులతో ముఖం కప్పుకుంటూ.

అతని ప్రక్కనే మంచం మీద కూర్చుంది మాధవి. ''మీరెందు కింతగా బాధపడతారు! ఇప్పుడేమయిందని!''

''నిన్ను బాధ పెడుతున్నానని నాకూ తెలుసు. నువ్వు కష్టపడి సంపాదించేది కూడా వృధా అవుతోందని నాకు తెలియకకాదు. మీ నాన్నగారు మాటిమాటికీ ఆ మాట చెప్పనక్కర్లేదు. కాని, నేనేం చేయను? కావాలని నేనిదంతా కొని తెచ్చుకుంటున్నానా? నేనేం చేస్తే అన్నయ్య మారతాడు? విడివిడిగా వంటలు పెట్టుకోమంటారు. విడివిడిగా ఖర్చులు చూసుకోమంటారు. మీ రిద్దరూ తగవులాడుకుంటుంటే— ఒకళ్ళపొడ ఒకళ్ళకి గిట్టకపోతే అలా చేయటానికి అర్థం ఉంది. వదినంటే ప్రాణం యిస్తావు నువ్వు. నువ్వంటే వదినకి పంచప్రాణాలు. తోడ బుట్టినవాళ్ళకంటె ఎక్కువ అన్యోన్యంగా ఉండే మిమ్మల్ని విడదీయనా? అసలు వదిన మన కళ్ళముందు విడిపోయి బాధపడుతూవుంటే మనం చూస్తూ భరించగలమా? నేను ఎలాగో భరిస్తాను. నువ్వుండగలవా చెప్పు!....''

"నాన్నగారేవో అన్నారు. అవన్నీ మీరెందుకు పట్టించుకుంటారు? నేనా మాట అనుకుంటే– అంటే అప్పుడు మీరు బాధపడాల్సింది. ఇప్పుడవేవీ ఆలోచించకండి. అన్నానికి రండి. ఆఫీసుకి వేళవుతోంది.''

[సశేషం]

## మన దేవాలయాలు:



# ప్రభాస క్షేత్రం



"తొలిసారిగా సాహితీలత పల్లవించిందీ, సంస్కృతీ ప్రసూనాలు దివ్యపరిమళంతో వికసించిందీ మన పుణ్యభూమిలోనే. హైందవ ఆచార సంప్రదాయాలు చాలా ప్రాచీనమైనవి. కాని నిత్య నూతనమైనవి"—అంటూ ఆనందంతో మురిసిపోయే హరిదాసులు, భాగవతార్‌లూ అక్కడక్కడా తారసపడుతూ వుంటారు. కానీ ఆ సంస్కృతీ పరిమళాలు గుబాళించినకాలం ఏది?—అంటే మాత్రం దిక్కులు చూస్తారు. లేదా, 'సత్యప్రధానమైనది మన మతం. కాలంతో దానికి ప్రమేయం లేదు. అది సనాతనధర్మం'—అంటూ పలాయన వాదం పఠించడానికి ప్రయత్నిస్తారు.

దీనికి కారణం మన పూర్వీకులకు చారిత్రక దృష్టి లోపించడమే అనిపిస్తుంది. ఉజ్జ్వలమైన గత చరిత్ర వున్నప్పటికీ, దానిని తెలుసుకోలేని పాతకం చేసిన జాతి భారతజాతి. మన దేవాలయాల స్థితి కూడా ఇంచుమించు ఇదే కథ!

ఈ దుస్థితికి పూర్తిగా విరుద్ధమైన దేవాలయం ఒకటి వుంది!

ఈ ఆలయ కవాటాల ద్వారానే దేశచరిత్ర కొత్త మలుపులు తిరిగింది!

ఈ గుడిలోని ప్రతి అడుగూ చరిత్రకు పాఠం చెబుతుంది!

ఈ ప్రాంతంలో కనబడే శిథిలశిల్పాలు మతోన్మాదంతో చరిత్ర చెక్కిన శిలాశాసనాలు! ఈ దేవాలయంలోని ఒక్కొక్క మెట్టూ, పుట్టెడు అనుభవ సత్యాలను మౌనంగా ఆలపిస్తాయి!

జాతి చరిత్రలో అద్వితీయస్థానం ఆక్రమించుకున్న ఆ ఆలయం పశ్చిమ సముద్రతీరంలో వున్న గుజరాత్ రాష్ట్రంలోని 'ప్రభాస పట్టణం' పేరుతో ప్రసిద్ధి గాంచిన సోమనాథ ఆలయం!

'కాలాగ్ని రుద్రుడు'గా వేదాలు ఘోషించే ఇక్కడి స్వయంభువలింగం ఒక్కొక్క కల్పంలో ఒక్కొక్క పేరుతో పిలువబడుతుందిట!

దక్షుని ఇరవైయేడుమంది పుత్రికలను చంద్రుడు పెళ్ళాడాడు. భార్య లందరినీ సమానంగా చూసుకోడానికి బదులు చంద్రుడు, 'రోహిణి' మీదే ఎక్కువ మక్కువ చూపసాగాడు. ఈ పక్షపాత వైఖరిని ఎన్నోసార్లు విమర్శించి దక్షుడు మందలించినా అతను లెక్కచేయలేదు. అందువల్ల కోపించి "యౌవన గర్వంతో కన్నూ మిన్నూ తెలియకుండా నీతి బాహ్యంగా ప్రవర్తించే నీవు నానాటికి కృశింపజేసే క్షయరోగపీడితుడవుకమ్ము" అని శపించాడు దక్షుడు. ఈ దారుణమైన రోగం నుంచి కాపాడడానికి సర్వలోకైక రక్షకుడైన ఈశ్వరుడే సమర్థుడని భావించి—పశ్చిమ సముద్రతీరం చేరి అక్కడి స్పర్శలింగానికి నియమనిష్ఠలతో పూజా పునస్కారాలు చేస్తూ నాలుగువేల సంవత్సరాలు చంద్రుడు తపస్సు చేశాడట. చంద్రుని పశ్చాత్తాపానికి, భక్తి నిరతికీ, సంతసించి భక్త వశంకరుడైన శంకరుడు సంపూర్ణ ఆరోగ్యం, ప్రకాశం ప్రసాదించాడట. నాటి నుంచి ఆ దివ్యస్థలం "ప్రభాస క్షేత్రం." ఇక్కడి శివుడు సోమనాథుడు - అయ్యాడట. ఇది స్కాంద పురాణంలోని 'ప్రభాసకాండ' కథనం!

లోకమాతయైన 'ఉమా' దేవిసహితుడు కాబట్టి 'సోమనాథుడు' అని కొందరి ఊహ!

'అగ్ని సోమాత్మకం విశ్వం'-అంటే నిప్పూ, నీరూ కలయికే విశ్వం. ఈ రెంటికీ అతీతమైన వస్తువు ప్రపంచంలో ఏదీ లేదు. రుద్రమూర్తియైన 'శివుడు' అగ్నికీ, అమృత స్వరూపిణియైన 'శక్తి' చల్లదనానికీ సంకేతాలు. విశ్వానికంతా ఆధారంగా వుంటూ, అదే సమయంలో విశ్వాతీతంగా వుండే దివ్యశక్తిని సూచించడమే సోమనాథతత్త్వం. ఇది తత్త్వవేత్తల వ్యాఖ్యానం!

పాండవ మధ్యముడైన అర్జునుడు, తీర్థయాత్రా సమయంలో సుభద్రను చూసి ప్రేమించి మాయాత్రిదండిగా మారి, శ్రీకృష్ణుని సహాయంతో ఆమెను పరిణయమాడిన ప్రాంతం ఇదేనట - ఇది భారతంలోని సుభద్రాకల్యాణ ఉదంతం!

పుట్టినకార్యం పూర్తి చేసుకుని శ్రీ కృష్ణ పరమాత్మ తన అవతారం చాలించిన పుణ్యప్రదేశం



కూడా ఇదేనట. ఇది గుర్తు చేస్తూ-బాణంతో గాయపడిన పాదంతో కృష్ణవిగ్రహం 'భాలక్ తీర్థం' వద్ద ప్రతిష్ఠింపబడి వుంది.

పురాణపురుషులకు, ఇతిహాసపాత్రలకు మాత్రమే కాకుండా సిద్ధపురుషులకు, యోగిపుంగవులకు కూడా మనోరథసిద్ధి కల్గించిన పుణ్యక్షేత్రంగా పెద్దలు దీనిని విశ్వసిస్తారు.

శైవసిద్ధాంతంలో ప్రసిద్ధిగాంచినది 'పాశుపత శాఖ'. దీనిని స్థాపించి ప్రచారం చేసిన లకులీశుడనే ఆచార్యుడు 'ప్రభాసపట్టణ' వాస్తవ్యుడట. క్రీ. శ. 380 సం॥ రెండవ చంద్రగుప్తుడు మధురలో నెలకొల్పిన స్తంభం మీది శాసనాలవల్ల - పాశుపత ఆచారప్రచారానికి ప్రథమ పీఠంగా సోమనాథ ఆలయం వెలుగొందేదని తెలుస్తూంది.

స్వర్ణాభరణాలను, మణిమయరత్నహారాలను కొల్లగొట్టడానికి గజనీమహమ్మదు 1025 సం॥ ప్రాంతంలో పద్దెనిమిదిసార్లు ఈ ఆలయం మీద దండయాత్ర చేశాడు. కాని వెనువెంటనే గుజరాత్, మాళ్వ దేశాధిపతులైన భీమభోజులు ఆలయ పునర్నిర్మాణం చేశారు. ఆ తర్వాత సిద్ధరాజు, జయసింహుడు, కుమారపాలుడు - ఈ ఆలయ పునరుద్ధరణకు ఎంతో కృషి చేశారు. గంభీరమైన సోమనాథ ఆలయంతో పాటు ఈ ప్రాంతంలోనే మరో ఐదు శైవ మందిరాలను నిర్మించడానికి కృషి చేశాడు-త్రిపురాంతకుడనే పాశుపతాచార్యుడే.

క్రీ.శ. 1300 సం॥లో అల్లావుద్దీన్ ఖిల్జీ రాజ్యదాహానికి గురియై నేలమట్టమయిన ఈ ఆలయం మహీపాలునిచే మళ్ళీ నిర్మింపబడింది. 1390 వ సం॥లో మొదటి ముజాఫర్ షా ముట్టడికి, 1490 సం॥లో మహమ్మదు దండయాత్రకు, 1530 సం॥లో రెండవ ముజాఫర్ రాజ్యకాంక్షకు - లోనైన ఈ ఆలయం 1701 లో ఔరంగజేబు ద్వేషాగ్నికి ఆహుతైంది. ఐనా మళ్ళీ మళ్ళీ ఈ ఆలయ నిర్మాణం జరుగుతూనే వచ్చింది. ఆఖరుగా 1783 వ సం॥లో రాణి అహల్యాబాయి నూతన ఆలయాన్ని నిర్మించారు.

హైందవ సామ్రాజ్యసాగర తరంగాలకు అనుగుణంగా వృద్ధిక్షయాలు అనుభవించిన ఈ ఆలయ పునరుద్ధరణ భారం - తర్వాత భారత ప్రభుత్వం చేపట్టింది.

నూటఏభై అయిదు అడుగుల గోపుర శిఖరంతో వెలుగొందే ఈ ఆలయంలో చారిత్రక వైశిష్ట్యం, పౌరాణిక ప్రాముఖ్యం, పవిత్రత గల 'బ్రహ్మశిల' మీద - 1951 సం॥ నాటి రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్ 'జ్యోతిర్లింగ' ప్రతిష్ఠ చేశారు.

భారతదేశంలోని ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఇది ప్రప్రథమమైనది. ఇక్కడ రోజూ ఉదయం ఏడు గంటలకు, రాత్రి తొమ్మిది గంటలకు ప్రత్యేకంగా హారతి ఇస్తుంటారు. లింగానికి వెనుక భాగంలో సుమారు ఎనిమిది అడుగుల ఎత్తుతో జగదీశ్వరి పాలరాతి విగ్రహం వుంది. ఈ ఆలయంలో రోజూ నాలుగు గంటలసేపు క్షీరాభిషేకం జరుగుతుంది. ఇక్కడి శివునికి పువ్వులు, పత్రి, తప్ప కొబ్బరికాయ నివేదించరు!

ఈ ఆలయానికి ఎదురుగా ప్రాచీన సోమనాథ ఆలయం వుంది. ధూపదీపనైవేద్యాలు జరగనప్పటికీ ఇక్కడ ఇరవైనాలుగు గంటలూ అఖండ జ్యోతి వెలగడం ఒక విశేషాంశం.

[ఈ వ్యాస రచనకు కొంత సమాచారం - ఛాయా చిత్రాలు అందజేసిన శ్రీమతి మనర్ల జయా గణపతికి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాము. —వ. సం]

పాఠకులకు:

## 'చిత్ర కథా పోటీ'

ఇక్కడ ఒక చిత్రం వుంది. ఆ చిత్రానికి తగ్గట్టుగా మీరొక కథ అల్లగలరా? ఆ కథ సీరియస్‌గానైనా, హాస్యంగానైనా ఎలాగైనా ఉండొచ్చు. వచ్చిన కథల్లో ఏది బాగుందని అనిపిస్తే ఆ కథ పంపిన వారికి - ఉపయోగపడే 'చక్కని బహుమతి'ని పంపిస్తాము. అయితే, కథ ఎట్టి పరిస్థితిలోనూ రెండు ఠావు పేజీలకు మించకూడదు. కథలు డిసెంబరు 5వ తేదీలోగా మాకు చేరేలా పంపాలి. పంపే కవరు మీద - పైన 'చిత్ర కథ' అని రాసి, 'వనిత' చిరునామా రాయాలి. అలాగే, లోపల కూడా 'చిత్ర కథ' అని రాసి - పంపిన వారి పేరు, చిరునామా రాయాలి.

**గెలుపొందిన కథ జనవరి సంచికలో:**



# భాషలు నేర్చుకోండి

| తెలుగు | తమిళం | కన్నడం | మలయాళం | మరాఠి | గుజరాతి | ఒరియా |
|---|---|---|---|---|---|---|
| గ | | ಗ | ഗ | ग | ગ | ଗ |
| గా | | ಗಾ | ഗാ | गा | ગા | ଗା |
| గి | | ಗಿ | ഗി | गि | ગિ | ଗି |
| గీ | | ಗೀ | ഗീ | गी | ગી | ଗୀ |
| గు | | ಗು | ഗു | गु | ગુ | ଗୁ |
| గూ | | ಗೂ | ഗൂ | गू | ગૂ | ଗୂ |
| గృ | | ಗೃ | ഗൃ | गृ | ગૃ | ଗୃ |
| గౄ | | — | — | — | — | — |
| గె | | ಗೆ | ഗെ | — | — | — |
| గే | | ಗೇ | ഗേ | गे | ગે | ଗେ |
| గై | | ಗೈ | ഗൈ | गै | ગૈ | ଗୈ |
| గొ | | ಗೊ | ഗൊ | — | — | — |
| గో | | ಗೋ | ഗോ | गो | ગો | ଗୋ |
| గౌ | | ಗೌ | ഗൌ | गौ | ગૌ | ଗୌ |
| గం | | ಗಂ | ഗം | गं | ગં | ଗଂ |
| గః | | ಗಃ | ഗഃ | गः | ગઃ | ଗଃ |

* తమిళంలో మన క ఖ గ ఘ లకు–ఒకే అక్షరం (க) వాడతారు.

[వచ్చే సంచికలో మరికొన్ని]

# బొమ్మగారి పేజీ

"బొమ్మగారూ! ఇంట్లో చాలామంది జంతువుల్ని, పిట్టల్ని పెంచుతూ వుంటారు. కాని, అలా పెంచ కూడదని, పెంచడం పాపం అనీ, పైగా వాటివల్ల మనుషులకు కీడు కలుగుతుందనీ, ఒకాయన చెప్పారు. ఇది నిజమేనంటారా?" అని పర్లాకిమిడి నుంచి శ్యామలాదేవిగారు ఒక ఉత్తరం రాశారర్రా. దీనికి సమాధానంగా ఒక్క ముక్కలో చెప్పడం కంటె, కాస్త విపులంగా వ్యాసంలాగా రాస్తేనే బావుంటుందనిపించింది నాకు.

అసలూ—

మనం అన్నిరకాల జంతువుల్నీ, పిట్టల్నీ పెంచుకోలేం. వాటిల్లో కొన్ని మాత్రమే మనుషులతో నేస్తం కలుపుకుంటాయి. చిలకను పెంచినట్టుగా కాకిని పెంచగలమా! కుక్కను పెంచినట్టుగా నక్కను పెంచగలమా!....

గుర్రాలూ, గాడిదలూ, ఒంటెలూ, ఎద్దులూ మొదలైనవి సవారీకని, రవాణాకనీ పనికొస్తాయి కాబట్టి వాటిని పెంచుతాము. పెంచడం అంటే ఏమిటి....వాటికి మేత వేస్తూ, వాటిని అదుపులో పెట్టుకుని, మన పనికి ఉపయోగించుకుంటున్నామన్న మాట. ఆవులూ గేదెలూ పాలు ఇస్తాయి గనక, పాలకోసం పెరట్లో పెంచుకుంటాము. మరి, తినేవాళ్ళు మేకల్నీ, పందుల్నీ, కోళ్ళనీ పెంచుతారు. ఇలా వాటి ఉపకారం మనకి వుండడం వల్ల వాటిని పెంచుతున్నాము.

ఇవి కాకుండా పెంపుడు జంతువుల్లో ముఖ్యమైనది—కుక్క. కుక్కవల్ల మనకి ఉపకారం (ఇల్లుకాయడం) వున్నా—అది మనిషికి చేరువైనట్టుగా ఇంకో జంతువు చేరువ కాదు. దానికి విశ్వాసం ఎక్కువ. తిండి పెట్టిన వాళ్ళను అది కంటిని రెప్ప కాసినట్టు-కాస్తుంది. అందుకే—"కుక్క—మనిషికి మంచి నేస్తం" అన్నారు. కొందరు పిల్లుల్ని పెంచుతారు — సరదాకోసం. అలాగే చెవుల పిల్లుల్నీ, లేళ్ళనీ కూడా కొందరు పెంచుతారు. ఇవి సాధు జంతువులు గనక-సరదాగా పెంచుకోడం కోసం అన్నమాట.

పిట్టల్లో రామచిలకల్నీ, గోరువంకల్నీ, పావురాల్నీ పెంచుతాము. అయితే, అవి ఎగిరి పోతాయని, వాటిని పంజరాల్లో పెడతాము. అలా పంజరాల్లో పెట్టి పెంచడం తప్పు అని, పాపం అనీ పెద్దలన్నారు. విచ్చలవిడిగా వుండేట్టుగా పెంచడం కుదరదు గనక వాటిని న్యాయంగా పెంచకూడదు. అయితే-పావురాల్ని పంజరాల్లో పెట్టనక్కర్లేదు. రెక్కలు రాకముందే తెచ్చి పెరట్లోనో, మేడమీదనో ఎక్కడో వుంచితే అది ఆ పరిసరాలకి అలవాటు పడిపోతుంది. ఎక్కడికైనా వెళ్ళినా సాయంకాలానికల్లా పావురాలు గూటికి తిరిగి వచ్చేస్తాయి. వాటిని పిలిస్తే వస్తాయి. పట్టుకుంటే దొరుకుతాయి. మచ్చికయిన మనుషుల దగ్గర భయపడకుండా వుంటాయి. అంచేత, పావురాల్ని పెంచడంలో 'పాపం' అడ్డంరాదు!

పిల్లిని చాలామంది పెంచరు. ఎంచేతంటే, దానికి దొంగ గుణం వుంది. ఎంతో ప్రేమగా పెంచినా, అది దొంగతనంగా వెళ్ళి పాలు తాగేయవచ్చును. పైగా, ఈ మధ్య చెప్పుకున్నాం చూడండి - పిల్లి గురించి - దాన్ని చంపితే 'మహా పాపం' అని పెద్దలన్నారని! అంచేత, పొరపాటున మన చేతి విసురుకో దెబ్బకో అది చచ్చిపోతే - పాపం అంటుకుంటుందన్న భయంతో కూడా పిల్లుల్ని చాలామంది పెంచరు. కాని, దానికీ మనుషులతో మచ్చిక అయే గుణం వుంది.

ఇలా చూసుకున్నప్పుడు—

పెంపుడు జంతువుల్లో ముఖ్యమైనది కుక్క. ఎలాగూ సందర్భం వచ్చింది గనక - కుక్కల్ని పెంచడంలో ఇబ్బందులేమిటి - మంచేమిటి - అన్నది చెబుతాను.

కుక్కలు వున్నంత కాలం బాగానే వుంటాయి గాని, వాటికి ఎప్పుడైనా పిచ్చి ఎత్తవచ్చును. పిచ్చి కుక్క కరవడం ప్రాణాపాయం! అంచేత, వాటికి పిచ్చి ఎత్తకుండా చిన్నప్పుడే ఇంజెక్షన్లు ఇప్పించాలి. ఇంజెక్షను ఇవ్వకుండా కుక్కను పెంచడం అపాయమేనట!

మరి, వాటికి ఇష్టమైన ఆహారం ఇవ్వడం, అప్పుడప్పుడు స్నానం చేయించడం, డాక్టరుకి చూపించడం—మొదలైనవన్నీ చేస్తూ వుండాలి. కుక్కకి శత్రువులల్లా పేలు, కొణుజులూనూ. ఇవి కుక్కల్ని పట్టి పీడిస్తాయి. ఈ సమస్య మన దేశంలోనే కాదు - ప్రపంచంలో వున్న అన్ని దేశాల్లోనూ వుందిట! ఈ పేలు, పురుగులూ కుక్కల మీదనే నివాసాలు ఏర్పాటు చేసుకుని, ఆకలి వేసినప్పుడల్లా వాటి రక్తం తాగేస్తూ వుంటాయి. ఆ సమయంలో కుక్కలు కొణుజు వున్న చోట కోపంగా కొరికేసుకోడం, ఆ మూలంగా అక్కడ గాయం ఏర్పడడం-జరుగుతూ వుంటాయి. అంచేత, వాటికి తగ్గ మందుల్ని వేస్తూ, ఎప్పటికప్పుడు పేలు అవీ తీసేస్తూ వుండాలి. లేకపోతే, కుక్కల ఆరోగ్యం బాగుండదు!

అలవాటు చేస్తే, కుక్కలకీ మంచి అలవాట్లు ఎన్నో ఏర్పడతాయి. కాస్త ఓపిగ్గా, వాటిచేత అలవాటు చేయించాలి — అంతే!

'కుక్క విశ్వాసముగల జంతువు' అన్నట్టుగా-దానికున్నంత విశ్వాసం మనిషికే వుండదు! ఈ మధ్య పత్రికలో వచ్చిందని మా మనమడు ఒక వార్త చెప్పాడర్రా—

అదేదో దేశంలో, ఒకతను తన కుక్కను తీసుకుని విమానంలో వెళ్ళడానికి వచ్చాట్ట. అయితే, విమానాశ్రయంలోని అధికారులు కుక్క మీద ఏవో ఆంక్షలు పెట్టి దాన్ని తీసుకెళ్ళడానికి వీల్లేదన్నారు. అతనికి వెళ్ళక తప్పదు గనక, కుక్కను విడిచి పెట్టేసి, విమానంలో వెళ్ళిపోయాడు. అయితే, ఆ కుక్క తిరిగి వెళ్ళిపోలేదుట; అసలు ఎక్కడికీ వెళ్ళలేదట - అక్కడే దాని యజమాని కోసమే అలా ఎన్నో రోజులు కూచుని వున్నదట. అతను ఎక్కిన విమానం గుర్తు పెట్టుకుని, ఆ విమానం తిరిగి వచ్చినప్పుడల్లా, గభాలున లేచి వెళ్ళి చూసి - అతను రాకపోవడంతో నిరాశ చెంది, తిరిగి వెళ్ళి దాని చోటనే పడుకుంటోందిట!....చూశారర్రా.... ఎంతటి స్వామి భక్తో వాటికి! అలాగే - ఈ మధ్య ఇంకో విశేషం కూడా చెప్పుకున్నారు. జపాన్ దేశంలో కాబోలు - యజమాని చచ్చిపోయాడని, ఇంట్లో వున్న రెండు కుక్కలూ అన్నాహారాలు మానేసి, తామూ మరో నాలుగు రోజుల్లో మరణించాయట!

ఇలాంటి విశేషాలు ఎన్నో వింటూనే వుంటాం; చూస్తూనే వుంటాం. అంచేత - నేను చెప్పేదేమిటంటే, 'పెంపుడు జంతువులు' అని కొన్ని వుంటాయి చూడండి - వాటిని సులభంగా పెంచవచ్చును - మన ఓపిక! అయితే పెంచకూడదు, పెంచితే పాపంట - అన్నవి మాత్రం వట్టి మాటలు! పెంచగలిగే ధైర్యం, స్తోమత, ఓపిక వుంటే — ఏనుగుల్నీ, సింహాల్నీ కూడా పెంచవచ్చు! కదర్రా మరి!

# ప్రశ్నలకు జవాబులు

**యస్. అనంత, మద్రాసు**

బామ్మగారూ దిష్టి తియ్యడానికి నిమ్మకాయను ఉపయోగిస్తారు. ఎందుకని? కాయలు చాలా వున్నా నిమ్మకాయలో 'దిష్టి'కి గల గుణం ఏమిటి?

'దిష్టి తియ్యడం' అన్న విధానం గురించి లోగడ ఒకసారి చెప్పాను. అయితే, నిమ్మ కాయతోనే ఎందుకు తియ్యాలి? - అని అడుగుతున్నారు — బహుశా నిమ్మ పండు రసంలో సర్వరోగనివారణ లక్షణాలుండడం చేత కావచ్చు. అంతేకాకుండా నిమ్మపండును దేవతాలంకరణకు ఉపయోగిస్తారు. మీరు అడిగినట్టుగా పళ్లు ఎన్నో వున్నా-నిమ్మపళ్ళనే మాలగా గుచ్చి దేవీ విగ్రహాల మెడలో ఎందుకు వేస్తారు? అలాగే, మంత్రించి పళ్లు ఇచ్చే వారు కూడా ఎక్కువగా నిమ్మపండునే ఇస్తారు. ఈ విధంగా నిమ్మపండుకు మహత్తు ఏర్పడ్డంతో దాన్ని దిష్టి తియ్యడానికి ఉపయోగిస్తున్నారు.

**యస్. స్వరాజ్యలక్ష్మి, పాలకొల్లు**

ఓ రోజు మాయింట, రెండు చీపుళ్ళు ఒకచోట పెడితే, మా అమ్మ కోప్పడింది—రెండు చీపుళ్లు ఒకచోట పెట్టకూడదని, తానే వెళ్ళి వెంటనే రెండింటినీ దూరదూరంగా పెట్టేసింది. నేను కారణం అడిగాను - దానికి ఆమె ఏమీ చెప్పలేదు. 'పెద్దలు చెప్పారు-అంతే' అంది. మరి, దానికేమైనా కారణం వుందా బామ్మగారూ?

మన ఇళ్ళలో ఒక చీపురును ఇల్లు ఊడ్చ డానికీ, మరో చీపురును కడగడానికీ ఉపయోగిస్తాం గదా. రెండో చీపురును వాకిలి, కాలువలూ కడగడానికి ఉపయోగిస్తాం గనక, అది చాలా మురికిగా వుంటుంది. అలాంటప్పుడు, రెండు చీపుర్లూ ఒకచోట పెడితే, రెండూ మురికి, తడి అయిపోతాయి. ఆరోగ్యరీత్యా రెండింటినీ వేరువేరుగా పెట్టడం ఉత్తమం. ఈ సూత్రాన్ని అందరూ పాటించాలన్న ఉద్దేశంతో అదొక 'నమ్మకం'గా మార్చబడింది అంతే.

**బి. ఏ. లలిత, రాజమండ్రి**

నాకు ఇరవై సంవత్సరాల వయసు. సంవత్సరంగా నాకు జుట్టు ఊడిపోతోంది. దానికి మందార నూనె వ్రాయమని సలహా ఇస్తున్నారు చాలామంది. ఈ సలహాను పాటిస్తే నాకు మేలు కలుగుతుందా? మందార నూనె ఎలా చెయ్యాలో చెబుతారా?

మందార పువ్వులతో నూనె ఎలా చెయ్యాలో, ఇదివరలో నేను విపులంగానే రాశానమ్మా. అది ఏ సంచికలో వచ్చిందో నాకైతే జ్ఞాపకం లేదుగాని — మీరొక్కసారి పాత సంచికలు తిరగెయ్యండి. అయితే, జుట్టు ఊడడంలో రెండు రకాలున్నాయి. ఒకటి, స్నానం చేసేటప్పుడు, తల దువ్వుకున్నప్పుడు, తల తుడుచుకున్నప్పుడు జుట్టు ఊడిపోడం; రెండు — ఒకచోట మొత్తంగా వూడిపోడం. దీన్నే 'పేనుకొరుకుడు' అంటారు. పేను కొరుకుడు ఎక్కువ కావడమే — బట్టతల. దీనికి గురివెంద గింజలు బాగా పనిచేస్తాయి. గురివెంద గింజల్ని మెత్తగా నూరి, చిన్న చిన్న వడియాల్లా పెట్టి, ఎండబెట్టాలి. వాటిని కొబ్బరినూనెలో వేసి, మరగబెట్టి—ఆ నూనెను రోజూ తలకు రాసుకుంటూ వుండాలి. లేదా, గురివెంద గింజల్ని ముద్దలా నూరి, తేనె కలిపి జుట్టు ఊడిన చోట ఆరారా రాస్తూ వుండాలి. ఈ వ్యాధి కాకుండా, మామూలుగా జుట్టు ఊడడం అయితే - మందార పువ్వుల నూనె పనిచేస్తుంది. వారానికోసారి, షీకాయ పొడితో (అందులో మెంతులపొడి, ఉసిరి గింజల పొడి కలిపితే మరీ మంచిది) తల రుద్దుకోవడం, మందార పువ్వుల నూనె వాడడంచేస్తే—జుట్టు ఆరోగ్యంగా వుంటుంది.

**ఆర్. లత, కుప్పం**

కోడిగుడ్డులోని తెల్లసొన ముఖానికి రాసుకుంటే, ముఖం సున్నితంగా వుంటుందని చెబుతున్నారు. నిజమేనా? దానివల్ల ముఖానికి ఏమైనా హాని కలుగుతుందా?

ఏమీ హాని కలగదు సరికదా, ముఖం కాంతివంతంగా వుంటుంది. తెల్లసొనతోపాటు, నిమ్మరసం కూడా కలిపి - ముఖానికి పట్టించి, (కళ్ళ చుట్టూ వదిలేసి) పదిహేను నిమిషాల తర్వాత, పెసరపిండితో ముఖం కడిగేసుకుంటే—ముఖానికి ఎంతో మంచిది!

**భారతి, పుల్లెంల**

'ఆడవారికి కుడికన్ను అదిరితే కీడు, ఎడమకన్ను అదిరితే మేలు' అంటారు. నాకు నెలరోజులుగా కుడికన్ను అదురుతోంది. అందువల్ల మనస్సులో ఏదో చెప్పలేని భయం! నాకేం జరుగుతుందంటారు?

శరీరంలోని సున్నితమైన నరాలు అదరడం అనేది, మనసులో కలిగే ఆందోళన వల్ల— అంటారు వైద్యులు. ఆ విధంగా కంటిదగ్గర నరం అదరడం—ఏదో ఆందోళన, మానసికోద్రేకాలవల్ల కావచ్చు. ఆడవాళ్ళకి సంబంధించి ఎడమభాగంలోనూ, మగవారికయితే కుడిభాగంలోనూ మంచిచెడ్డలకు ప్రాముఖ్యత వుందన్నారు. అందుకనే, సాముద్రికం చెప్పేవాళ్ళు మనకి ఎడమచేతులు; మగవాళ్ళకి కుడిచేతులూ చూస్తారు—ఎడమ భాగం స్త్రీది; కుడిభాగం పురుషుడిదీ అని. అర్ధనారీశ్వరుడిలో వున్న అంతరార్థం కూడా అదే కావచ్చు. అయితే, కళ్ళు అదరడానికీ, శుభాశుభాలు కలగడానికీ శాస్త్రరీత్యా ఏమీ సంబంధం లేదు. అదొక నమ్మకం-అంతే. అయితే—మీరు నెలరోజులుగా అలా కన్ను అదురుతున్నదంటున్నారు గనక — కంటి వైద్యుని సంప్రతించటం మంచిది.

**బి. ఉమాభారతి, మండపేట**

మగవాళ్ళకి తలమీద రెండు సుడులుంటే ఇద్దరు భార్యలు అంటారు. అంటే మొదటి భార్య చనిపోతే, రెండో పెళ్ళి చేసుకుంటాడనా? లేక, ఒకేసారి ఇద్దరు భార్యలున్నట్టా? —

ఇది వట్టి మూఢ నమ్మకం. దీనికి ఆధారాలు లేనేలేవు. అలా అయితే, రెండోపెళ్ళి చేసుకున్న వాళ్ళెంతమంది లేరు? అందరికీ తల మీద సుడులున్నాయంటారా! □

# స్త్రీలకు — హరికథా పాఠశాల

'హరికథ ఒక పెద్ద ఆర్టు, దాన్ని అర్థం చేసుకోవాలంటే - కావాలి యింకా పెద్ద హార్టు' — అని అంటూ వుంటారు.

అంతటి విశాలహృదయాన్ని పామరులకు సైతం కలిగించి-ఈ కళని అందరూ ఆకళింపు చేసుకోడానికి దోహదం చేసిన వ్యక్తి - కీ. శే శ్రీ ఆదిభట్ల నారాయణదాసు!

ఆయన హరికథలకు పిట్టకథలు, జనవాక్యాలు, ఛలోక్తులు జోడించి రమ్యంగా చెబుతూ హరికథకు విశిష్ట ప్రచారం కల్పించారు. ఎప్పుడో ఐదారు వందల సంవత్సరాల క్రితం యక్షగానాల పేరిట గానం చేసేవారు ఈ హరికథలని. అట్టడుగున వున్నవాటిని పైకి తీసి జనరంజకం చేసినందువల్ల నారాయణదాసు 'హరికథా పితామహు' డయ్యారు.

అయితే దాదాపు ముప్పై సంవత్సరాల క్రితం ఆయన మరణించడంతో హరికథకి గల స్థానం క్రమక్రమంగా దిగజారుతూ వచ్చింది.

అసలు హరికథకి ప్రాణం -'ఆట-పాట-మాట అంటారు.' ఈ మూడు అంశాలు ఒక్కరిలోనే ద్యోతకమవ్వాలి. ఐతే, ఇది నేర్పడం, నేర్చుకోవడం కూడా అంత సులభం కాదు. అందుకు ఎంతో పరిశ్రమ, సాధనా అవసరం. నారాయణ దాసుగారి ఫక్కీలో ఇవి నేర్పగల గురువుల సంఖ్య కూడా ఇవాళ తగ్గి పోయింది. ఎక్కడో ఒకరో, యిద్దరో నేర్పగల వారున్నా, నేర్చుకునే శిష్యులు, అందుకు తగ్గ అనుకూల పరిస్థితులు కనబడడం లేదు.

నిజానికి ఇప్పటి భాగవతార్లలో అధిక సంఖ్యాకులు — 'ఆట - పాట - మాట'లనే మూడింటిలో ఏ ఒకటో, రెండో బాగా నేర్చుకుని 'హరికథకులు'గా చలామణీ ఐపోతున్నారుగాని, నారాయణ దాసుగారి హరికథాగాన సంప్రదాయాన్ని నిలబెట్టడం లేదనే చెప్పాలి.

మరో విషయమేమంటే - హరికథకులలో ఎక్కువమంది పురుషులే కాని స్త్రీలు లేరు. మారుతున్న నేటి ఆర్థిక, సాంఘిక పరిస్థితులలో స్వయం సమృద్ధితో గౌరవప్రదమైన జీవితాన్ని ఏ సామాన్య సంసారస్త్రీ ఐనా గడపవలసిన అవసరం ఏర్పడింది.

ఈ రెండు లక్ష్యాలతో - 'శ్రీ సర్వారాయ ఎడ్యుకేషనల్ ట్రస్టు' ఆధ్వర్యంలో స్థాపించబడింది- కపిలేశ్వరపురంలోని శ్రీ సర్వారాయ హరికథా పాఠశాల. ఈ పాఠశాల కేవలం స్త్రీలకనే ప్రత్యేకంగా నిర్వహింపబడటం విశేషం!

1973 లో స్థాపించబడిన ఈ పాఠశాల ప్రధాన

డి. ఉమా మహేశ్వరి



బి. లక్ష్మి





ధర్మకర్తలు - శ్రీ ఎస్. బి. పి. వి. చలపతిరావు, శ్రీ ఎస్. బి. పి. బి. కె. సత్యనారాయణరావు.

ఈ పాఠశాల అభివృద్ధికోసం సత్యనారాయణ రావుగారు, ఆయన సతీమణి శ్రీమతి రాజరాజేశ్వరమ్మ అహర్నిశలూ పాటు బడుతున్నారు.

అసలు 'హరికథ' అంటే ఏమిటి?

'పరమేశ్వర లీలా కథనం ద్వారా, ఆస్తిక్యమును, ధర్మాధర్మాలను, సర్వ జనరంజకంగా, నృత్య, గీత, వాద్యాలతో ఉపన్యసించే ప్రక్రియను 'హరికథ' అంటారు. ఒక్క మాటలో చెప్పాలంటే యిది దృశ్య, కావ్య పురాణ లక్షణాల సమాహారమని చెప్పవచ్చును'—అని చెప్పారు ఈ పాఠశాల పర్యవేక్షకులు శ్రీ గుమ్మలూరు సత్యనారాయణ.

ఈ పాఠశాల ప్రత్యేకత ఏమిటంటే- హరికథాగానానికి అవసరమైన సంగీతం, లయ, అభినయం, సంస్కృత, తెలుగు భాషలూ క్షుణ్ణంగా యిక్కడ నేర్పిస్తారు.

ఆంధ్రప్రదేశ్‌లో హరికథ కోసం ప్రత్యేకించి

ప్రారంభించబడిన ఏకైక పాఠశాల యిదే కావడం మరొక విశేషం.

ప్రస్తుతం ఈ పాఠశాలలో పన్నెండుమంది యువతులు హరికథలో శిక్షణ పొందుతున్నారు.

ఇక్కడ చేరడానికి గల కనీస విద్యార్హత-పదవతరగతిలో వుత్తీర్ణులు కావడం. ఈ కోర్సు నాలుగు సంవత్సరాల పాటు వుంటుంది. శిక్షణ యివ్వడానికి ఒక్కొక్క విభాగానికీ వుపాధ్యాయులు వున్నారు. వీరికి శిక్షణ యిస్తున్నప్పుడు ఆంగికం, వాచకం మీద అధిక శ్రద్ధ చూపడం జరుగుతుంది.







సర్వారాయ హరికథా పాఠశాల ప్రారంభించిన కొత్తల్లో పాఠ్యప్రణాళిక అంటూ ప్రత్యేకించి వుండేదికాదు. ఆ తరువాత సంగీత, నాట్య సాహిత్యాలలో ఏది ఎంతవరకు చెప్పాలి - అని నిర్ణయించడం జరిగింది. త్వరలోనే ఈ నాలుగేళ్ళ కోర్సు, సర్టిఫికేటు కోర్సుగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆమోదాన్ని పొందబోతున్నది.

మరో విశేషమేమిటంటే - ఇక్కడి విద్యార్థినులకు వుచితంగా విద్య నేర్పడమేకాక, వుచిత వసతి, భోజన సదుపాయాలు కూడా ఏర్పాటు చేస్తారు. బోధనాపద్ధతి అంతా గురుకులవాసాన్ని ప్రతిబింబింప జేస్తుంది.

హరికథ చెప్పే భాగవతారులకు ఒక ప్రత్యేకమైన ఆహార్యం వున్నట్లే ఈ పాఠశాలలో శిక్షణ పొందుతున్న భాగవతారిణులకు కూడా ఒక ప్రత్యేకమైన రూపాన్ని కల్పించారు వీరు.

ఆనాటి జక్కులు, పురంధ్రులు వేషధారణకు కొన్ని ఆధునిక మార్పులు చేసి యక్షకన్య రూపం వీరికి యివ్వబడింది.

ఇక్కడి విద్యార్థినులలో కుమారి దాలిపర్తి ఉమామహేశ్వరి, బాదంపూడి లక్ష్మి - తిరుపతి, శ్రీశైలం, యాదగిరిగుట్ట, అన్నవరం, సింహాచలం వంటి దేవాలయాలలో కథా కాలక్షేపాలు చేసి, పలువురి మన్ననలు పొందారు.

వీరి **హరికథా** గానం తిలకించిన రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి వీరిరువురిని ఎంతో ప్రశంసించారు.

వీరి కార్యక్రమాలు, మద్రాసు, హైద్రాబాదు టెలివిజన్‌లలో కూడా ప్రదర్శితమయ్యాయి.

ఉమామహేశ్వరి నాలుగు సంవత్సరాల నుంచి, బాదంపూడి లక్ష్మి రెండున్నర సంవత్సరాల నుంచి ఈ పాఠశాలలో విద్యార్థినులుగా వుంటున్నారు.

" హరికథ నేర్చుకోదలచుకున్న వారికి చక్కటి ఉచ్చారణ, నృత్యం చేయడానికి తగిన శరీరాకృతి వుండాలి. వీటన్నిటికి మించి. నేర్చుకోవాలన్న వుత్సాహం వుండాలి. అయితే మేము యిన్ని సదుపాయాలు కల్పించినా తగిన విద్యార్థినులు రావడం లేదు. హరికథని కూడా స్త్రీలకు ఉపాధి కల్పించే ఒక గౌరవప్రదమైన వృత్తిగా తీర్చిదిద్దాలని మా కోరిక. దీనికి విశిష్టమైన ప్రచారం అవసరం. ఇప్పుడు మా ప్రయత్నానికి, ప్రభుత్వసహాయ సహకారాలు కూడా లభించబోతున్నాయి. కాబట్టి త్వరలోనే మా ఆశయం ఫలిస్తుందనీ, ఆదిభట్ల నారాయణదాసుగారి సంప్రదాయం ఆంధ్రదేశంలో పునరుద్ధరింపబడే రోజు వస్తుందనీ ఆశిస్తున్నాము- " అంటూ తన ఆశాభావాన్ని వ్యక్తం చేశారు శ్రీ సత్యనారాయణ.





# ఆకర్షణీయమైన నూలు దుస్తులు

ఈ వర్ణచిత్రాల్లోని వనితలు ధరించిన సల్వార్ కమీజు, చీరెలు నూలుతో చేసినవే. కాని చూడడానికి ఎంతో ఖరీదైనవిగా అనిపిస్తున్నాయి కదూ! వివిధ వర్ణాలలో చూడ చక్కని డిజైనులు, ప్రింట్లతో రూపొందించిన ఈ దుస్తులు సర్వవేళలా ధరించ డానికి అనువుగా వుంటాయి. వీటి ధర కూడా – ఈ దుస్తుల చక్కదనంతోనూ, నాణ్యతతోనూ పోల్చి చూస్తే ఏమంత ఎక్కువ కాదనిపిస్తుంది. సల్వార్ కమీజుల వెల: రూ. 70 – నుండి 80 వరకూ, ప్రింటెడ్ చీరెలు బ్లవుస్‌తో కలిపి రూ. 70 నుంచి 80 వరకూ వున్నాయి. ఇవి అమ్రపాలి బాటిక్, 115 ఫాంటెన్ ప్లాజా, పాంతియన్‌రోడ్, ఎగ్మూర్, మద్రాసు–8 చిరునామాలో దొరుకుతాయి.

వర్ణచిత్రాలు : సత్యకుమార్

చీరెలు, దుస్తుల డిజైన్స్ : సబితా రాధాక్రిష్ణ



# మీరు బ్యాంకులను సమీపింపలేకున్నారా ?




# స్వవిషయములను చర్చించెదము.

నేడైనా, ఏనాడైనా ఏ ఐ.ఓ.బి. బ్రాంచికైనా వేంచేయండి. అచట మీకు సహాయపడుటకై వేచియున్న పొదుపు సలహాదారులను మీరు కనుగొందురు. వారు మీ కొరకై ఎల్లవేళలా కృషి చేయుదురు.

మీరు ఏమి తెలుసుకొనకోరుచున్నారు ? దీర్ఘ కాల ఆదాయ పథకమునకును, (Permanent Income Plan) విశిష్ట Fixed Deposit నకు గల భేధమువంటి సామాన్య విషయమా ?

మీ మూలధనమును రెండింతలు చేసుకొనుటవంటిది కఠిన విషయమా ? లేక మీకు లభించెడి పన్ను సౌకర్యముల నెట్లు సద్వినియోగపరచుకొనుటవంటి విషయమా ?

మీ ప్రత్యేకావసరములకు తగిన పొదుపు పథకము నేర్పరచుకొనుటవంటి మీ స్వవిషయమా ? మీ ప్రశ్నలన్నింటిని తీసికొని రమ్ము. మీ పొదుపు సలహాదారులు మీకు సరియైన సమాధానములు నిచ్చెదరు. వారు మీ కొరకై ఎల్లప్పుడు కృషి చేయుదురు.

ఐ.ఓ.బి.కి వేంచేయండి. మీకొరకు మావద్ద గొప్ప పథకములు గలవు.

> 1969 నుండి జాతీయ బ్యాంకులన్నింటిలోను అత్యధికమైన 771% పెరుగుదల పొందిన ఐ.ఓ.బి. మీ పట్లగల సన్నిహితాశక్తిని వెల్లడించును.



## ఇండియన్ ఓవర్సీస్ బ్యాంక్

మీ ఔన్నత్యాన్నికోరే ఉత్తమ మిత్రుడు

Sista's-IOB/52/78/Tel




సుజాత సీటు చూసుకుని కూర్చోగానే సినిమా ప్రారంభం ఐంది.

ప్రక్కసీట్లో ఎవరో యువకుడు వచ్చి కూర్చుని ప్రక్కకి తిరిగి సుజాతవైపు చూశాడు.

సీట్లో ఇబ్బందిగా కదిలింది సుజాత!

ఐతే సుజాత భయపడినట్లుగా అతని ప్రవర్తన అసభ్యంగాలేదు.

అతను సినిమాలో లీనమైపోయాడు.

అయినా సుజాత సీటులో ఫ్రీగా కూర్చోలేక పోయింది.

కొంతసేపయిన తర్వాత 'ఛఛ' అంది గట్టిగానే.

"ఏమైందండీ?" అన్నాడు అతను ఇటు తిరిగి.

"సారీ!" అంటూ సీటులోంచి లేచి థియేటర్ వెలుపలికి వచ్చేసింది.

ఆమెకు ఆ సినిమా నచ్చలేదు.

తాను ఏ సంఘటనలనుంచి తప్పించుకుందామను కుంటున్నాదో, అవే ఎదురైనట్లుగా ఉంది సినిమా!

పెళ్ళయిన ఆ హీరో పెళ్ళికాని మరో యిద్దరమ్మాయిలతో, ఒకరికి తెలియకుండా మరొకరితో ప్రేమాయణం సాగిస్తున్నాడు.

జుగుప్స నాపుకోలేక 'ఛ ఛ' అనుకుంటూ పైకి వచ్చేసిందామె.

రిస్ట్‌వాచ్ చూసుకుంది.

పావు తక్కువ ఎనిమిది!

"రిక్షా కావాలమ్మా?" అంటూ రిక్షా వాళ్ళు చుట్టూ మూగారు.

వాళ్ళని తప్పించుంటూ ముందుకి అడుగు వేసింది.

పాదాలు యాంత్రికంగా ముందుకి త్రోవ తీస్తున్నా మనసు మాత్రం వెనుకటి అనుభవాలను నెమరు వేయసాగింది.

సుజాత ఒక ప్రయివేట్ కంపెనీలో స్టెనోగా పని చేస్తోంది.

భర్త రామారావు జూనియర్ కాలేజీలో జువాలజీ లెక్చరర్‌గా పని చేస్తున్నాడు. సుజాత ఏ మాత్రం ఆలస్యంగా వచ్చినా రామారావు ఏదో కామెంట్ చేసేవాడు. ఆ కామెంట్సు స్త్రీల పవిత్రతని, వ్యక్తిత్వాన్ని కించపరిచేట్లుగా ఉండేవి. ముఖ్యంగా ఉద్యోగస్తులైన స్త్రీలను అనుమానించేట్లుగా ఉండేవి. అభిమానవంతురాలైన సుజాతకి సూటీ పోటీ మాటలు భరించలేనివిగా ఉండేవి.

జవాబిచ్చి తగవులాట వేసుకునే తత్త్వం కాదామెది.

"ఉద్యోగం మానేస్తాను" అందో రోజు గంభీరంగా!

"అదేం. ఎందుకూ మానేయడం? నేను నిన్నంటున్నానని అనుకోవద్దు! సాధారణంగా జరిగేవి చెప్పుతున్నానంతే!" అన్నాడు నవ్వుతూ.

సుజాత మళ్ళీ ఆప్రసక్తి తేలేదు.

అలా కామెంట్ చేయడం తప్ప భర్తలో మరో లోపం కనబడలేదు. అంచేత సుజాత ఆ రకమైన జీవితానికి అలవాటు పడడం నేర్చుకుంది. కానీ — కానీ, ఆ రోజు —

నడుస్తున్న సుజాత ఆగిపోయింది అప్రయత్నంగా.

సడన్‌గా అలా ఆగిపోవడంతో ఆమె వెనుకనే వస్తున్న అమ్మాయి సుజాతని ఢీకొనబోయి 'సారీ' అంటూ ప్రక్కనుండి వెళ్ళిపోయింది.

ఆలోచనల్లోంచి తేరుకుని చుట్టూ చూసింది సుజాత!

జంక్షన్ దగ్గరకు వచ్చింది అప్పటికి.

తమ యింటికి వెళ్లాల్సిన రోడ్డువైపు తిరుగుతూ మళ్ళీ గతంలోకి జారిపోయింది.

ఆ రోజు —

కంపెనీలో అడుగు పెడుతూనే ఆరోజు శెలవు అని తెల్సి ఆశ్చర్యపోయింది. బాస్ తల్లి ఢిల్లీ హాస్పిటల్లో చనిపోవడంవల్ల ఆ రోజు శెలవు దినంగా ప్రకటించారనీ, గంట క్రితమే ఆయన ఢిల్లీకి బయలుదేరి వెళ్ళిపోయారనీ తెల్సింది.

ఇంటికి బయలుదేరిందామె.

తన వద్దనున్న డూప్లికేట్‌తో తాళం తెరవబోతూ ఆగిపోయింది.

ద్వారానికి తాళం కప్పలేదు.

బయలుదేరే ముందు తనేకదా తాళం వేసింది!

ఇంట్లో ఎవరైనా దొంగలు దూరారా? ఆ అనుమానం రావడంతోనే తలుపు త్రోసిందామె.

కానీ తలుపు తెర్చుకోలేదు.

కంగారుగా దబదబా తలుపు బాదింది.

"ఎవరది?" లోపల నుంచి ఎవరిదో గొంతు విన్పించింది.

కానీ ఆమె అది గమనించే స్థితిలో లేదు.

మళ్ళీ తలుపు బాదింది దబదబా!

తలుపులు తెర్చుకున్నాయి కాస్త ఆలస్యంగా.

రామారావ్ తలుపు తీశాడు.

సుజాత ఆశ్చర్యపోయింది.

తనకన్నా అరగంట ముందరేగా ఆయన బయలుదేరారు కాలేజ్‌కి?

సుజాతని చూసి రామారావ్ కంగారుపడి "ఆఫీసు లేదా?" అన్నాడు.

అతడి కంగారుకి ఆమె విస్మయం చెందింది.

అంతకన్నా విస్మయం గొల్పిన సంగతి అతను లుంగీ, మీద తువ్వాలుతో ఉన్నాడు. ఇంట్లో ఉన్నప్పుడైనా సరే లుంగీ, బనీను అలవాటు అతనికి. సందేహంగా అతనివైపు చూస్తూ లోని కడుగేసింది సుజాత.

గాభరాగా రెండడుగులు వెనక్కివేసి సుజాతకి అడ్డుగా నిల్చున్నాడు.

"అడిగితే జవాబీయవేం?" అన్నాడు తడబడుతూ.

"ఈరోజు శెలవు" అంది ముక్తసరిగా.

అతను నోరుతెరచి ఇంకా ఏదో అడిగేలోగా లోపలనుండి ఎవరిదో గాజుల శబ్దం వినబడింది.

ఇంక ఊరుకోలేకపోయింది సుజాత! భర్తని త్రోసుకుంటూ లోనికి వెళ్ళింది.

బార్లా తీసి ఉన్న పడక గదిలోని దృశ్యం సుజాతకి షాక్ కలిగించింది.

ఎదురింటి కాంతం గాభరాగా చీర కుచ్చిళ్ళు సర్దుకుంటున్నది.

సుజాతని చూసి కొంచెం అవాక్కై నిల్చుంది.

సడన్‌గా కొంచెం తెలివి తెచ్చుకుంది సుజాత. ఏమీ గమనించని దానిలాగా బాత్‌రూంలోకి వెళ్ళిపోయింది.

కాళ్లు కడుక్కుంటూ, చెంబు మీద చెంబు కాళ్ళమీద పోస్తూ పది నిముషాలపాటు అక్కడే ఉండిపోయింది.

నీళ్ళతోపాటు తనలోని శక్తి కూడా కొట్టుకొని పోతున్నట్లు ఫీల్ అయిందామె. పది నిముషాల అనంతరం తప్పనిసరిగా ఇవతలికి వచ్చిందామె.

వీధి తలుపులు దగ్గరగా వేసి ఉన్నాయి.

ఇంట్లో ఎవరూ లేరు.

భర్త ఎటో వెళ్ళిపోయాడన్న మాట తనకి మొహం చూపించలేక!

అంతవరకూ భుజాన వ్రేలాడుతున్న హేండ్ బాగ్‌ని టేబిల్ మీద పడేసింది.

తలంతా దిమ్ముగా అన్పించి అలాగే కుర్చీలో కూలబడింది. ఆలోచనారహితంగా అలా చాలాసేపు వుండిపోయింది.

గోడ గడియారం రెండు కొట్టడంతో ఆమె ఈ లోకంలోకి వచ్చింది.

అంటే దాదాపు మూడు గంటలసేపు అలాగే కూర్చుందన్న మాట తను! ఈ మధ్యలో గడియారం గంటలు కొట్టటం కూడా తనకి వినబడలేదు.

ఆమెకి మళ్ళీ ఉదయం జరిగినది గుర్తొచ్చింది. ఆమె శరీరం వేడెక్కిపోయింది ఒక్కసారిగా!

'లాభం లేదు! తను భరించలేదు ఇలాంటి విషయాలను! ఇలాంటి వ్యభిచారితో తను కలసి జీవించలేదు!'

గబగబా కాగితం కలం తీసి లీవ్ లెటర్ వ్రాయసాగింది.

వ్రాయడం పూర్తిచేసి దాన్ని కవర్‌లో పెట్టి అతికించింది.

తన బట్టలు ఒక సూట్‌కేస్‌లో సర్దుకుంది.

తలుపులన్నీ వేసి సూట్‌కేస్ వీధి మెట్లమీద పెట్టి, తాళం కప్ప తేవడానికని లోనికి వెళ్ళింది.

తాళం, కప్ప, హేండ్‌బాగ్ చేతబట్టుకుని వీధిలోకి వచ్చేసరికి పదడుగుల దూరంలో భర్త ఎదురైనాడు.

ఆమె అలాగే నిలబడిపోయింది!

అతను ఇల్లు సమీపించి ఆమెవైపు, సూట్‌కేస్ వైపూ మార్చి మార్చి చూసి లోనికి అడుగేస్తూ అడిగాడు—"ఎక్కడికి?"

ఆమెకి జవాబివ్వాలన్పించలేదు.

తాళాలు టేబిల్‌పైన పెట్టి మౌనంగా వెనుదిరగబోయింది.

"ఎక్కడికి?" కాస్త గట్టిగా అడిగాడు.

"చెప్పాలా?" అంది గంభీరంగా.

ఆ గొంతులోని గంభీరతకి కాస్త జంకినా, అంతలోకే అహం బుస్సుమంది.

"పోన్లే! చెప్పొద్దు! కానీ ఒకటి మాత్రం గుర్తుంచుకో! ఎటు వెళ్ళినా తిరిగి తిరిగి ఇక్కడికే రావాలి! ఆ విషయం తెల్సుకుని వెళ్లు!"

ఆమె చర్రున వెను తిరిగింది.

"అంటే—?" అంది ఆవేశంగా.

"గూడు వదలిన పక్షి తిరిగి ఆ గూడు చేరక తప్పదని చెప్తున్నాను" అని లోనికెళ్ళిపోయాడు గబగబా!

ఆమె ఎద ఎగసెగసి పడింది రోషంతో. వ్యక్తం చేయలేని భావాలెన్నో చెలరేగాయి మదిలో! స్థిర నిర్ణయానికొచ్చినదాన్లా సూట్‌కేస్ అందుకుంది.

*

చెప్పా చెయ్యకుండా వచ్చిన చెల్లెల్ని చూసి శేఖరం ఆశ్చర్యపోయాడు. "ఏమిటిలా వచ్చావు? బావగారు రాలేదేం?"

"అమ్మ ఏదీ?" అంది జవాబుగా.

"మీ వదినకి ఆరోగ్యం సరిలేదని ఉత్తరం రావడంతో మీ వదిన దగ్గరకెళ్లింది."

"ఎప్పుడు రావచ్చునంటావు?" అంది.

"ఏమో! నాలుగురోజుల్లో రావచ్చు! లేక వారంరోజులు పట్టవచ్చు! వదిన ఆరోగ్యం బట్టి వుంటుంది అమ్మరాక!" అన్నాడు చెల్లెల్ని జాగ్రత్తగా గమనిస్తూ.

"సర్లే" అంటూ పెరట్లోకి దారితీసింది మరో ప్రశ్నకి అవకాశం యియకుండా!

మరేం అడిగినా లాభం లేదని గ్రహించిన శేఖరం చెల్లెల్ని ఇంకేమీ అడగలేదు.

"హలో సుజాతా! ఎప్పుడొచ్చారు మీరు?" అంటూ ఎదురైన లలితని చూసి ఈ లోకంలోకి వచ్చింది సుజాత!

"నిన్న సాయంత్రం వచ్చానండీ! మీ బాబు బాగున్నాడా?" అంది లత చేయందుకుంటూ.

"ఆఁ! బాగున్నాడు. రేపు మా యింటికి రాకూడదూ?"

"అలాగే లెండి" అంటూ ముందుకి అడుగేసింది సుజాత.

ఇల్లు దగ్గరైంది. మెట్లెక్కి, తలుపు వేసి ఉండడంతో తట్టబోయి ఆగిపోయింది.

లోనుండి ఎవరివో మాటలు నెమ్మదిగా వినవస్తున్నాయి!

'అమ్మగాని వచ్చేసిందా?' అనుకుంటూ తలుపు మీద నెమ్మదిగా చేయివేసింది. నిశ్శబ్దంగా తలుపులు తెర్చుకున్నాయి.

కుతూహలంగా లోనికడుగేసింది సుజాత నిశ్శబ్దంగా.

"చాల్లెండి బాబూ! నన్ను మురిపిస్తున్నారే గానీ నాకు నైలెక్సుచీర కొనడమే లేదు."

ఆ గొంతు పనిపిల్ల రమణమ్మది.

"ఈసారి అమ్మగారు కూడా లేరుగా! తప్పక కొంటాను" ఆ గొంతు విని సుజాత ప్రాన్పడిపోయింది. శేఖరం గొంతు అది!

"అంతా ఉత్తదే" గారాలు పోతున్నది రమణమ్మ.

"అబ్బ! కొంటానన్నానా? నీతోడు! సరేనా?"

పనిపిల్ల నవ్వులో గాజులగలగల కల్సిపోయింది!

సుజాత నిలువెల్లా దహించుకుపోతున్నట్లుగా ఫీలయింది! ఏం చేయాలిప్పుడు? లోనికి వెళ్ళి యిద్దర్నీ నిలదీస్తే?

కానీ అందుకు మనస్కరించక నిశ్శబ్దంగా ఇల్లు దాటి వచ్చేసింది!

తలుపు దగ్గరగా లాగబోయి శబ్దమవుతుందని ఆ ప్రయత్నం విరమించుకుంది.

అలా గమ్యం లేకుండా నడవసాగింది.

ఎదురుగా కనిపిస్తున్న హోటల్‌లోకి వెళ్ళి ఫేమిలీరూమ్‌లో కూర్చుంది.

తలంతా తిరుగుతున్నట్లుగా ఉంది.

"ఏం కావాలి మేడమ్?" అంటూ సర్వర్ రెండుగ్లాసులతో మంచినీళ్ళు తెచ్చాడు.

"ఏమున్నాయి?" అంది.

ఎటు వెళ్ళాలో తోచక ఇక్కడి కొచ్చింది గానీ, ఆమెకు ఏమీ తినాలని లేదు.

సర్వర్ వర్ణించిన లిస్ట్‌లో చివరగా 'పకోడీ' అనేది మాత్రం వినబడింది.

"పకోడీ ప్లేట్" అంది.

సర్వర్ పకోడీ తేవడానికి వెళ్ళిపోయాడు.

తన అన్న కూడా తన భర్తలాంటివాడే!

ఛఛ! వదిన ఎంత మంచిది! ఎంత సౌందర్యవతి!

కేవలం తన ఇంట్లో పనిచేసే పిల్లతోనా తన అన్న సంబంధం పెట్టుకున్నది! నల్లగా, కేవలం స్త్రీత్వం తప్ప మరే ప్రత్యేకతలూ లేని ఆ రమణమ్మ! ఛఛ!

మగాళ్ళంతా ఇంతేనా!

అవసరానికో ఆడది వుండేచాలు! అది భార్యే కానవసరం లేదన్నమాట!

పైకి మాత్రం ఎన్నినీతులు చెప్తారు?

తన భర్త మాత్రం?

తప్పు చేశాడు. సిగ్గు గానీ, పశ్చాత్తాపం గానీ లేదు సరిగదా పైగా 'ఇల్లుదాటితే నీ కెక్కడా చోటు వుండదుసుమా" అని బెదిరింపులు! హెచ్చరికలు! ఛఛ!

తనేం చేయాలిప్పుడు?

ఇక్కడ ఎంత అన్నయైనప్పటికీ ఈ పతితుడి మొహం చూస్తూ గడపలేదు. ముందేం చేయాలో ఆలోచించుకోవడానికి, అన్న, తల్లి సలహా తీసుకుందామని వస్తే ఇతగాడేమో ఇంత నిర్వాకం చేశాడు.

వెంటనే వెళ్ళిపోవాలి అక్కడి నుండి!

ఎక్కడికి వెళ్ళడం?

"చూశావా? నా మాటే నిజం! రాక ఏం చేస్తావ్?" అంటూ నవ్వుతూ, హేళనగా ప్రశ్నించే భర్త మొహం కళ్ళముందు మెదిలేసరికి ఒళ్ళు జలదరించినట్లయింది.

మళ్ళీ అక్కడికే వెళ్ళడమా? ఊహూఁ!

ఆలోచనల్లో మునిగిపోయిన సుజాత సర్వర్ ఎప్పుడు వచ్చి పకోడీ ప్లేట్ పెట్టిపోయాడో గమనించనేలేదు.

యాంత్రికంగా పకోడీ తీసి నోట్లో పెట్టుకుంటూ మళ్ళీ ఆలోచనలో పడింది.

"కాఫీ కావాలా మేడమ్?" సర్వర్ వచ్చి ప్రశ్నించడంతో ఆలోచనలకి కామాపెట్టి—

"తీసుకురా!" అంది.

వేడి వేడి కాఫీ త్రాగగానే కాస్త హాయిగా అనిపించింది.

బిల్ చెల్లించి యింటిదారి పట్టింది.

ఇల్లు చేరేసరికి తలుపులు అలాగే ఉన్నాయి.

## మేరీ రాణి



ఈనాడు ఆంధ్ర క్రీడారంగంలో యువతీయువకులు సాధిస్తున్న విజయాలను చూస్తుంటే జాతీయ స్థాయి క్రీడలలో ఆంధ్రప్రదేశ్‌కు ఉన్నతస్థానం లభిస్తుందన్న ఆశ కలగక మానదు. అటువంటి ఔత్సాహిక క్రీడాకారిణులలో విజయవాడ మేరీస్టెల్లా కళాశాల విద్యార్థిని కుమారి జి. మేరీరాణి ఒకరు.

గత సంవత్సరం ఆగస్టు నెలలో జరిగిన క్రిష్ణా జిల్లా ఆటల పోటీలలో 100 మీటర్లు, 200 మీటర్లు లాంగ్‌జంప్‌లలో ఆమె ప్రథమస్థానం పొందింది. ఆ సంవత్సరంలోనే 3 కిలో మీటర్ల సైకిల్ పందాలలో ద్వితీయస్థానం సంపాదించింది. జిల్లా స్థాయిలో జరిగిన గ్రామీణ క్రీడల పోటీలలో కూడా ఆమె పై అంశాలలో పలు బహుమతులు అందుకున్నది. గత అక్టోబరు-నవంబరు నెలలలో ఢిల్లీలో విద్యామంత్రిత్వశాఖవారు జరిపిన జాతీయ స్థాయి పోటీలలో 400 మీటర్ల పరుగు పందెంలో పాల్గొని కాంస్యపతకం పొందింది.

అంతేకాదు. నాగార్జున విశ్వవిద్యాలయం స్త్రీల ప్రప్రథమ క్రీడల పోటీలలో పాల్గొన్న మేరీ - ఆ విశ్వవిద్యాలయపు ప్రథమ స్త్రీ ఛాంపియన్ కావడం ఇంకో విశేషం! ఆ పోటీలలో ఆమె 1500 మీటర్లు, 400 మీటర్లు, 100 మీటర్లు పరుగు పందాలలోనూ, 100 మీ. హర్డిల్స్‌లోనూ, రిలే పందాలలోనూ ప్రథమ బహుమతులు అందుకున్నది.

జాతీయస్థాయిలో జరగనున్న 'కోకో' పోటీలకు ఎన్నికైన మేరీరాణి - 'జాతీయస్థాయిలో కూడా ప్రథమ బహుమతులు పొందాలని వుంది' అంటుంది.

—ఉమ

దేనితోనూ సరిపోల్చలేని ఆ లావణ్యం.
మృదువైన. సుకుమారమైన. సహజ సౌందర్యం.




అవునుమరి : లక్స్ సుప్రీమ్‌తో మీలావణ్యం
తొణికిసలాడుతుంది, మీలో కలిగే అనుభూతీ
అదే. మనోహరమైన పరిమళం. సమృద్ధియైన,
మెత్తటి నురుగు మీ చర్మంపై పట్టులాగా
మెత్తగా పరుచుకుంటుంది. లక్స్ సుప్రీమ్‌లోని
బ్యూటీ క్రీమ్ మీ లావణ్యానికి కోమలత్వాన్ని,
మృదుత్వాన్నీ, సహజ సౌందర్యాన్నీ ఇస్తుంది.




మీరు తిరిగి ఇంక
మరేదీ వాడలేరు

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పాదన

HLLS 1059

## ఉమా బంగారయ్య

మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాల ద్వారా బి. ఎస్సీ పట్టం పొందిన శ్రీమతి ఉమా బంగారయ్య భర్త ఉద్యోగరీత్యా రాజమహేంద్రవరంలో వుంటున్నారు.

కళాశాలలో చదివే రోజులలో సాంస్కృతిక కార్యకలాపాలలో విరివిగా పాల్గొనేవారు ఆమె. ఆ ఉత్సాహంతోనే రాజమండ్రి లేడీస్ క్లబ్‌కి 1971 లోనూ 1977 లోనూ కార్యదర్శినిగా పని చేశారు. ఆ మధ్యకాలంలో ఆమె క్లబ్ కార్యకలాపాలలో చురుకుగా పాల్గొంటూ కార్యనిర్వాహక సభ్యురాలుగా వుండేవారు.

కళలపట్ల ఆసక్తిగల ఉమా బంగారయ్య తమ క్లబ్ తరపున లలిత సంగీత పోటీలు, ఎంబ్రాయిడరీ, చేతిపనులు, క్విజ్ ప్రోగ్రాములు, కేశాలంకరణ పోటీలు, నాటక పోటీలు యిలా ఎన్నో కార్యక్రమాలు జయప్రదంగా నిర్వహించారు.



అయితే వాటన్నిటిలోకి అందరి మన్ననలూ పొందిన కార్యక్రమం – 'ది మ్యూజిక్ ఆఫ్ ఇండియా'. జాతీయసమైక్యత కోసం రూపొందించబడిన ఈ కార్యక్రమంలో భారతదేశంలోని వివిధ ప్రాంతాలకు చెందిన సంగీత ధోరణులు పరిచయం చేయబడ్డాయి. సంగీతానికి భాషాభేదాలు అడ్డు రావని - అది అందరికీ అర్థమయ్యే 'అంతర్జాతీయ భాష' అనీ చెప్పడమే ఈ కార్యక్రమం ముఖ్య ఉద్దేశ్యం.

ఉమా బంగారయ్య స్వయంగా చక్కటి నటి కూడా. కళాశాలలో చదివే రోజులలోనే కాక యిటీవల లేడీస్ క్లబ్ నిర్వహించిన నాటక పోటీలలో సరదాకి నటించినా, రెండుసార్లు ఉత్తమ నటిగా బహుమతులు పొందారు.

చప్పుడు చేస్తూ లోనికివెళ్తూ గడియ వేసింది.

రేడియో పెడుతూ శేఖరం కనిపించాడు.

"అప్పుడే వదిలేశారా సినిమా?" అన్నాడు.

జవాబు ఇయ్యడానికి మనస్కరించక మౌనం వహించింది.

సూట్‌కేస్ తీసి తన బట్టలన్నీ సర్దేసుకుంది.

"ఇప్పుడు బట్టలు సర్దుకుంటున్నావేమిటీ?" ఆశ్చర్యంగా అడిగాడు.

"నేను వెళ్ళిపోతున్నాను."

"ఈ రాత్రప్పుడా?"

"ఎంత రాత్రి గనుక? ఇంకా ఎనిమిదిన్నర కాలేదు. త్వరగా బయల్దేరితే మెయిల్‌కి అందుతాను. తెల్లవారేసరికి అక్కడ వుంటాను."

"ఇంత హఠాత్తుగా ఈ ప్రయాణ మేమిటి? నిన్న అడిగితే జవాబీయలేదు. ఎందుకొచ్చినట్లు? మళ్ళీ అంత త్వరగా ఎందుకు వెళ్ళిపోతున్నట్లు?"

సుజాత చప్పున తలెత్తి అన్నవైపు చూసింది. ఇందాక తాను స్వయంగా వినకపోతే—ఎవరు చెప్పినా తను అన్నని అనుమానించేది కాదేమో!

అయ్యో వనితా! నీకెంత నమ్మకం ఈ పురుషులపై!

తను కళ్ళారా చూడకపోతే తను మాత్రం తన భర్తని లేశమాత్రమైనా అనుమానించగలిగేదా?

శేఖరం చెల్లెలి చూపుకి ఆశ్చర్యపోయి "ఏమిటా చూపు సమాధానమియ్యకుండా?" అన్నాడు.

తనకేమీ తెలియదనుకుంటున్నాడు-పూర్ ఫెలో!

చప్పున తల త్రిప్పుకుని "నేను వెళ్ళిపోవాలి! అంతే!" అంది స్థిరంగా.

"కాస్త ఆగయితే! స్టేషన్ కొస్తాను" అంటూ కుర్చీలోంచి లేచాడు.

"థాంక్స్! అవసరం లేదు. నేను వెళ్ళగలను!" అంటూ మరో మాటకి తావీయకుండా ద్వారం దాటి మెట్లుదిగి వడివడిగా ముందుకు అడుగేసింది!

*

తల దువ్వుకుంటున్న రామారావు - అలికిడి విని వెనక్కు తిరిగి చూశాడు.

"నువ్వేనా? రారా! చాలా వేగంగా వచ్చేశావే!" అన్నాడు నవ్వుతూ.

జవాబు ఇయ్యలేదు సుజాత.

మౌనంగా మరో గదిలోకి వెళ్ళిపోయింది.

"నీ సూట్‌కేస్ ఏదీ?" అంటూ భార్యను అనుసరించాడు రామారావు.

జవాబీయకుండా తన టాయ్‌లెట్ సామాను, మిగతా బట్టలు మరో సూట్‌కేస్‌లో సర్దుకోసాగింది.

"ఏమిటిది? నీ సూట్‌కేస్ ఏదీ? ఇప్పుడు ఇవన్నీ సర్దడమేమిటి?" అర్థం కానట్లుగా ప్రశ్నించాడు.

"నేను వెళ్ళిపోతున్నాను!" తలెత్తకుండానే అంది.

"వెళ్ళిపోతున్నావా?"

"అవును! మీరన్నట్లుగా మళ్ళీ ఈ గూటిలో చేరడానికి రాలేదు. నా వస్తువులు తీసుకుపోవడానికి వచ్చాను. గూడు వదలిన పక్షి మళ్ళీ ఆ గూడే చేరనవసరం లేదు. మరో గూడు కట్టుకోవచ్చు!"

"అంటే?—ఎక్కడికెళ్ళి పోతున్నావు? మీ పుట్టింటికా?" కాస్త కంగు తిన్నాడు.

"కాదు. ఇక్కడే, ఈ వూర్లోనే వర్కింగ్ విమెన్స్ హాస్టల్‌లో ఉండదల్చుకున్నాను."

"హాస్టల్‌లోనా?"

"అవును! మీకూ నాకూ సరిపడదని తేలిపోయింది!"

"అంటే నాకు విడాకులిచ్చి, మరో పెళ్ళి చేసుకుందామనా నీ వుద్దేశ్యం?"

"ప్రస్తుతం మాత్రం మీకు దూరంగా వెళ్ళిపోతున్నాను. ఆ తర్వాత ఆలోచిస్తాను ఏం చేసేదీ, ఏం చేయాల్సిందీ! వస్తాను! శెలవ్!" అంటూ సూట్‌కేస్ మూసింది విసురుగా, గంభీరంగా! □

## తీరిక వేళల్లో

ఈ రోజుల్లో థర్మోకోల్ ప్యాకింగులతో చాలా వస్తువులు లభిస్తున్నాయి. చాలామంది వాటిని ఏం చెయ్యాలో తోచక పారేస్తూ వుంటారు. ఈ థర్మోకోల్ ముక్కలు పారెయ్యకుండా వాటితోనూ గృహా లంకరణ వస్తువులను తీరిక వేళల్లో తయారు చేసుకోవచ్చును. అందులో 'గీతోపదేశం' రథం ఒకటి. ఈ రథం చేసే విధానం గురించి తెలుసు కుందాం.



# థర్మోకోల్‌తో రథం

ఇది తయారు చేసుకునేందుకు కావలసిన వస్తువులు: కాస్త తక్కువ మందంగల థర్మో కోల్ కొంత, (దీనినే బెండు అని కూడా అంటారు) కొంచెం మందం అధికం గలది కొంత తీసుకో వాలి (ఈ థర్మోకోల్ షీట్లు బజారులో కూడా లభిస్తాయి), అతికించుకునేందుకు మైదా గోందు, పదునైన బ్లేడు, వారి వారి అభిరుచులకు తగ్గట్టు రంగులు వుంటే చాలు-ఈ రథం తయారు చేసుకో వచ్చును.

రథం తయారు చేసుకోవడానికి ఏ ఏ సైజులలో థర్మోకోల్‌ని కత్తిరించుకోవాలో నెంబర్లవారీగా వేసి వున్న బొమ్మలు తెలియజేస్తున్నాయి. ఆ కొల తల ప్రకారం అన్ని భాగాలూ కత్తిరించుకుని వుంచు కోవాలి.

ముందుగా 1 నెంబరు బొమ్మలో మాదిరిగా రెండు హంసలు కట్‌చేసి పెట్టుకోవాలి. నెం. 2 బొమ్మలోలాగా పొడవాటి ముక్క ఒకటి 19 సెంటీమీటర్ల పొడవు, 13 సెంటీమీటర్ల వెడల్పుతో కత్తిరించుకోవాలి. అయితే ఒక్క విషయం జ్ఞాపకం వుంచుకోవాలి. ఆ ముక్క ఎంత పొడ వుందో ఈ హంసలు కూడా ఆ సైజులోనే తయారు చేసుకోవాలి. ఇప్పుడు ఈ హంసలను మైదా గోందు (గమ్)తో ఆ ముక్కకి అటు యిటు అత కాలి. ఫొటో చూస్తే తేలికగా అర్థమవుతుంది.

ఇప్పుడు మనం ఒక్కసారిగా ఎనిమిదవ నెంబరు బొమ్మ వద్దకు వెళ్ళాలి. నెం 8 బొమ్మలో చూపినట్లుగా 6 సెంటిమీటర్ల చుట్టు కొలతతో గుండ్రంగా నాలుగు చక్రాలు కత్తిరించుకోవాలి. వీటిని నెం. 2 బొమ్మలో చూపిన ముక్కకి కింద చక్రాల్లా అతికించుకోవాలి.

ఆ తరువాత నెం. 2 బొమ్మలోని ముక్కకు నాలుగు వైపులా కాస్త చోటు విడిచి నెం. 6 బొమ్మలో చూపినట్లుగా 13 సెంటిమీటర్ల పొడవుతో సన్నపాటి వెడల్పులో నాలుగు స్థంభాలు తయారు చేసుకోవాలి. వీటిని ఆ ముక్కమీద అంటించాలి.

ఇక, యిప్పుడు 4వ బొమ్మలో చూపినట్లుగా 15 సెంటిమీటర్ల పొడవు, 10 సెంటిమీటర్ల వెడల్పుతో ఆవిధంగా డిజైనుతో రెండు ముక్కలు కట్ చేసుకోవాలి. అట్లాగే నెం. 5 బొమ్మలోలాగా 13 సెంటిమీటర్ల పొడవుతో, 10 సెం. మీ. వెడల్పుతో ఆ డిజైనులాగే రెండు ముక్కలు కట్ చేసుకోవాలి.

వీటిలో చిన్న సైజు ముక్కలు రెండూ రథానికి ముందూ, వెనకా వచ్చేటట్లుగా, స్థంభాలకి ఆనుకునేటట్లుగా వుంచి నెం 2 బొమ్మ ముక్క పైన అతికించాలి. అట్లాగే పెద్ద సైజు ముక్కలను రెండింటినీ రథానికి అటు, యిటూ మిగిలిన రెండు వైపులా వచ్చేటట్లుగా అంటించాలి. ఇప్పటికి రథం సగం దాకా అయినట్లే.

ఇక పైభాగానికి చేరుకుందాం. నెం 3 బొమ్మలో మాదిరిగా 13 $\times$ 13 సెంటిమీటర్ల కొలతలో ముక్క ఒకటి చదరంగా కత్తిరించుకోవాలి. దీనిని స్థంభాల పైన జాగ్రత్తగా అంటించాలి. రథానికి కవర్‌లాగా వుంటుంది ఈ ముక్క.

ఇక యిప్పుడు మందం అధికంగా వున్న థర్మో కోల్ తీసుకోవాలి. దీనితో నెం. 9 బొమ్మలో చూపి నట్లుగా 9 సెం. మీ. చుట్టుకొలతలో ఒకటి, నెం. 10 లో చూపినట్లుగా 6-5 సెం. మీ. చుట్టు కొలతలో ఒకటి-కత్తిరించుకోవాలి. అయితే నెం. 9 ఫొటోలో చూపినట్లుగా కాస్త ఏటవాలుగానూ, నెం. 10 మరి కొంచెం ఏటవాలుగానూ కట్ చేసు కోవాలి. నెం. 3 (రథం పైటాప్ కవర్) ముక్క మధ్యలో సమంగా నెం. 9 ముక్క గోందుతోగాని గమ్‌తోగాని అతికించుకోవాలి. దానిపైన నెం. 10 ముక్కను అతికించాలి. గోళీ ఆకారంలో ఒక చిన్న గుండ్రటి ముక్కను కట్ చేసుకోవాలి. అయితే ఈ గోళీ ముక్క అడుగు భాగం మటుకు చదునుగా లెవల్ చేసుకోవాలి. ఇలా తయారు చేసుకున్న దానిని నెం. 10 మీద అతికించాలి.

ఇప్పుడు సన్నగా వుండే థర్మోకోల్‌తో నెం. 11 బొమ్మలో చూపినట్లుగా ఒక పువ్వు కత్తిరించుకుని రథానికి ముందు వైపున అంటించాలి. ఇక మిగిలిం దల్లా గుర్రాలను తయారు చేసుకోవడం. బొమ్మలో

చూపినట్లుగా థర్మోకోల్ షీటుమీద (ట్రేస్ తీసుకుని గుర్రాన్ని కత్తిరించుకుని తయారు చేసుకోవచ్చు) ఈ విధంగా నాలుగు గుర్రాలను తయారు చేసుకోవాలి.

నెం. 7 బొమ్మలో చూపినట్లుగా 7 సెం. మీ. పొడవుతో 4 సెం. మీ. వెడల్పుతో ముక్క ఒకటి కత్తిరించుకోవాలి. దీనిని నెం. 2 ముక్క ముందు భాగాన అతికించుకోవాలి. (తేరుకి ముందువైపు అన్నమాట). ఇప్పుడు ఆ ముక్కకి అటు, యిటు రెండు వైపులా రెండేసి చొప్పున గుర్రాలను అతికించుకోవాలి. (ఫొటో చూస్తే సులభంగా అర్థమవుతుంది.)

హమ్మయ్య-యిప్పటికి రథం పూర్తి అయినట్లే! ఇక రథం అందంగా, నిండుగా వుండడానికి కావలసిన హంగులు సమకూరుద్దామా....




రథంలోపల 'అర్జునుడు' కూర్చోవడానికి అనువుగా ఒక చదరపు ముక్క కట్ చేసి, అంటించి దానికి అనుకునే విధంగా యింకో ముక్క కట్ చేసి అంటించుకోవాలి. కుర్చీవంటి ఆసనం తయారయిందన్న మాట. దీని మీద 'అర్జునుడి' బొమ్మ (ప్లాస్టిక్ బొమ్మ పెట్టుకోవచ్చు లేదా క్యాలెండర్ లోనిదైనా ఫరవాలేదు) తయారుచేసి పెట్టాలి. రథం వెనక భాగాన అర్జునుడు దిగడానికి అనువుగా మెట్లు లాగా అమర్చాలి. అట్లాగే కృష్ణుడి బొమ్మ చేసుకుని గుర్రాల వెనుక అంటే తేరు ముందు భాగంలో ఒక పక్కగా అంటించాలి. అతని చేతిలో దారాల లాగా అమర్చి వాటిని గుర్రాలకు అమర్చితే నిండుగా వుంటుంది.

ఆ తరువాత చిన్న చదరం థర్మోకోల్ కట్ చేసి నెం. 2 ముక్కకి ముందు వైపు అంటించి దానికి యిరువైపులా నెం. 13 బొమ్మలో చూపినట్లుగా ఏనుగు ముఖాలు కట్ చేసి అంటించాలి. ఆ పైన కాగితంతో జెండా తయారు చేసి ఒక పుల్లకు అంటించి పెట్టుకోవాలి.

ఈ అలంకరణలలో మరో భాగం - నెం. 3, 4 ముక్కలు (రథానికి యిరువైపులా వున్నాయే, అవి) కట్ చేసుకున్న తర్వాత పై భాగాన వంకీలు వంకీలుగా కట్ చేసుకోవాలి (ఫొటో చూడండి). ఇలా చేయడం వల్ల అందంగా వుంటుంది రథం.

అంతా పూర్తయిన తరువాత - రంగులతోగానీ, స్కెచ్ పెన్‌తోగానీ లతలు, డిజైన్లు వేసుకోవాలి. గుర్రాన్ని కూడా పెయింట్ చేసుకోవాలి. హంసలకు రంగులు వేసుకోవాలి. స్థంభాలు గుండ్రంగా కూడా చేసుకోవచ్చు. వీటికి రంగులలో లతలు వేసుకుంటే బాగుంటాయి.

ఇలా చేసుకున్న రథాన్ని పొడవాటి థర్మోకోలు షీటు మీదగానీ మందపాటి అట్టమీదగాని వుంచితే అందంగా వుంటుంది. డ్రాయింగ్ రూంకి చక్కని అలంకరణ వస్తువు అవుతుంది.

అయితే థర్మోకోల్ షీటుని చాలా జాగ్రత్తగా కట్ చెయ్యాలి. ఆ తరువాత కూడా చాలా నాజూకుగా పట్టుకోవాలి. మొరటుగా పట్టుకుంటే అంతా విరిగిపోతుంది. ఈ రథం చేసుకోవడం కాస్త శ్రమ అనిపించినా ఓపిగ్గా కూర్చుని చేసుకున్న తరువాత మన శ్రమకి ఫలితం కనిపించి ఎంతో ఆనందం కలుగుతుంది. మరి మీరూ చేసి చూడండి!

—అమంచర్ల రాజేశ్వరి

# వైద్య  విశేషాలు

పంటినొప్పికి దంతవైద్యుడి దగ్గరకు వెళ్తే, ఆయన పళ్ళు పరీక్షచేయడానికి బదులుగా శిరోజాలు కత్తిరించినా మీరు ఆశ్చర్యపడవలసిన అవసరం లేదు. కారణం—పంటి ఇగుళ్ళు దెబ్బతిన్నాయో లేదో తెలుసుకోడానికి, దంతక్షయం నివారించడానికి—రోగి శిరోజాల పరిశోధన, రోగి రక్త పరీక్ష చాలా ఉపయోగపడతాయని అమెరికాలోని కొలరాడ్ రాష్ట్రానికి చెందిన ప్రముఖ దంతవైద్యుడు డాక్టర్ హాల్ హగ్గిన్స్ ఇటీవల న్యూయార్కులో జరిగిన దంతవైద్యుల సమావేశంలో వెల్లడిచేశారు. ఆ పరీక్షల తర్వాత వైద్య చికిత్సతోపాటు—ఆహారనియమాలు పాటించడం వల్ల కూడా దంతక్షయాన్ని అరికట్టవచ్చని ఆయన తెలియజేశారు. పళ్ళరసాలు, పాలు, మైదా, చక్కెర వంటి పదార్థాలవల్ల కూడా కొందరికి పళ్ళజబ్బులు వస్తాయని, అందువల్ల వాటిని తక్కువగా తీసుకోవాలని—మాంసం, చేపలు, కర్బూజాపండు వంటివి పళ్ళకు మంచివని ఆయన తెలియజేశారు.

*

పుట్టకురుపు (కేన్సర్) వ్యాధిని నిర్మూలించడానికి చాలా కాలంగా ఎన్నో వైద్య పరిశోధనలు, ప్రయోగాలు జరుగుతూ వున్నాయి. ఐనా—పూర్తిగా ఆ వ్యాధి నిర్మూలన విషయంలో ఎవరూ కృతకృత్యులు కాలేకపోతున్నారు. మరో ప్రక్క పరిశోధనలు జరుగుతూనే వున్నాయి. ఇటీవల కేన్సర్‌ను నిరోధించే మరో మందు (ఇంతవరకూ కనిపెట్టబడిన మందులు అన్నిటికంటే ఆశాజనకమైనదని పేర్కొనబడిన మందు) గురించిన విశేషాలు వెల్లడయ్యాయి. 'ఎజిటోమైసిన్' అనే ఆ మందును, శాన్‌ఫ్రాన్‌సిస్కో విశ్వవిద్యాలయం (కాలిఫోర్నియా)కు చెందిన వైద్య పరిశోధకుల బృందం—డాక్టర్ మార్టిన్ ఆపిల్ ఆధ్వర్యంలో రూపొందించింది. ఈ మందులోని విశేషం ఏమిటంటే, ఇది దేహంలో పుట్టకురుపు వ్యాధికి దోహదం చేసే కణాలపై 25 నుంచి 28 నిమిషాలవరకూ తన ప్రభావాన్ని చూపిస్తూ, దాదాపు పదిలక్షల కేన్సర్ కణాలను ఒకేసారిగా నాశనం చేస్తుందట! ఇప్పుడు వాడకంలో ఉన్న 'ఎడ్రామైసిన్' వంటి మందులు దేహంలో ఒక సెకను మాత్రమే తమ ప్రభావం చూపి, కేవలం ఒక లక్ష కణాలను మాత్రమే నాశనం చేస్తాయి. ఈ కొత్త మందును అనేక పర్యాయాలు ఎలుకలపై ప్రయోగించి – సంతృప్తికరమైన ఫలితాలు సాధించిన తర్వాత—ఈ విషయాన్ని ఇటీవల అమెరికాలో జరిగిన అమెరికన్ కేన్సర్ సొసైటీ వార్షిక సదస్సులో డాక్టర్ ఆపిల్ ప్రకటించారు. త్వరలోనే ఈ మందును కేన్సర్ రోగులపై కూడా ప్రయోగిస్తారట!

*

చక్కెర, తాజాచేపలు, అన్నం ఎక్కువగా తినడం వల్ల—కంటిచూపు మందగించే ప్రమాదం వుందని, ఈ మధ్య హాంకాంగ్‌కు చెందిన కెమికల్ ఇంజనీర్ ప్రొఫెసర్ లూ యంగ్-చె తెలియజేశారు. ఆయన పరిశోధన సారాంశం ఇది: కళ్ళు ఆరోగ్యవంతంగా వుండడానికి విటమిన్ బి-1, బి-2 దోహదం చేస్తాయి. ఆ విటమినులు నిర్వహించే మరో పని—చక్కెర వంటి పదార్థాలు స్వయంగా దేహానికి బలం చేకూర్చలేవు కాబట్టి, వాటిని బలం చేకూర్చేవిగా రూపొందించడం! అందువల్ల—ఎక్కువ చక్కెర, అన్నం తీసుకోవడంతో, ఈ విటమినుల పని ఎక్కువై, క్రమక్రమంగా అవి దేహంలో క్షీణించడం, దాంతో కంటి సంరక్షణకు అవకాశం లేకపోవడం, చూపు మందగించడం జరుగుతాయని—ప్రొఫెసర్ లూ కొన్ని ప్రయోగాల ద్వారా రుజువు చేశారు. కొన్నిరకాల తాజాచేపలు తినడం వల్ల దేహంలో ఉన్న బి-1 విటమిను పూర్తిగా నాశనమైపోతుందట! బి-1, బి-2 విటమినులు మానవ దేహంలో-చాలా కొద్దిగాను, తాత్కాలికంగాను వుంటాయని, అంచేత ఆ విటమినులుగల ఆహార పదార్థాలు – గ్రుడ్లు, లివరు, రొట్టెలు వంటివి ప్రతిరోజు తీసుకోవడం ఆరోగ్యానికి మంచిదని – ఆయన తెలియజేశారు.

*

మీగడ తీసిన పాలు త్రాగడం వల్ల, కాలేయానికి క్రొవ్వు పట్టే ప్రమాదం వుందని నైజీరియా విశ్వవిద్యాలయానికి చెందిన డాక్టర్ పి. బి. ఒకాన్‌కో, కార్నెల్ విశ్వవిద్యాలయం (న్యూయార్కు)కు చెందిన డాక్టర్ జె. ఇ. కిన్సెల్లా కొన్ని ఎలుకలపై ప్రయోగాలు చేసి, రుజువు చేశారు. ఈ విషయాన్ని 'న్యూసైంటిస్ట్' అనే బ్రిటిష్ పత్రిక ప్రకటించింది. మీగడ తీసిన పాలల్లో 'ఒరోటిక్ యాసిడ్' కారణంగా మన శరీరంలోని కాలేయానికి క్రొవ్వు పట్టే ప్రమాదం వుందని, అది ఆరోగ్యానికి మంచిదికాదని—ఈ వైద్య శాస్త్రజ్ఞులు తెలియజేశారు.

---

అమెరికాలో ఒక చట్టం వుంది. ఆ చట్టం ప్రకారం ప్రభుత్వం ఆర్థికస్తోమత లేనివారి పిల్లల పెంపకం తదితర విషయాలకోసం ప్రభుత్వ సంక్షేమనిధి ఏర్పరచింది. లాస్‌ఏంజలిస్ నగరవాసిని అయిన బార్బరా జీన్ థాంప్సన్ ఈ చట్టం తన పాలిట కల్పతరువుగా భావించింది. తనకు ఓ నలభై ఏడు మంది పిల్లలున్నట్లు నకిలీ పత్రాలు సృష్టించి సంక్షేమనిధి సహాయం కోరింది. 2,40,000 డాలర్లు పొందింది. (అంటే దాదాపు ఇరవై ఒక్క లక్షల రూపాయలన్నమాట!) ఇటీవల అధికారులు హఠాత్తుగా మేలుకొని ఆమె పిల్లల పుట్టుపూర్వోత్తరాలు విచారించగా—ఆమె చేసిన మోసం బయటపడింది—ఇంతకీ ఆమె సంతానం నలుగురు మాత్రమే!

## నిబంధనలు

'వనిత మాటల కొలువు'లో స్త్రీలు మాత్రమే పాల్గొనాలి. ఈ సంచికలో ఉన్న కూపను పూర్తి చేసి కవర్లో పెట్టి 'వనిత మాటల కొలువు – 42' చందమామ బిల్డింగ్స్, మద్రాసు – 600 026 చిరునామాకు డిసెంబరు 25 వ తేదీలోగా చేరేలా పంపాలి. ఆ కవర్లో మాటల కొలువు కూపను తప్ప మరేదీ ఉండకూడదు. ఒక కవర్లో ఒక్క ఎంట్రీయే ఉండాలి. గళ్ళలో వేసే అక్షరాలు శుభ్రంగా, తెలిసేలా ఉండాలి. కొట్టివేతలూ దిద్దు బాట్లూ ఉండకూడదు. దీని సమాధానం, ఫలితాలూ 1979 ఫిబ్రవరి సంచికలో ప్రచురింపబడతాయి. మా దగ్గర గల సమాధానంతో సరిపోయే సమాధానం పంపినవారికి రూ. 150 లు బహుమతిగా పంపుతాము. సరైన సమాధానం పంపేవారు ఒకరికంటె ఎక్కువమంది గనుక ఉంటే, బహుమతి మొత్తం సమానంగా పంచబడుతుంది. దీనికి సంబంధించిన ప్రతి విషయంలోనూ 'వనిత' నిర్వాహకవర్గానిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరపబడవు.

### ఆధారములు – అడ్డము

1. చలనము లేని గ్రహము
2. రెండు స్వప్నాలు కలిసి, నవ్వుల ధ్వని వినిపిస్తాయి.
3. ఒక పువ్వు తిరగబడింది.
4. తోడిపెళ్ళాం గనక కచ్చితంగా తిరగబడుతుంది!
5. దైవాన్ని మించినది (మొదటి అక్షరం వెనక వుండాలి)
6. రెండో అక్షరానికి గుడి వుంటే-అభినేత్రి.
7. ఒక వస్తువును అడిగి-తిరిగి నాలుగైదు రోజుల్లో ఇస్తాననడం.
8. తలా తోకాలేని బాలరాజు-ఇలాతయారవుతాడు.
9. మూడు అడ్డంలో వున్న పువ్వుజాతిలో మంచి రకం ఇది. (అక్షరాలు అటూ ఇటూ)
10. చెలిమి చేసే వాడని అర్థం.
11. చివరి గుడి పడగొడితే గాని, దేవలోక వనిత తెలియదు!
12. పదిహేను నిలువులో వున్నదే!
13. ఒక చెట్టు
14. అట్నుంచి నిప్పులు చెరిగే గాలి కొడుతోంది!

### ఆధారములు – నిలువు

1. మనవి చేసుకోడంలో మరో మాట.
7. కరువు కలగడం లాంటిది
10. అరగదీసేది
11. జంతువులు తినడం
12. మెడ లేకపోతే ఇది నిలవదు.
15. వినాయకుడు కాదుగాని, తొండము గలదు.
16. వనిత
17. శ్రమ తర్వాత కలిగేది.
18. త్వ దు మ్మ
19. ఈ సంచికలోని ఒక వ్యాసం వస్తువ
20. ఇంట్లో తిరిగే జంతువ
21. ఇంటి మొదట్లోనే వుంటుంది.
22. రా?
23. మరో వనిత

## వనిత మాటల కొలువు-42

## రూ 150లు బహుమతి

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | | 15 | | ■ | 16 | ■ | 17 |
| | ■ | | ■ | 2 | | 18 | |
| 3 | 19 | ■ | 20 | ■ | 4 | | |
| ■ | | ■ | 5 | 21 | ■ | 6 | |
| 7 | | | ■ | 8 | 22 | ■ | ■ |
| 9 | | ■ | 10 | | | ■ | 23 |
| | ■ | 11 | | | ■ | 12 | |
| ■ | 13 | | ■ | 14 | | | |

పేరు ________________________________

చిరునామా ________________________________

________________________________

________________________________

________________________________

మళ్ళీ మీ రోజువారీ పనులు మామూలుగా
చేసుకోవాలని ఆతృతగా ఉందా. మీకు?

# గ్లాక్సోస్-డి®




dCA/GL/54/TL

# దశమగ్రహం

"జామాతా దశమోగ్రహః" అని మన పెద్దలు చెప్పిన మాటలు నూటికి నూరుపాళ్ళు నిజం. మన సమాజంలో ఆడపిల్లకు కట్నం ఇచ్చి ఘనంగా పెళ్ళి చేయడం ఒక ఎత్తయితే, పెళ్ళికి అనంతరం అల్లుణ్ణి పండుగలకీ, పబ్బాలకీ పిల్చి కానుకలు వగైరాలిచ్చి మర్యాదలు చేయడం మరో ఎత్తుగా వుంటున్నది. ఈ అల్లుళ్ళు చేసే ఆర్భాటాలను మనం నిత్యం ఇరుగుపొరుగు కుటుంబాలలోనో లేక బంధుకోటిలోనో చూస్తూ వుంటాము, వింటూ వుంటాము.

బహుశా అల్లుళ్ళు అలక వహించటం ఆది నుంచీ అలవాటులో వున్నట్టు కనిపిస్తుంది. అందుకే కాబోలు పెళ్ళిలో కూడా అలకపాన్పు అంటూ ఒక వేడుక చేస్తుంటాము. ఆచారానికీ, వేడుకకీ, సరదాకీ అయితే బాగానే వుంటుంది కానీ తాహతుకి మించిన కోరికలు కోరటం మంచిది కాదు. తన తల్లిదండ్రులకీ, అక్కచెల్లెళ్ళకీ వున్న కోరికలన్నింటినీ అల్లుడు కోరటం దారుణం. వియ్యాలవారు తమ ఇంటిల్లిపాది కోర్కెలను అబ్బాయిచే తనే అడిగించి మామగారిని పీల్చి పిప్పి చేసేస్తారు. కష్టపడకుండా అలిగి కూర్చుని తమకు కావలసిన వాటిని సులభంగా అమర్చుకోవచ్చునని ఆగడం చేసి సాధిస్తారు చాలామంది. తాము కోరినదే ఏ వస్తువైనా మామగారు క్షణాల్లో తెచ్చి సమర్పించుకోవాలన్నట్లుగా వుంటుంది కొందరి వాలకం.

ఇది కూడా స్త్రీలకున్న సమస్యలలో ఒకటిగా లెక్కింపదగినదే. అల్లుళ్ళ అలకలు, వారి కోపతాపాల మూలంగా ఎంతమంది స్త్రీల మనస్సులు, ఆడపిల్లల తల్లిదండ్రుల మనస్సులు కష్టపడుతున్నాయో లెక్కపెట్టడం సాధ్యం కాదు. వివాహానంతరం అల్లుళ్ళు అలగటం పరిపాటయిపోయి మామగారికి గ్రహపాటుగా తయారయింది. అందుకనే కాబోలు అల్లుణ్ణి దశమగ్రహంతో పోల్చారు. "నవగ్రహాలలో నవమ గ్రహమైన శని పడితే ఏడు సంవత్సరాలకి పోతుంది. లేదా గ్రహ శాంతులు జరిపిస్తే మనకి భయపడి కిక్కురుమనకుండా పూరుకుంటుంది. కానీ, ఈ అల్లుడి గ్రహం వున్నదే అది – మనం బ్రతికినంత కాలం పీక్కుతింటుంది." అని పెద్దలు అన్నారు.

అన్నిటికన్నా విశ్వాసమైన దేమిటంటే కుక్క అనీ, విశ్వాసహీనమైన దేమిటంటే అల్లుడనీ అంటారు. "ఎంత వంకర కర్రయినా పిల్లనిచ్చేసరికి నిటారుగా నిలబడుతుంది" అనే సామెత ఊరికే వచ్చింది కాదు. అంటే పిల్లనిచ్చేసరికి అల్లుడికి అంత శక్తి, అధికారం వచ్చేస్తాయి. పెళ్ళిలో ఏవో చిన్న చిన్న లోపాలను సహితం చూపించి అలగటం, పెట్టుపోతల్లో తమ తాహతుకి తగినట్లు చేయలేదని కోపగించుకోవటం (ఇవి స్వతహాగా అయినా కావచ్చు, చుట్టూ వున్న చుట్టాల దుర్బోధల ఫలితంగానైనా కావచ్చు) చాలా అన్యాయం. ఇక పట్నంలో కొత్త కాపురం పెట్టేవారయితే కాపురానికి కావలసిన సామగ్రినంతా (అంటే చీపురు మొదలు మంచం, బీరువా దాకా) మామగారి ముక్కుపిండి వసూలు చేస్తారు. కేవలం పెట్టుపోతల విషయాల్లోనే కాదు, అతి స్వల్ప విషయాలకు కూడా బాసింపట్టు వేసుక్కూచునే అల్లుళ్ళున్నారు.

ఏ తల్లిదండ్రులయినా తమ కుమార్తె సుఖపడాలనే అనుకుంటారు. తమ శక్తికి తగినట్లు అల్లునికి అన్నీ సలక్షణంగానే అమరుస్తారు. వారు పెట్టినదాంతో సంతోషించి ఊరుకుంటే అటు అత్తమామలకి బావుంటుంది; ఇటు వీళ్ళ సంసారమూ సుఖంగా వుంటుంది. అంతేకానీ చీటికి మాటికి అత్తమామలను, భార్యను పీడించే అల్లుళ్ళు వుంటే ఆ ఇల్లు నరకతుల్యమవడంలో సందేహం లేదు. తల్లిదండ్రులకు భయపడి అలిగితే ఏమో కానీ అది తమ జన్మహక్కుగా భావించే పురుషపుంగవులను ఏమనాలి? "చచ్చినట్టు మా కోరికలు తీర్చాలి, ఎవడికోసం?" అని మామగారు తనకు ఎప్పుడో బాకీ వున్నట్టు, ఆ బాకీ ఇప్పుడు తీర్చమన్నట్లు వ్యవహరిస్తారు కొందరు మహానుభావులు. దీనివలన ఆడపిల్లల తల్లిదండ్రులకు కలిగే మనోబాధ అనూహ్యం. తన భర్త కోరికలను తల్లిదండ్రులతో చెప్పలేక, భర్తకు నచ్చచెప్పలేక అడకత్తెరలో పోకచెక్కల్లా నలిగిపోయే స్త్రీలెందరో వున్నారు. వృద్ధాప్యంలో తమ తల్లిదండ్రులను బాధపెట్టలేక అనుక్షణం తామూ మనోవ్యధకు గురవుతారు. ఈ కారణంగా ఇంట్లో నుంచి గెంటివేయబడిన స్త్రీలూ, ఆత్మహత్యా ప్రయత్నానికి పాల్పడిన స్త్రీలూ కోకొల్లలుగా కనిపిస్తారు.

ఐతే—

అందరు అల్లుళ్ళూ ఇలాంటివారేనని నేను చెప్పటం లేదు. మంచివారూ వున్నారు; మామగారు ఇచ్చినదానితో తృప్తిపడేవారూ, మామగారు కష్టాల్లో వుంటే చేతనైన సహాయం చేసి ఆదుకునే సహృదయులూ వున్నారు. దాదాపు ప్రతి ఇంట్లోను అల్లుడికి ప్రత్యేకమైన స్థానం వుంటుంది. ఏ ఆడపిల్ల తల్లిదండ్రులకీ తమ అల్లుడిని అగౌరవపరచాలనే ఉద్దేశ్యం జన్మలో వుండదు. అల్లుడొస్తున్నాడంటే అప్పో సప్పో చేసైనా సకల మర్యాదలు చేయాలని తహతహలాడతారు. అటువంటప్పుడు తనకు మర్యాదలు సరిగ్గా చేయలేదనీ, భార్యతరపు వారిని హేళన చేసి మాట్లాడటం ఆ అల్లుడికి ఏమీ బాగుండదు.

వరకట్న నిషేధమంటూ ఆ సమస్యను పరిష్కరిస్తున్న రోజుల్లో అల్లుళ్ళు అలగకుండా స్త్రీలు తమ చాతుర్యంతో వీలైనంతవరకు భర్తల మనస్సులను మార్చటానికి ప్రయత్నించాలి. ప్రతి అల్లుడూ తానూ ఒకనాటికి మామనవుతానని మర్చిపోకూడదు. వివాహమైన తర్వాత ఎన్ని సంవత్సరాలైనా మామగారు తమకు పెట్టి పోస్తుండాలని అనుకునే అల్లుళ్ళ దృక్పథంలో మార్పు రావాలి. దానికి ముఖ్యంగా స్త్రీలే బాధ్యతవహించాలి!

—గార్ల సరస్వతి



మినపపప్పు తొందరగా నానడానికి ఒక చిట్కా వుంది. పప్పు – ఇనుప మూకుడులో నాన వెయ్యండి. లేదా, నానవేసిన పాత్రలో ఇనప గరిటో, అట్లకాడో పడేయండి.



కందిపప్పు తొందరగా వుడకాలంటే, బియ్యం కడిగిన నీళ్ళలో పప్పువేసి ఉడికిస్తే తొందరగా వుడుకుతుంది. —వరహాలమ్మ

హిమబిందువులతో తడిసిన సౌరభంగల
పువ్వుల తాజా సుగంధం
మీ మనసును దోచేస్తుంది






# పాయిజ్
## శాంతెల్
పెర్ఫ్యూమ్

U-PCP-1 TEL

మార్కెట్ చేసేవారు: రాలీస్ ఇండియా లిమిటెడ్

# క్రొత్త
సాటిలేని
# కేమలిన్
## పిస్టన్ పెన్నులు

మీ సమయం వృథా కాదు.
సిరా వేసేటపుడు ఏమాత్రం
ఇబ్బంది వుండదు. కేమలిన్ పిస్టన్
పెన్ను యొక్క నిర్మాణపు తీరు మీ
పనిని ఎంతో సులభం చేస్తుంది.
ఒకసారి నింపండి. తేడా
గమనించండి.




నింపడం
ఎంతో సులభం
పిస్టన్ క్రిందికి
తోయండి.
సిరాలో
ముంచండి.
పిస్టన్‌ను పైకి
లాగండి.
అంతే – పెన్ను
నిండింది!

ఇంజక్షన్
పిస్టన్ పెన్ను 48

ఎడమ వైపు
త్రిప్పండి – గాలి
బయటికి
వస్తుంది.
కుడివైపు
త్రిప్పండి.
సిరా పూర్తిగా
నిండుకొంటుంది






పిస్టన్
ఫిల్లింగ్ పెన్ను 47

Vision 782 Tel.



# వార్తల్లోని వనిత

**'77 మార్చి 21.**

ఆ రోజున దేశం - ఒక ముఖ్యమైన వార్త వినడానికి ఎంతో ఆత్రుతగా ఎదురు చూసింది. తెల్లవారు జామున—ఆ వార్త రానే వచ్చింది. అది రాయ్ బరేలీలో జరిగిన లోక్‌సభ ఎన్నికల్లో శ్రీమతి ఇందిరాగాంధి పరాజయం!

అలహాబాదు హైకోర్టు—'75 జూన్ 12న ఇందిరాగాంధి ఎన్నిక చెల్లదని, రాజ్‌నారాయణ్ పెట్టుకున్న అర్జీని అంగీకరించడం, ఆ తర్వాత జూన్ 25న అత్యయిక పరిస్థితి ప్రకటించబడడంతో 19 నెలలపాటు దేశంలో చెలరేగిన రకరకాల ఆందోళనలకు ఆ ఎన్నిక ఒక 'క్లైమాక్స్'గా పరిణమించింది.

ఇందిరాగాంధి ప్రధానమంత్రిగా - స్వదేశంలోను, విదేశాల్లోను పొందిన గౌరవాభిమానాలు, ఆమె సాధించిన విజయాలు-అత్యవసర పరిస్థితి సృష్టించిన కారుమబ్బుల్లో కనుమరుగయ్యాయి.

స్వాతంత్ర్య సమరంలో ప్రముఖ పాత్ర వహించి. విశేష చరిత్రను సృష్టించుకున్న కాంగ్రెస్ పార్టీలో చీలిక రావడం, రాష్ట్రపతి పదవికి శ్రీ సంజీవరెడ్డి, శ్రీ వి. వి. గిరిల మధ్య జరిగిన పోటీ, అంతర్జాతీయ రాజకీయ రంగంలో అప్పటి కేంద్ర ప్రభుత్వం అవలంబించిన కొన్ని వైఖరులు, భారత రాజ్యాంగంలో ప్రవేశపెట్టదలచుకున్న కొన్ని మార్పులు - మొదలైన ముఖ్య విషయాల్లో— ఇందిరాగాంధి నిర్వహించిన పాత్ర అనేక విమర్శలకు గురైంది. ఐనా ఆమె తన చర్యలను సమర్థించుకుంటూనే - 'పరాజయం'లో కూడా ఆమె 'వార్తల్లోని వనిత'గా చలామణి అవుతూ వచ్చింది!

'77లో ఆమె పొందిన పరాజయం - ఆమె రాజకీయ జీవితానికి అంతిమ దశగా అభివర్ణించారు శ్రీ జయప్రకాష్ నారాయణ్!

భారత ప్రధానిగా 11 సంవత్సరాలు పాలించిన ఇందిరాగాంధి - ఎన్నికలలో ఓడిపోవడం అన్న కారణంతో రాజకీయాలకు స్వస్తి చెప్పడం జరగని పని అని కొందరంటే, ఆమె సరైన సమయం చూసి, తిరిగి రంగంలోకి ప్రవేశిస్తుందని మరి కొందరు వ్యాఖ్యానించారు.

ఆమె కొన్నాళ్ళపాటు అజ్ఞాతంలో వున్నట్టు కనిపించినా, పార్టీ రాజకీయాలలో ఆమె హస్తం కనిపిస్తూనే వుందని రాజకీయ విమర్శకులు చెబుతూనే వచ్చారు.

"మీరు మళ్ళీ రాజకీయాలలోకి ప్రవేశిస్తున్నారా?" అని ఒక పత్రికా విలేకరి ప్రశ్నిస్తే, 'ప్రజాసేవ చేయడమే రాజకీయంగా భావిస్తే, ఆ కర్తవ్యాన్ని తాము వదుకోలేమని' ఇందిరా గాంధి సమాధానం చెప్పారు.

ఒక ప్రక్క - ఆమెపై ఆరోపించబడిన నేరాల సంఖ్య పెరుగుతూనే వుంది; విచారణ కమిటీలు తమ పనిని తాము నిర్వర్తిస్తూనే ఉన్నాయి. "నన్ను 'అరెస్ట్' చెయ్యడానికి జనతా ప్రభుత్వం భయపడుతున్నది" అని ఆమె కేంద్ర ప్రభుత్వాన్ని సవాలు చేస్తూనే, పార్టీ రాజకీయాలలో ముమ్మరంగా కృషి చేస్తూ, సమయం చూసి, 'చిక్కమగళూరు' లోక్‌సభ ఉప ఎన్నికలో అభ్యర్థిగా నిలబడి, మళ్ళీ—విశేష వార్తల్లోకి వచ్చారు ఇందిరాగాంధి!

60 ఏళ్ళ వయసులో పలు సమస్యల భారాన్ని లెక్క చేయకుండా, తనకు అట్టే పరిచయం లేని ప్రాంతంలో, అక్కడి ప్రజల భాష తనకు తెలియకపోయినా, వారి మధ్య తిరుగుతూ ముమ్మరంగా ఎన్నికల ప్రచారం చేస్తూ, విమర్శలకు సమాధానాలు చెబుతూ - ఆమె ప్రవర్తించిన తీరు అందరినీ ఆకర్షించింది!

నవంబర్ 8 ఉదయం!

అందరూ మళ్ళీ ఆత్రుతగా చరిత్రాత్మకమైన 'చిక్కమగళూరు' ఉప ఎన్నిక ఫలితం కోసం చూస్తున్న సమయం!

ఇందిరాగాంధి తన ప్రత్యర్థి, జనతాపార్టీ అభ్యర్థి వీరేంద్రపాటిల్‌పై 77,333 ఓట్ల తేడాతో గెలుపొంది, లోక్‌సభ సభ్యురాలిగా ఎన్నికై, మళ్ళీ 'వార్తల్లోని వనిత' అయింది!

శ్రీమతి ఇందిరాగాంధి — స్త్రీ శక్తికి ప్రతీక. "ధైర్యం, చొరవ, దీక్ష, పట్టుదల వుంటే సాధించలేకపోవడం వుండదు" అని ఆమె నిరూపించింది.

"ఇందిరాగాంధి ఒక కాగితం పులి. ఆమె బలం లెక్కలోకి తీసుకోనవసరం లేదు" అని వ్యాఖ్యానించాడు ఓ ప్రముఖ రాజకీయ విమర్శకుడు - ఈ ఉప ఎన్నిక జరగడానికి ముందు!

ఆ మాట నిజమా? కాదా? అన్నది కాలమే నిర్ణయించాలి! □

# వార్తా వనిత



విశాఖ లయన్ లేడీస్ క్లబ్ అక్టోబరు 15వ తేదీన నిర్వహించిన 'బేబీ షో'లో పాల్గొన్న చిన్నారి పాపలు-వారిని ప్రవేశపెట్టిన మహిళలు

ఈ పోటీలకు డా. కాంతిస్వరూప్, డా. చిత్రగార్లు న్యాయనిర్ణేతలుగా వ్యవహరించారు. —విలేకరి

విశాఖపట్నం నార్తు ఇన్నర్‌వీల్ క్లబ్బు ప్రథమ ప్రతిష్ఠాపనోత్సవం ఆంధ్రా యూనివర్శిటీ కేంపస్ లోని టి. ఎల్. ఎన్. సభాభవనంలో జరిగింది. ఇన్నర్‌వీల్ డిస్ట్రిక్టు-315 ఛెయిర్మన్ శ్రీమతి డి. ప్రమీలారావు ఛార్టర్‌ను బహూకరించి, కార్య



కర్తలచే పదవీస్వీకారం చేయించారు. —విలేకరి



గుంటూరు ఆదర్శ మహిళా మండలి వారు యిటీవల వయోజన విద్యా కేంద్రాన్ని ప్రారంభించారు. 'స్త్రీ, శిశు సంక్షేమ శాఖకు చెందిన అధికారిణి శ్రీమతి జానకీదేవి ఈ కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు. మండలి అధ్యక్షురాలు డాక్టర్ ఎస్. రమణకుమారి ఆధ్వర్యంలో ఆ నాటి కార్యక్రమాలు జరిగాయి.

కలకత్తా ఆంధ్ర మహిళా మండలి తృతీయ వార్షికోత్సవాలు యిటీవల వైభవంగా జరిగాయి. మండలి అధ్యక్షురాలు శ్రీమతి ఎస్. సరస్వతమ్మ, ఉపాధ్యక్షురాలు శ్రీమతి ఎ. విజయలక్ష్మి, కార్యదర్శి కుమారి ఎ. కల్యాణి, కోశాధికారిణి శ్రీమతి జి. మాణిక్యాంబ మండలి అభివృద్ధికి పాటుబడుతూ అనేక సాంస్కృతిక కార్యకలాపాలను, సహాయ కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. సంయుక్త కార్యదర్శి శ్రీమతి ఎ కమల, కార్యవర్గ సభ్యురాండ్రు – శ్రీమతి ఎమ్. సత్యవతి, వి. రత్నం, డి. మీనాక్షి, వై. రత్నమాల, వై. సరస్వతి, వి. కాంతం మండలి కార్యక్రమాలను సమర్థవంతంగా నిర్వహించడంలో పాటుబడుతున్నారు. వారు వారి కార్యకలాపాల గురించిన వివరణతో ఈ మధ్యనే 'సూవెనీర్'ను విడుదల చేశారు.



విశాఖ గ్రామీణ బ్యాంకు (శ్రీకాకుళం శాఖ) మహిళా సాంస్కృతిక సంఘం వారు-వారి బ్యాంకు



హైద్రాబాదు రవీంద్ర భారతిలో ఇటీవల స్థానిక వెంగళరావు నగర్ ఆదర్శ మహిళామండలి ద్వితీయ వార్షికోత్సవం జరిగింది. సభకు ఆంధ్ర ప్రదేశ్ ప్రధాన న్యాయమూర్తి శ్రీ అవుల సాంబ శివరావు అధ్యక్షత వహించారు. రాష్ట్ర సాంఘిక సంక్షేమ సలహా మండలి అధ్యక్షురాలు శ్రీమతి దుర్గా భక్తవత్సల్ ముఖ్య అతిధిగా విచ్చేశారు. శ్రీమతి వేదవతి ప్రభాకర్ లలిత సంగీతంతో ప్రారంభమైన ఆ నాటి వేడుకలు-శ్రీమతి మహా లక్ష్మి, కుమారి మంగళగౌరి నృత్య ప్రదర్శనతో ముగిశాయి. మండలి అభ్యక్షురాలు శ్రీమతి వై. లక్ష్మి ప్రసన్నం వందన సమర్పణ గావించారు.



చోడవరం జిల్లా పరిషత్ కామేశ్వరీ మహిళా మండలి అధ్యక్షురాలు శ్రీమతి సుజాత శివానంద, కార్యదర్శి శ్రీమతి వరలక్ష్మి మనోహర్ యితర సభ్యులూ యిటీవల పేదలకు బియ్యము, బట్టలు పంచిపెట్టారు.




విశాఖపట్నం లయన్ లేడీస్ క్లబ్బు తలపెట్టిన "సూయింగ్ మెషీన్ ప్రాజక్టు" కు అక్టోబరు పదవ తేదీన లయన్స్ డిప్యూటీ డిస్ట్రిక్టు గవర్నరు శ్రీ ఆకెళ్ళ సూర్యనారాయణ ప్రారంభోత్సవం చేసినప్పటి దృశ్యం. ప్రప్రథమంగా అయిదు కుట్టు మిషన్లతో యీ ప్రాజక్టు ప్రారంభించబడింది. ఒక ఉపాధ్యాయిని కుట్టుబోధనా కార్యక్రమాలను నిర్వహిస్తారు. —విలేకరి

వార్షికోత్సవ సందర్భంగా జరిగిన ఉత్సవంలో బ్యాంకులో పనిచేస్తున్న శ్రీమతి లలిత, (కృష్ణుడు) కుమారి విజయ (రాధ) కలిసి 'రాధా మాధవీయం' నృత్య నాటిక వేశారు. ఉద్యోగినులు నాట్యం చేసి మెప్పించడాన్ని పలువురు హర్షించారు. శ్రీకాకుళం కలెక్టరు శ్రీ బి. దానం, బ్యాంకు ఛైర్మన్ శ్రీ బి. రామచంద్రరావులు వారిని అభినందించి, బహుమతులు అందజేశారు. —యస్.



విజయనగరం ఎం. ఆర్. లేడీస్ రిక్రియేషన్ క్లబ్ తమ సభ్యులకు చేతితో చేసిన బొమ్మల పోటీ నిర్వహించారు. ఈ పోటీకి న్యాయనిర్ణేతలుగా శ్రీమతి మంగళాకందూర్, శ్రీమతి శారదా సురేష్, శ్రీమతి కాంతిమతి కృష్ణమోహన్ వ్యవహరించారు. ఈ పోటీలో కుమారి పులిపాక లక్ష్మి మట్టితో రూపొందించిన 'నమూనా గ్రామ' నికి ప్రథమ బహుమతి లభించింది. శ్రీమతి వి. ప్రేమలత, కుమారి ఎ. విజయలక్ష్మి ద్వితీయ, తృతీయ బహుమతులు పొందారు.



ఈ మధ్య ఫిలిప్పైన్స్ రాజధాని మనీలాలో 'మిస్ ఆసియా' అందాల సుందరి పోటీలు జరిగాయి. ఆ పోటీలలో భారతదేశం తరపున పాల్గొన్న కుమారి ప్రీతి కాప్సికర్ 1978 సంవత్సరపు 'అత్యంత ప్రతిభావంతురాలు' గా నిర్ణయించబడింది. ఇరవై ఏళ్ళ ప్రీతి కాప్సికర్ – జాతీయ దుస్తులకై నిర్ణయించిన అవార్డులో కూడా ఉత్తమ బహుమతి గెలుపొందడం మరో విశేషం!

థాయ్‌లండుకు చెందిన పద్దెనిమిదేళ్ళ కుమారి ఫిరిపోర్న్ గువంగలస్‌కు 1978 'మిస్ ఆసియా' అవార్డు లభించింది.



రాజమండ్రి సెంట్రల్ రోటరీ క్లబ్ ఆధ్వర్యంలో యిటీవల యువతి రోటరాక్ట్ క్లబ్ ప్రారంభించబడింది. అధ్యక్షురాలుగా వి. లలిత, కార్యదర్శిగా ఎమ్. విమల, ఉపాధ్యక్షురాలుగా వి. రాణి, సంయుక్త కార్యదర్శిగా కె. రజని, కోశాధికారినిగా సి. సుభ ఎన్నుకోబడ్డారు. యువతి రోటరాక్ట్‌లో మూడువంతుల సభ్యులు స్థానిక కందుకూరి రాజ్యలక్ష్మి స్త్రీల కళాశాలకు చెందిన విద్యార్థినులు వుండడం గమనించదగ్గ విషయం. వీరు నిర్వహించిన సంగీత పోటీలలో దాదాపు 30 మంది వనితలు పాల్గొన్నారు. ఆ నాటి కార్యక్రమానికి పార్లమెంటరీ సెక్రటరీ శ్రీమతి తడవర్తి సత్యవతి ముఖ్య అతిథిగా విచ్చేశారు. కుమారి అమ్మలు నాట్య ప్రదర్శనతో సభ జయప్రదంగా ముగిసింది.



# పుట్టిన రోజులు

పి. శ్రీనివాసప్రసాద్ (చీరాల) పుట్టిన తేది : 7-12-77 తల్లి పేరు : పి. అనసూయ



ఈ నెలలో పుట్టిన రోజులుగల శిశువుల్లో - ఏడాది పిల్లల గ్రూపులో పి. శ్రీనివాసప్రసాద్; రెండేళ్ళ గ్రూపులో జి. కిరణ్; మూడేళ్ళ గ్రూపులో వై. ప్రేమ్‌కుమార్ 'పుట్టినరోజు బహుమతుల'కు ఎన్నికైనారు. నిర్ణయింపబడిన పై ముగ్గురితోబాటు, మొత్తం మీద మూడు గ్రూపులలోనూ ఆరోగ్యంగా కనిపిస్తున్న మరో ఇద్దర్ని ఎన్నికచేసి విడిగా ప్రచురిస్తున్నాము. జనవరి సంచికలోని ఈ శీర్షికకు ఫొటోలు పంపేవారు - వివరాలతోసహా (ఫొటో తీయించిన తేదీ ముఖ్యంగా వుండాలి; ఫొటో వెనక పెన్సిల్‌తో శిశువు పేరు రాయాలి. ఫొటోలు 'క్వార్టర్' సైజుకు తక్కువ సైజులో వుండకూడదు) డిసెంబర్ 5వ తేదీలోగా మాకు చేరేలా పంపగోరుతున్నాము.

వై. ప్రేమ్‌కుమార్ (పెనుగొండ) పుట్టిన తేది : 21-12-75 తల్లి పేరు వై. సరోజిని

యం. లావణ్య (మద్రాసు) పుట్టిన తేది : 31-12-76 తల్లి పేరు యం. శిరీష్‌కుమారి







జి. కిరణ్ (అమలాపురం) పుట్టిన తేది : 23-12-76 తల్లి పేరు : జి. శ్యామల

యం. కల్యాణ చక్రవర్తి (బొంబాయి) పుట్టిన తేది : 6-12-77 తల్లి పేరు : యం. శ్యామల



Edited & Published by B. Viswanatha Reddi for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) & Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., Madras-600 026.

# "అందం చిందే నా జుట్టుకు అందమైన కారణం-టియారా"




"నేను టియారా బ్యూటీ షాంపూ వాడతాను. ఎందుకంటే, ముంచెత్తే ఆ పుష్కలమైన నురుగుతో నా జుట్టుకు తలంటుకోవటంలో వుండే ఆ మధురానుభూతి అంటే నాకెంతో మక్కువ. టియారా బ్యూటీ షాంపూ ఎక్కువ గాఢత గలది–కొంచెం వేసుకుంటేనే చాలు. మీరూ టియారా రూపొందించే అందగత్తె కండి... అదిగూడా మీరు ప్రతినెలా ఖర్చుపెట్టే డబ్బును దుబారా చేయకుండానే."

ఏ రకమైన జుట్టుకైనా
సరిపడే టియారా షాంపూ:

- టియారా ఎగ్ షాంపూ
  పోషణలేని జుట్టు సంరక్షణకోసం ప్రోటీన్, విటమిన్ ఎ, డి లతో.
- టియారా లెనోలిన్ షాంపూ
  పొడి పొడి జుట్టు సంరక్షణ కోసం.
- టియారా షీకాకాయ్ పాంపూ
  పొడుగైన జుట్టు సంరక్షణ కోసం విసిరి, బ్రహ్మి పదార్థాలతో
- టియారా లెమన్ షాంపూ
  జిడ్డువోడే జుట్టు సంరక్షణ కోసం
- టియారా హెయిర్ కండిషనర్
  కూడా దొరుకుతుంది
- టియారా బేన్ + డేన్ క్రీమ్ షాంపూ
  చుండ్రువున్న జుట్టు సంరక్షణకోసం.




టియారా
షాంపూ




HELENE CURTIS

**కేశ సంరక్షణ విషయాల్లో ప్రపంచ నాయకులు: హెలిన్ కర్టిస్**

everest/78/JKH/39-t

REGD. No. TN/MS(S)/64 VANITHA (Telugu) Decem




